నంధకారప్రకాశములవలెఁ బరస్పరవిరుద్ధములై యుండ వలయును. కర్మాజ్ఞానముల స్వరూపస్వభావములు విరుద్ధములుకావు. అజ్ఞానమెట్లు జడస్వరూపమో, యట్లే కర్మములును జడస్వరూపములు. భేదమును స్ఫురింపఁజేయుట యజ్ఞానమున కెట్లు స్వభావమో, యట్లే భేదము నవలంబించియుండుట కర్మములకు స్వభావము. కావున నవిరుద్ధములగు కర్మము లజ్ఞానమును నివర్తింపఁజాలవు.

జ్ఞానకర్మముల కారణములు, స్వరూపములు, కార్యములు, ఆశ్రయములు అంధకార ప్రకాశములవలెఁ బరస్పర విరుద్ధములగుటచే వానికి సముచ్చయ మెన్నఁడును సంభవింపదు. కావున నవిరెండును గలసి యజ్ఞానమును నివర్తించుననుట హాస్యాస్పదము. జ్ఞానము ప్రమాణము వలనఁ బుట్టుచున్నది. కర్మము లభిమాన రాగద్వేషాదుల వలనఁ బుట్టుచున్నవి. జ్ఞానముయొక్క స్వరూపము ప్రకాశము. కర్మముల స్వరూప మప్రకాశము. జ్ఞానముయొక్క కార్య మజ్ఞాననివృత్తి. కర్మముల కార్యము లుత్పత్తి, నాశము, ప్రాప్తి, వికృతి, సంస్కారము. జ్ఞానమున కాశ్రయ మాత్మ. కర్మముల కాశ్రయము భేదప్రపంచము. పరిశుద్ధాంతఃకరణముగల సాధనచతుష్టయ సంపన్నుఁడు జ్ఞాననిష్ఠ కధికారి. మలినాంతఃకరణముగల సాధనరహితుఁడు కర్మనిష్ఠకధికారి. జ్ఞానాధికారి కీ యుపనిషత్తుయొక్క ప్రథమ మంత్రమున జ్ఞాననిష్ఠ చెప్పఁబడెను. కర్మాధికారి కీ మంత్రమునఁ గర్మనిష్ఠ చెప్పఁబడుచున్నది.

మనుష్య శరీరాభిమానముగల నీవు నూఱు సంవత్స
రములు సుఖముగ జీవింపఁగోరినచో జీవితపర్యంతము
సమష్టిస్వార్థముకొఱకు నిత్యనైమిత్తికాది నిష్కామకర్మము
లను, అహంగ్రహోపాసనాదులను జేయుము. నిష్కామ
కర్మములవలన నీ యంతఃకరణమునందలి స్వార్థరూపమైన
మాలిన్యము నశించును. అహంగ్రహోపాసనాదులవలనఁ
జిత్తైకాగ్రత కలుగును. చలనమాలిన్యములులేని పరిశుద్ధాం
తఃకరణమున వివేకాదు లుదయించును. వివేకాది సాధన
చతుష్టయ సంపన్నుఁడవైనచో శ్రవణమునం దాసక్తి
జనించును. అప్పుడు నీవు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుఁడైన సద్గు
రువు నాశ్రయించి వేదాంతశాస్త్రమును శ్రవణముచేయుము.
సద్గురూపదిష్ట మహావాక్యశ్రవణముచే నాత్మాపరోక్ష
జ్ఞాన ముదయించును. ఆ జ్ఞానమువలన మోక్షమును
బొందఁగలవు.

నిత్యనైమిత్తికాది నిష్కామకర్మము లాచరింపనిచో
నీ యంతఃకరణమున స్వార్థరూప మాలిన్యము నశింపకుం
డుటయేకాక ప్రత్యవాయ దోషముకూడఁ గలుగును. ఆత్మ
జ్ఞానాధికారములేని నీకు నిష్కామముగ సమష్టిస్వార్థము
కొఱకుఁ గర్మము లాచరించుటకంటె నన్యమగు మఱియొక
యుత్తమమార్గము లేదు. కావున జీవితపర్యంతము సమష్టి
స్వార్థముకొఱకు నిష్కామకర్మము లాచరింపుము. ఫలమును
గోరి వ్యష్టిస్వార్థముకొఱకుఁ గర్మములను జేయకుము.
అవి నీ యంతఃకరణమును మాలిన్యమొనర్చి నిన్ను పతి

తుని జేయును. సమష్టిస్వార్థమునందే వ్యష్టిస్వార్థ మంతర్గతము. సమష్టిస్వార్థముకొఱకుఁ జేయు కర్మములవలన నీకుఁ బాపము జనింపదు. కావున నిన్ను కర్మబంధ మంటుకొనదు. కర్మములు జడములు. వానివలనఁ బుణ్యాపాపములు కలుగవు. కర్త యుద్దేశము ననుసరించియే కర్మములకుఁ బుణ్యాపాపములు సంభవించును. కర్త వ్యష్టిస్వార్థుఁడైనచో నతని కర్మములు పాపములు, దుఃఖదాయకములు. సమష్టిస్వార్థుఁడైనచోఁ బుణ్యములు, సుఖప్రదములు.

**అజ్ఞాని నింద :**

**అసూర్యా నామ తే లోకా, అన్ధేన తమసా వృతాః,**
**తాగ్ంస్తే, ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః. 3**

| | |
|---|---|
| అన్ధేన = గాఢతమమగు | యేకేచ = ఎవ్వారలు |
| తమసా = అజ్ఞానముచే | ఆత్మహనః = ఆత్మఘాతుకులో |
| ఆవృతాః = ఆవృతములగు | తేజనాః = ఆ జనులు |
| తేలోకాః = ఆ జన్మములు | ప్రేత్య = మరణించి |
| అసూర్యాః = అసురములని | తాన్ = ఆ యసురజన్మములను |
| నామ = ప్రసిద్ధములు. | అభిగచ్ఛన్తి = పొందుచున్నారు. |

మోక్షమునకు జ్ఞానమొక్కటియే సాక్షాత్సాధనము. నిష్కామకర్మము పరంపరాసాధనము. ఇంతకంటె నన్యమగు మార్గములేదు. అజ్ఞానులీ రెంటిని ద్యజించి జన్మజన్మాంతర విషయభోగములకొఱకుఁ గామ్య నిషిద్ధ కర్మములను, దేవతా భూత ప్రేత పిశాచారాధనలను జేసెదరు.

అట్టి మూఢు లీ దేహత్యాగానంతరము పొందు స్థితి యీ మూడవ మంత్రమున వర్ణింపఁబడుచున్నది.

గాఢతమమగు నజ్ఞానముచే నావృతమైన శరీరము లాత్మయొక్క యథార్థస్వరూపము నెఱుంగుటకు యోగ్యములు కావు. కావున నవి యాసురములు. ఆత్మజ్ఞానము గాని, జ్ఞానాపేక్షగాని లేని యజ్ఞానులు జననమరణాది వికారములు లేని పరమాత్మకంటెఁ బ్రత్యగాత్మభిన్నుఁడు కాఁడని తెలియఁజాలరు. ఆత్మ దేహేంద్రియ సంఘాతవిశిష్టమని గాని, దేహేంద్రియ సంఘాతమే యాత్మయనిగాని తలంచెదరు. అట్టి మూఢులు దేహేంద్రియాదుల ధర్మములైన జననమరణాది వికారములను నిర్వికారుఁడైన యాత్మయందుఁ గల్పించుచున్నారు. జననమరణాదులులేని యాత్మకు జననమరణాదులనుగల్పించు యజ్ఞానులే యీమంత్రమున నాత్మఘాతుకులని చెప్పఁబడెను. ఇట్టి యాత్మఘాతుకు లాత్మయొక్క వాస్తవస్వరూపము నెఱుంగరు. ఆత్మస్వరూపము నెఱుంగుటకు సాక్షాత్సాధనమైన జ్ఞాననిష్ఠనుగాని, పరంపరా సాధనమైన నిష్కామకర్మనిష్ఠనుగాని యవలంబింపరు. కేవల స్వార్థులై జన్మజన్మాంతర విషయభోగముల కొఱకుఁ గామ్య నిషిద్ధ కర్మములను, వివిధములగు దేవతోపాసనలను, భూత ప్రేత పిశాచారాధనలను మాత్రమే చేయుదురు.

అట్టి మూఢు లీ మనుష్యశరీరమును విడిచినపిదప తాము చేసిన కర్మోపాసనారాధనల ననుసరించి యాసుర

ములగు నానావిధ యోనులయందుఁ బుట్టుచుఁ జచ్చుచు ననేక దుఃఖపరంపరలను బొందుచున్నారు.

**ఆత్మస్వరూప వర్ణనము :-**

అనేజ దేకం మనసో జవీయో, నైన ద్దేవా ఆప్నువన్
పూర్వమర్షత్, తద్ధావతో ఽన్యా నత్యేతి తిష్ఠత్, తస్మి
న్నపో మాతరిశ్వా దధాతి. 4

ఏతత్ = ఈ యాత్మ
అనేజత్ = అచలము.
ఏకమ్ = ఏకము.
మనసః = మనస్సుకంటె
జవీయః = శీఘ్రగామి.
పూర్వమ్ = మనస్సు పోవుటకుఁ బూర్వమే
అర్షత్ = పోయియుండును.
దేవాః = ఇంద్రియములు
నఆప్నువన్ = పొందలేవు.
తత్ = ఆయాత్మ
ధావతః = పరుగిడుచున్న
అన్యాన్ = కొలవాయ్వాదులను గూడ
అత్యేతి = అతిక్రమించుచున్నది.
తిష్ఠత్ = నిర్వికారముగనుండు
తస్మిన్ = ఆ యాత్మతత్త్వమునందు
మాతరిశ్వా = సూత్రాత్మ
అపః = సర్వప్రాణుల చేష్టలను
దధాతి = ధరించుచున్నాఁడు.

ఏ యాత్మస్వరూపము నెఱుంగక యజ్ఞానులు దేహేంద్రియాది సంఘాతమే యాత్మయని తలంచి జననమరణరూప సంసారమునఁ గూలుచున్నారో, ఏ యాత్మస్వరూపము నెఱింగి జ్ఞానులు నిఖిలదుఃఖనివృత్తి, నిరతిశయానంద ప్రాప్తి రూపమగు మోక్షమును బొందుచున్నారో ఆ

ప్రత్యగభిన్న పరమాత్మస్వరూప మీ మంత్రమున వర్ణింపఁ బడుచున్నది.

ఈ ప్రత్యగభిన్న పరమాత్మ చలనకంపనాది సమస్త క్రియలు లేని యచలము. కల్పిత సర్ప దండ మాలాదుల యందున్న రజ్జువువలె కల్పిత నామరూపక్రియాత్మక సమస్త ప్రపంచమునం దేకము. క్షణములో దేశ దేశాంతరములు, లోకలోకాంతరములు, కాలకాలాంతరములు తిరిగివచ్చు మనస్సుకంటె నది శీఘ్రగామి. సంకల్పరూపమగు మన స్సెచ్చటెచ్చటికిఁ బోవునో యచ్చటచ్చటి కా పరమాత్మ నిరపేక్షక వ్యాపకమగుటచే నంతకుఁబూర్వమే స్వతస్సిద్ధము.

అది చక్షురాదీంద్రియములకు గోచరముకాదు. ఇంద్రియములకు గోచరమగు విషయములు బాహ్యములు. వానికంటె నింద్రియములంతరములు. వానికంటె సాభాసాంతఃకరణ మంతరము. సర్వాధిష్ఠానమగు పరమాత్మ సర్వాంతరము. ఇంద్రియముల కంతరముననున్న యంతఃకరణమునకే విషయముకాని పరమాత్మ యింద్రియముల కెట్లు గోచరమగును ? అజ్ఞానకల్పితమగు నింద్రియములకు, విషయములకు, సాభాసాంతఃకరణమునకు నది ప్రకాశకము. ఆ పరమాత్మ దేశ కాల వస్తు కృతపరిచ్ఛేదములు లేక సంపూర్ణముగ నిండియున్నది. కావున నది పరుగిడుచున్న కాలవాయ్వాదులను, శీఘ్రగమనముగల మనస్సును గూడ నతిక్రమించి స్వతస్సిద్ధముగ వ్యాపించియున్నది.

అంతరిక్షముననున్న వాయువు మేఘజలమునుధరించి వర్షరూపమున వనపర్వతాదులయందు విభజించువిధమునఁ బ్రళయకాలమున మాయావిశిష్ట పరమాత్మ జగత్సంస్కారములను ధరించి సృష్టికాలమున సూత్రాత్మరూపముతో నధిష్ఠాన పరమాత్మయందు జీవుల కర్మములకు యోగ్యములయిన వ్యష్టి, సమష్టి,స్థూల, సూక్ష్మప్రపంచమునుసృజించి విభజించుచున్నాఁడు.

**త దేజతి॰త న్నైజతి॰త ద్దూరే॰ త ద్వన్తికే,**
**త ద న్తరస్య॰సర్వస్య॰తదు సర్వ స్యాస్య॰ బాహ్యతః. 5**

| | |
|---|---|
| తత్ = ఆయాత్మ | తత్ = అది |
| ఏజతి = చలించును. | అస్య = ఈ |
| తత్ = అది | సర్వస్య = సమస్తప్రపంచముయొక్క |
| న ఏజతి = చలింపదు. | అన్తః = లోపలగలదు. |
| తత్ = అది | ఉ = మఱియు |
| దూరే= దూరమునందుండును. | తత్ = అది |
| ఉ = మఱియు | అస్య = ఈ |
| తత్ = అది | సర్వస్య = సమస్తప్రపంచముయొక్క |
| అన్తికే = సమీపముననుండును. | బాహ్యతః = వెలుపలనున్నది. |

ఆత్మసత్తచే స్థూలశరీరము గమనాగమనాదిక్రియలు చేయుచున్నది. సూక్ష్మశరీరము జన్మజన్మాంతరములను బొందుచున్నది. ఈ స్థూల సూక్ష్మోపాధు లజ్ఞానముచే నాత్మయందుఁ గల్పింపఁబడుచున్నవి. బాలుఁ డంతరిక్ష

మున మేఘములు పరుగెత్తుచుండుటను జూచి చంద్రుఁడు పరుగెత్తుచున్నట్లు తలంచుచున్నాఁడు. అట్లే యజ్ఞాని స్థూల సూక్ష్మ శరీరోపాధుల చలనత్వాది ధర్మములను జూచి నిరుపాధికము, నిశ్చలము నగు నాత్మ చలించుచున్నదని తలంచుచున్నాఁడు. ఉపాధుల సంబంధమువలననే యది చలించుచున్నట్లు తోఁచుచున్నది. స్థూల సూక్ష్మాది సర్వో పాధులు లేని యాత్మ చలింపదు. ఆత్మవేత్త సర్వోపాధు లను విచారించి "ఇది ఆత్మకాదు, ఇది ఆత్మకాదు" అని నిషేధించి యాకాశమువలె నచంచలము, నక్రియము నగు నాత్మతత్త్వమును సర్వత్ర యనుభవించుచున్నాఁడు. కావున నిరుపాధికమగు నాత్మ చలింపదు.

ఆ యాత్మ యజ్ఞానులకు శతకోటి సంవత్సరముల కైనను లభింపదు. లోకలోకాంతరములు, దేశదేశాంత రములు తిరిగినను దెలియఁబడదు. జన్మ జన్మాంతరము లొందినను పొందఁబడదు. ఇంద్రియములకును, మనస్సు నకును, బుద్ధికిని గోచరముగాదు. కావున బహుదూరము. ఆ యాత్మ తానేయై యుండుటచే నాత్మవేత్త కత్యంత సమీపము.

అది సర్వచరాచర ప్రపంచమున కంతరముననను, బాహ్యముననను గలదు. సముద్రజలమునందుఁ దోఁచు బుద్బుద తరంగాదులకు లోపల వెలుపల నీరే నిండియుండు విధమున నామ రూప క్రియాత్మక సమస్తప్రపంచమునకు లోపల వెలుపల నాత్మ వ్యాపించి నిండియున్నది.

## సర్వాత్మదృష్టి

యస్తు సర్వాణి భూతా.న్యాత్మ న్యే వానుపశ్యతి,
సర్వ భూతేషు చాత్మానం.తతో న.విజుగుప్సతే! 6

యః తు = ఎవ్వఁడు
సర్వాణి = సమస్తములయిన
భూతాని = భూతములను
ఆత్మని ఏవ = ఆత్మయగు తనయందే
అనుపశ్యతి = చూచుచున్నాఁడో,
సర్వభూతేషు చ = సమస్త భూతముల యందును
ఆత్మానమ్ = ఆత్మయగు తన్ను
అనుపశ్యతి = చూచుచున్నాఁడో,
సః = వాఁడు
తతః = ఆట్లుండుటవలన
న విజుగుప్సతే = రోతను బొందఁడు.

యథార్థదర్శి జలమునందు బుద్బుద తరంగాదులను, బుద్బుద తరంగాదులయందు జలమును జూచువిధమున సంశయ విపర్యయములు లేని యాత్మవేత్త యవ్యాకృతుఁడు మొదలు తృణపర్యంతముగల సమస్త కార్య కారణాత్మక ప్రపంచము నాత్మయగు తనయందును, సమస్త ప్రపంచమునందు నాత్మయగు తన్ను జూచుచున్నాఁడు. సర్వభూతములను దనయందుఁ జూచుటచే నవి తనకంటె నన్యములను పరోక్షభ్రాంతి నశించుచున్నది. సర్వభూతముల యందుఁ దన్ను జూచుటచేఁ తాను సర్వభూతములకంటె భిన్నుఁడనను పరిచ్ఛిన్నభ్రాంతి నివర్తిల్లుచున్నది. ఇట్లు జల తరంగ దృష్టాంతరీతిగా నాత్మయందు జగత్తును, జగత్తునం దాత్మను జూచు నాత్మవేత్తకు ద్వైతభావము గలుగదు.

కావున నతనికి రాగద్వేషాదు లుదయింపవు. అందువలన స్తుతినిందాదు లొనర్పఁడు. నిత్య శుద్ధ బుద్ధ ముక్తమగు నాత్మకంటె నన్యములేదని తలంచు నాత్మవేత్త దేనిని స్తుతించును? దేనిని నిందించును? దేనిని జూచి రోత జెందును?

**జ్ఞాని లక్షణము, జ్ఞానఫలము:**

**యస్మి న్సర్వాణి భూతా న్యాత్మై వా భూ ద్విజానతః,**
**తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః. 7**

యస్మిన్ = ఏకాలమునందు
విజానతః = జ్ఞానికి
సర్వాణి = సమస్తములైన
భూతాని = భూతములును
ఆత్మైవ = తానే
అభూత్ = ఆయెనో,
తత్ర = ఆకాలమునందు
ఏకత్వమ్ = ఏకత్వమును
అనుపశ్యతః = ఎఱింగినట్టివానికి
కః మోహః = మోహమేది ?
కః శోకః = శోకమేది ?

అధిష్ఠాన రజ్జుజ్ఞానము కలిగినతోడనే యారోపిత సర్ప దండ మాలాదులు రజ్జువే యైనవిధమున నధిష్ఠానాత్మ జ్ఞానము కలిగినతోడనే యారోపిత జగ త్తాత్మయే యగుచున్నది. సంశయ విపర్యయ రహితముగ నిట్టి సర్వాత్మ జ్ఞానముగల యాత్మవేత్తకు శోకమోహాదులు గలుగవు. శోకమోహములు మనోధర్మములు. ఆఁకలిదప్పులు ప్రాణధర్మములు. జననమరణములు దేహధర్మములు. ఈ

యాఱును షడూర్మలు. ఈ మంత్రమున శోక మోహములు షడూర్ముల కుపలక్షకములుగఁ జెప్పఁబడెను.

ఇవి యజ్ఞానముచే నాత్మయందుఁ గల్పింపఁ బడుచున్నవి. ఆత్మవేత్త కజ్ఞానము లేదు. దాని కార్యములయిన షడూర్ములును లేవు. షడూర్ములు లేకపోవుటయే జ్ఞాని లక్షణము. వాని నివృత్తికొఱకే జిజ్ఞాసు వాచార్యుని సమీపమున కేగి తత్త్వమస్యాది మహావాక్యములద్వారా యాత్మజ్ఞానమును బొందుచున్నాఁడు. ఆత్మజ్ఞానమునకు షడూర్ముల నివృత్తియే ఫలము. ఈ శ్రుతియందు షడూర్ములు లేకపోవుట జ్ఞానికి లక్షణమనియు, ముముక్షువు యొక్క యాత్మజ్ఞానమునకు ఫలమనియుఁ జెప్పఁబడెను.

**ఆత్మస్వరూప నిరూపణము :**

స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం శుద్ధ
మపాపవిద్ధమ్, కవి ర్మనీషీ పరిభూః స్వయమ్భూ ర్యాథా
తథ్యతో ఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః. 8

సః = ఆయాత్మ

పర్యగాత్ = సర్వత్ర వ్యాపించియున్నాఁడు.

శుక్రమ్ = దేదీప్యమానుఁడు.

అకాయమ్ = సూక్ష్మశరీరములేనివాఁడు.

అవ్రణమ్ = గోళకరూపమగు ఛిద్రమును,

అస్నావిరమ్ = నాడులును గలిగిన స్థూలశరీరము లేనివాఁడు.

శుద్ధమ్ = అవిద్యారూపమగు కారణశరీరములేని నిర్మలుఁడు.

అపాపవిద్ధమ్ = శరీరత్రయ ధర్మ రూపమగు పాపము లేనివాఁడు.
కవిః = సర్వద్రష్ట.
మనీషీ=మనస్సును ప్రేరేపించువాఁడు.
పరిభూః = అన్నిటికంటె మీఁద నుండువాఁడు.
స్వయమ్భూః = స్వతస్సిద్ధముగనున్న వాఁడు.
యాథాతథ్యతః = యథోచితము అగు
అర్థాన్ = పదార్థములను
శాశ్వతీభ్యః = నిత్యులయిన
సమాభ్యః = సంవత్సరములను పేర్లు గల ప్రజాపతులకొఱకు
వ్యదధాత్ = సృజించెను.

ఆ యాత్మ దేశ, కాల, వస్తుకృత పరిచ్ఛేదములు లేక సర్వత్ర వ్యాపించియున్నాఁడు. దేదీప్యమానుఁడు. గోళకములు, నాడులు మొదలగువానితోఁగూడిన సమస్త వ్యష్టి సమష్టి స్థూలశరీరములు లేనివాఁడు. వ్యష్టి సమష్ట్యాత్మక సమస్త సూక్ష్మశరీరములు లేనివాఁడు. మాయా విద్యారూప సమష్టి వ్యష్టి కారణ శరీరములు లేనివాఁడు. శరీరత్రయ ధర్మములయిన కర్తృత్వాకర్తృత్వములు, పుణ్య పాపములు, జన్మమరణములు, సుఖదుఃఖములు, బంధ మోక్షములు మొదలగు ద్వంద్వరూప పాపములు లేక శరత్కాలాకాశమువలె నిర్మలమైనవాఁడు. సర్వము నెఱుంగు వాఁడు. మనస్సు దాని వ్యాపారమునందుఁ బ్రవర్తించుటకుఁ బ్రేరేపించువాఁడు.

ఆకాశ కాల వాయ్వాది వ్యాపక పదార్థములచేఁ గూడ నాచ్ఛాదింపఁ బడక సర్వము నాచ్ఛాదించువాఁడగుటచేతను, భూతభౌతిక జగత్తును నియమించు నాయ

కుఁడగుటచేతను, సర్వమునకు మీఁదనున్నాఁడు. తన కే కారణము లేక సర్వమునకుఁ గారణమైనవాఁ డగుటచే స్వయంభువు. అట్టి పరమేశ్వరుఁ డనంతకాలమునుండి ప్రవాహముగ జరుగుచున్న సంవత్సరములను ప్రజాపతుల (కాలము) కొఱకు అయనములను, ఋతువులను, మాస ములను, వారములను, దినములను, వాని ధర్మములను, ఆయాకాలమునకుఁ దగిన పదార్థములను, వాని కర్మము లను సృజించెను. (ఇచ్చట సంవత్సరరూపమగు కాలము ప్రజాపతిగా వర్ణింపఁబడెను.)

ప్రథమ ఖండము సంపూర్ణము.

## ద్వితీయ ఖండము

### కర్మోపాసనల నింద:

అన్ధం తమః ప్రవిశన్తి యే౽విద్యా ముపాసతే,
తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః. 9

| | |
|---|---|
| యే = ఎవ్వరు | యే = ఎవ్వరు |
| అవిద్యామ్ = కర్మమును | విద్యాయామ్ = దేవతాజ్ఞానమునందు |
| ఉపాసతే = సేవించుచున్నారో, | రతాః = ఆసక్తిగలవారలో, |
| తే = వారు | తే = వారు |
| అన్ధమ్ = అదర్శనాత్మకమగు | తతః = అంతకంటె |
| తమః = అజ్ఞానమును | భూయః ఇవ = గొప్పదియగు |
| ప్రవిశన్తి = ప్రవేశించుచున్నారు. | తమః = అజ్ఞానమును |
| ఉ = మఱియు | ప్రవిశన్తి = ప్రవేశించుచున్నారు. |

అజ్ఞానులయిన వ్యష్టిస్వార్థులు కొందఱు ప్రపంచము నందలి భూత భౌతిక పదార్థములయందుఁ గొన్ని తమవని వానిపైని సొంత హక్కులను స్థాపించుకొనుచున్నారు. తక్కిన పదార్థము లితరులవని తలంచి వానినిగూడ దోపిడి చేయుట కనేక కర్మములు చేయుచున్నారు. ఇట్టి పరస్పర పీడాపహారణాది నిషిద్ధకర్మములవలనఁ బ్రపంచమున నేరి కిని సుఖము గలుగదు. అందఱకు దుఃఖములే సంభవించు చున్నవి. కొందఱు పరలోక భోగభ్రాంతిచే వ్యయప్రయా

సల కోర్చి జ్యోతిష్టోమాది కామ్యకర్మముల నాచరించె దరు. గగనారవిందములవలె నా ఫలములు మిథ్యయగుచే వానివలనఁగూడ నేసుఖమును బొందఁజాలరు. ఈ యజ్ఞాను లందఱు మృతినొందినపిదప వారివారి వ్యష్టిస్వార్థముల ననుసరించి గాఢతమాజ్ఞానావృతములగు నీచ యోనుల యందుఁ బుట్టుచున్నారు.

కొందఱు వ్యష్టిస్వార్థమునుగోరి యిహపరవిషయ భోగములకొఱకుఁ ద్రిపుండ్రోర్ధ్వ పుండ్రాదులను ధరించి రుద్రాక్ష తులసిమాలలను ద్రిప్పుచు జపములు చేయు చుందురు. కొందఱు సిద్ధాసన, పద్మాసనాదులను వేసికొని కూర్చుండి ధ్యాననిమగ్నులగుదురు. కొందఱు చిఱుగజ్జెలు, చిట్టితాళములు మొదలగువానినిబూని నృత్య గీతాదుల నొనర్చెదరు. కొందఱు జడలు విరియబోసికొని నుదుట కుంకుమరేఖలు దిద్ది శివమాడుదురు. కొందఱు దారు, మృణ్మయ, లోహ, పాషాణాది ప్రతిమలకు వివాహ గర్భాధానాదుల నొనర్చి సంతోషించెదరు. ఇట్లు తాము కష్టింపక, యితరజీవుల కష్టార్జితములతో జీవించుచు, సర్వ పదార్థములు తమ యుపాస్యదేవత లొసంగెదరను యంధ విశ్వాసముతో వివిధములగు దేవతలను, భూత ప్రేత పిశా చాదులను నారాధించు మూఢులు వ్యష్టి స్వార్థబుద్ధితోఁ గామ్య నిషిద్ధకర్మము లాచరించువారికంటె నీచులు. వీ రీ జన్మమున నన్నవస్త్రాదుల కనేక దుఃఖముల ననుభవించి మరణించినపిదపఁ నాకర్మిష్ఠులకంటె నధి కా జ్ఞానావృతము

లయిన నీచయోనులయందుఁ బుట్టు చున్నారు. వీరి దుఃఖ ములు వర్ణనాతీతములు.

**ఆచార్యోక్తి :**

అన్య దేవాహు ర్విద్యయా౽న్యదాహు రవిద్యయా,
ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్విచచక్షిరే. 10

విద్యయా = దేవతోపాసనముచేఁ గలుగు ఫలము
అన్యత్ = వేఱని
ఆహుః = వేదములు చెప్పుచున్నవి.
అవిద్యయా = కర్మముచేఁ గలుగు ఫలము
అన్యత్ = వేఱని
ఏవ = నిశ్చయముగ
ఆహుః = వేదములు చెప్పుచున్నవి.
ఇతి = ఇట్లు
యే = ఏ యాచార్యులు
నః = మాకు
విచచక్షిరే = విస్పష్టముగ బోధించిరో
తేషామ్ = ఆ
ధీరాణామ్ = ధీరులయిన యాచార్యులవలన
తత్ = దానిని
శుశ్రుమ = వింటిమి.

భేదోపాసన, యభేదోపాసన యని యుపాసనలు రెండువిధములు. అందు సమస్తదేవతలు తనకంటె భిన్నులని తలంచి, యైశ్వర్యాదులకొఱకు వారి నారాధించుట భేదోపాసన. సర్వము తనకంటె భిన్నముకాదని తలంచి, నిష్కామముగ నుపాసించుట యభేదోపాసన. భేదోపాసనకు ఫలము నీచాతి నీచయోని ప్రాప్తి. అభేదోపాసనకు ఫలము చిత్తైకాగ్రత. అట్లే కామ్య నిష్కామ్య భేదముచేఁ గర్మములు రెండువిధములు. వ్యష్టి స్వార్థము

కొఱకుఁ జేయు జ్యోతిష్టోమాదులు కామ్యకర్మములు. సమష్టిస్వార్థముకొఱ కాచరించు నిత్యనైమిత్తికాదులు నిష్కామకర్మములు. కామ్యకర్మములకు ఫలము నీచయోని ప్రాప్తి. నిష్కామకర్మములకు ఫల మంతఃకరణశుద్ధి.

ఈ ఫలములను వేదములే చెప్పుచున్నవి. ఆ వేదముల నెవ్వరును స్వయముగఁ జదువరాదు. గురు సంప్రదాయముగల శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులవలన మాత్రమే శ్రవణము చేయవలయును. ఇతరులవలన శ్రవణము చేయరాదు. అట్టి మహాత్ములయిన యాచార్యులే మాకు దేవతోపాసనల ఫలము వేఱనియుఁ, గర్మములఫలము వేఱనియు స్పష్టముగ బోధించియుండిరి.

**కర్మోపాసనల సముచ్చయము :**

**విద్యాం చా విద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ,**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా మృత మశ్నుతే.11**

యః = ఎవ్వఁడు
విద్యాంచ = అధిదేవతోపాసనను,
అవిద్యాంచ = నిష్కామకర్మానుష్ఠానమును,
తత్ = ఆ
ఉభయమ్ = రెంటిని
సహ = సముచ్చయముగ
వేద = తెలిసియాచరించుచున్నాడో,
సః = వాఁడు
అవిద్యయా = నిష్కామ కర్మానుష్ఠానముచే
మృత్యుమ్ = మృత్యువును
తీర్త్వా = దాఁటి
విద్యయా = అధిదేవతోపాసనచే
అమృతమ్ = దేవతాత్మభావమును
అశ్నుతే = పొందుచున్నాఁడు.

వ్యష్టి సమష్టి యందంతర్గతము. సమష్టిప్రపంచము కంటె నన్యముగ వ్యష్టిశరీరములులేవు. సమస్త వ్యష్టిస్థూల శరీరములు సమష్టి స్థూలప్రపంచమునం దంతర్గతములు. వ్యష్టి సూక్ష్మశరీరములన్నియు సమష్టి సూక్ష్మప్రపంచము నం దంతర్గతములు. వ్యష్టికారణ శరీరములు సమస్త ప్రపంచ పరిణామకారణమైన మాయయం దంతర్గతములు. వ్యష్టి సమష్టి స్థూల సూక్ష్మ కారణాత్మక సమస్తప్రపంచమున కధిష్ఠాన చైతన్యమేకము. ఇందు వ్యష్టి అధ్యాత్మరూపము. సమష్టి అధిదేవతారూపము. ఈ భావము నెఱుంగుటయే యధిదేవతాజ్ఞానము. వ్యష్టిభావముగలవాఁడు శరీరశ్రేయస్సుకొఱకు వివిధకార్యము లాచరించును. సమష్టిభావము గలవాఁడు ప్రపంచమునఁ గల సర్వప్రాణుల శ్రేయస్సు కొఱకు వ్యష్టిగను, సమష్టిగను సమస్త కర్మముల నాచరించును. వ్యష్టి సమష్టియం దంతర్గతమగుటచే సమష్టి స్వార్థముకొఱ కాచరించు నిత్యనైమిత్తికాది నిష్కామ కర్మములవలన వ్యష్టిస్వార్థముగూడఁ జేకూరును.

ఇట్లు సద్గురువుద్వారా కర్మోపాసనల సముచ్చయము నెఱింగి యాచరించినచో మనుష్యజీవితమును నీవు సుఖముగఁ గడపఁగలవు. నీ వాచరించు సమష్టి కర్మముల ననుసరించి మృతినొందినపిదప నీకు జననమరణములు గల వ్యష్టిశరీరములు గలుగవు. కావున నీవు మృత్యువును దాఁటినవాఁడవగుదువు. అంతియకాక నీ దృఢమైన సమష్టి భావము ననుసరించి యధిదేవతా రూపము నొంది ప్రళ

యానంతర మా సమష్ట్యుపాధినిఁ గూడఁ ద్యజించి బ్రహ్మ స్వరూపామృతమును బొందుదువు.

**కార్య కారణోపాసనల నింద :**

**అన్ధం తమః ప్రవిశన్తి యే౽సంభూతి ముపాసతే,**
**తతో భూయ ఇవ తే తమో య ఉ సమ్భూత్యాగ్ం రతాః.12**

| | |
|---|---|
| యే = ఎవ్వరు | యే = ఎవ్వరు |
| అసమ్భూతిమ్ = అవ్యాకృతుని | సమ్భూత్యామ్ = హిరణ్యగర్భునియందు |
| ఉపాసతే = ఉపాసించుచున్నారో, | రతాః = ఆసక్తికలవారలో, |
| తే = వారు | తే = వారు |
| అన్ధమ్ = అదర్శనాత్మకమైన | తతః = అంతకంటె |
| తమః = అజ్ఞానమును | భూయః ఇవ = గొప్పదియగు |
| ప్రవిశన్తి = పొందుచున్నారు. | తమః = అజ్ఞానమును |
| ఉ = మఱియు | ప్రవిశన్తి = పొందుచున్నారు. |

వటబీజమున వటమహీరుహ సంస్కారములుండు విధమున ప్రళయమునందు సమస్త స్థూల సూక్ష్మ ప్రపంచ సంస్కారము లవ్యాకృతునియం దుండును. ఈ యవ్యాకృతుఁడు పుట్టుకలేనివాఁడగుటచే నీ మంత్రమున 'అసంభూతి' యని చెప్పఁబడెను. జన్మ జన్మాంతర విషయభోగముల కొఱకుఁ గామ్య నిషిద్ధ కర్మము లాచరించుచు, వ్యష్టి స్వార్థ ప్రాప్తికొఱ కవ్యాకృతు నారాధించెడి యజ్ఞానులు మరణించిన పిదప నజ్ఞానావృతములగు నీచయోనులయందుఁ బుట్టుచున్నారు.

వటబీజమునుండి పక్వమైనపిదప నంకురముదయించు రీతి నవ్యాకృతునినుండి ప్రపంచ సంస్కారములు పక్వ దశను బొందిన పిదప సూక్ష్మప్రపంచము వ్యక్తమగును.

సూక్ష్మప్రపంచ విశిష్ట చైతన్యమే హిరణ్యగర్భుఁడు. ఆ హిరణ్యగర్భుఁడే యీ మంత్రమున 'సంభూతి'యని చెప్పఁబడెను. ఐహికాముష్మిక సుఖములనువీడి యణిమాద్యై శ్వర్యములకొఱకై హిరణ్యగర్భు నారాధించుచు, యోగ యోగాంగాద్యభ్యాసములను జేయుచు నుండువారు మర ణించిన పిదప నా యవ్యాకృతారాధకులకంటె నధికా జ్ఞానావృతములైన నీచయోనులయందుఁ బుట్టుచున్నారు.

**ఆచార్యోక్తి :**

**అన్య దే వాహుః సమ్భవా దన్య దాహు రసమ్భవాత్,**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్త ద్విచ చక్షిరే. 13**

సమ్భవాత్ = సంభూత్యుపాసన వలనఁ గలుగు ఫలము
అన్యత్ = వేఱని
ఆహుః = వేదములు చెప్పుచున్నవి.
అసమ్భవాత్ = అసంభూత్యుపాసన వలనఁ గలుగు ఫలము
అన్యత్ = వేఱని
ఏవ = నిశ్చయముగ
ఆహుః = వేదములు చెప్పుచున్నవి.

ఇతి = ఇట్లు
యే = ఏ యాచార్యులు
నః = మాకు
విచచక్షిరే = విస్పష్టముగ బోధించిరో,
తేషామ్ = ఆ
ధీరాణామ్ = ధీరులయిన యాచార్యులవలన
తత్ = దానిని
శుశ్రుమ = వింటిమి.

హిరణ్యగర్భోపాసనకు ఫల మణిమాద్యైశ్వర్య ప్రాప్తియనియు, అవ్యాకృతోపాసనకు ఫలము జన్మ జన్మాంతర విషయభోగములనియు వేదములు చెప్పుచున్నవి. ధీరులయిన మాయాచార్యులుగూడ హిరణ్యగర్భోపాసనకు ఫలము వేఱనియు, అవ్యాకృతోపాసనకు ఫలము వేఱనియు, మాకు విస్పష్టముగ బోధించిరి. మేము దానిని శ్రద్ధతో వింటిమి.

**కార్య కారణ సముచ్చయము:**

**సమ్భూతిం చ వినాశం చ యస్తద్వేదోభయగ్ం సహ,**
**వినాశేన మృత్యుం తీర్త్వా సమ్భూత్యా మృతమశ్నుతే. 14**

| | |
|---|---|
| యః = ఎవ్వఁడు | సః = వాఁడు |
| సమ్భూతించ = హిరణ్యగర్భోపాసనను, | వినాశేన=అవ్యాకృతోపాసనచేత |
| వినాశంచ=అవ్యాకృతోపాసనను, | మృత్యుమ్ = మృత్యువును |
| తత్ = ఆ | తీర్త్వా = దాఁటి |
| ఉభయమ్ = రెంటిని | సమ్భూత్యా=హిరణ్యగర్భోపాసనచే |
| సహ = సముచ్చయముగ | అమృతమ్=హిరణ్యగర్భానందమును, ప్రళయానంతరము బ్రహ్మానందమును |
| వేద = తెలిసికొనుచున్నాడో, | అశ్నుతే = పొందుచున్నాఁడు. |

సుషుప్తియందును, మరణమునందును, ప్రళయమునందును సర్వజీవులు వారివారి కామకర్మాది సంస్కారములతో నవ్యాకృతునిఁ బొందుచున్నారు. మరల వారి సంస్కారముల ననుసరించి జాగ్రత్త జనన సృష్టుల నొందు

చున్నారు. జన్మజన్మాంతర విషయభోగములనుగాని, అణి మాద్యైశ్వర్యములనుగాని కోరి వ్యష్టికర్మోపాసనలను జేయువారు వారి సంస్కారముల ననుసరించి జననమరణ రూప సంసారమును బొందెదరు. హిరణ్యగర్భావ్యాకృతులు కార్య కారణ స్వరూపులని తలంచి నిష్కాములై సమష్టి కర్మోపాసనలను జేయువారు మృతినొందినపిదప వారి సమష్టి సంస్కారములతో నవ్యాకృతునియందుఁ జేరి జననమరణ రూపమగు మృత్యువును దాఁటుచున్నారు. పిదప వారి సమష్టి సంస్కారముల ననుసరించి హిరణ్యగర్భరూపమును బొంది ప్రళయమువరకు హిరణ్యగర్భ (సమష్టి) ఆనందము ననుభవించి ప్రళయకాలమున నా సమష్ట్యుపాధినిఁ గూడఁ ద్యజించి నిరుపాధిక బ్రహ్మానందామృతమును బొందుచున్నారు,

**అవ్యాకృతోపాసన :**

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్,**
**తత్త్వం పూష న్నపావృణు సత్యధర్మాయ దృష్టయే. 15**

హిరణ్మయేన = సువర్ణమయమగు
పాత్రేణ = పాత్రముచే
సత్యస్య = సత్యజ్ఞానానంద పరమాత్మయొక్క
ముఖమ్ = ద్వారము
అపిహితమ్ = కప్పఁబడినది.
పూషన్ = పిండ బ్రహ్మాండపోషకా!
త్వమ్ = నీవు
సత్యధర్మాయ = సత్యజ్ఞానానంద పరమాత్మయొక్క
దృష్టయే = దర్శనముకొఱకు
తత్ = ఆపాత్రమును
అపావృణు = తొలగింపుము.

సృష్టికిఁ బూర్వము సజాతీయ, విజాతీయ, స్వగత భేద శూన్యమగు సచ్చిదానంద బ్రహ్మముండెను. ఆ బ్రహ్మము ననిర్వచనీయమగు త్రిగుణాత్మక మాయ యాశ్రయించి యుండును. చీఁకటి తా నాశ్రయించిన గృహము నాచ్ఛాదించునట్లు మాయ తన కాశ్రయమగు పరబ్రహ్మము నాచ్ఛాదించుచున్నది. బ్రహ్మచైతన్యము నాశ్రయించిన మాయయందలి సత్వగుణము చైతన్యసత్తచేఁ గార్యోన్ముఖమగును. కార్యోన్ముఖమైన విశుద్ధమాయ యేకము.

చైతన్యసత్తచే మూలమాయయందలి రజస్తమోగుణములుకూడఁ గార్యోన్ముఖములగును. కార్యోన్ముఖములయిన రజస్తమోగుణములతోఁ గూడిన సత్వగుణము మలినసత్వము. మలినసత్వమున కవిద్య, యజ్ఞానము అను నామాంతరములు. మాలిన్యభేదములచే నవిద్య లనేకములు.

ఇందు శుద్ధమాయ స్వాశ్రయమునకు వ్యామోహమును గలిగింపదు. మలినమాయ స్వాశ్రయ వ్యామోహకారి. ఇది సచ్చిదానంద బ్రహ్మమునం దనృత జడదుఃఖాత్మక జగద్భ్రాంతిని గలిగించుచున్నది. సువర్ణము లోభవృత్తిద్వారా ప్రపంచమున విపరీతభావనను గలిగించు విధమున, నజ్ఞానము భ్రాంతివృత్తిద్వారా ఆత్మయందు విపరీతభావనను గలిగించుటచే నీమంత్రమున నజ్ఞానము సువర్ణమయ పాత్రముగా వర్ణింపఁబడెను.

ఓ పిండబ్రహ్మాండపోషకా! అనృత జడ దుఃఖాత్మకమగు సమష్ట్యజ్ఞానముచే నధిష్ఠాన సత్యజ్ఞానానంద పరమాత్మ స్వరూపము కప్పఁబడియున్నది. అట్లే వ్యష్ట్యజ్ఞానముచే నధిష్ఠాన సత్యజ్ఞానానంద ప్రత్యగాత్మ స్వరూపము కప్పఁబడియున్నది. ఆ సత్యజ్ఞానానంద ప్రత్యగభిన్న పరమాత్మ దర్శనముకొఱకు వ్యష్టి సమష్ట్యజ్ఞానరూప సువర్ణమయ పాత్రమును దొలఁగింపుము.

**హిరణ్యగర్భోపాసన:—**

**పూష న్నేకర్షే• యమ సూర్య•ప్రాజాపత్య•వ్యూహ రశ్మీన్సమూహ•• తేజో యత్తే రూపం•కల్యాణతమం•తత్తే పశ్యామి• యో ఽసా వసౌ• పురుషః సోఽహ మస్మి• 16**

పూషన్ = జగత్పోషకా!
ఏకర్షే = జ్ఞానైకమూర్తీ!
యమ = సమస్తమును నియమించువాఁడా!
సూర్య = ప్రాణములను, రసములను స్వీకరించువాఁడా!
ప్రాజాపత్య = సృష్టివిధాయకా!
రశ్మీన్ = నీయొక్కకిరణములను
వ్యూహ = తొలఁగింపుము.
తేజః = తేజస్సును
సమూహ = ఉపసంహరింపుము.
తే = నీయొక్క
కల్యాణతమమ్ = మిక్కిలిమంగళకరమైన
రూపమ్ = రూపము
యత్ = ఎయ్యదిగలదో,
తత్ = దానిని
పశ్యామి = చూచుచున్నాఁడను.
యః = ఏ
అసౌ - అసౌ = ఆయా
పురుషః = పురుషుఁడు కలఁడో,
సః = వాఁడు
అహమ్ = నేను
అస్మి = అగుచున్నాను.

ఈ మంత్రమునఁ జెప్పఁబడిన విశేషణములు మాయావిద్యావిశిష్ట చైతన్యబోధకములు. మాయావిశిష్ట చైతన్యము వృష్ట్యాదులద్వారా సమష్టిజగత్తును, అవిద్యావిశిష్టచైతన్య మన్నపానాదుల రసముద్వారా వ్యష్టిశరీరమును బోషించుచుండుటచేఁ బూషుఁడు. మాయావిశిష్ట చైతన్యము సమస్త ప్రపంచమును దాని వ్యవహారములను, అవిద్యావిశిష్ట చైతన్యము సమస్తశరీరమును దాని వ్యవహారములను, నెఱుంగుచుండుటచే నేకర్షి. మాయావిశిష్టచైతన్యము బ్రహ్మాండమును, బ్రహ్మాండప్రకాశకులగు నధిదేవతలను, అవిద్యావిశిష్ట చైతన్యము పిండాండమును, పిండాండ ప్రకాశకములగు నింద్రియములను నియమించుచుండుటచే యముఁడు. మాయావిశిష్టచైతన్యము సమష్టిప్రాణమును, సర్వరసములను, అవిద్యావిశిష్ట చైతన్యము వ్యష్టిప్రాణమును, అన్నాదుల రసమును స్వీకరించుచుండుటచే సూర్యుఁడు. మాయావిశిష్టచైతన్యము సర్వజగత్తును, అవిద్యావిశిష్టచైతన్యము వీర్యముద్వారా సంతానమును సృజించి విధించుచుండుటచేఁ బ్రజాపతి. ఈవిధముగ నొక్క చైతన్యమే మాయావిశిష్టమై యీశ్వరభావమును, అవిద్యావిశిష్టమై జీవభావమును బొందుచున్నది. కావున నుపాసకుఁ డహంగ్రహోపాసనను జేయవలయును.

ఓ మాయావిద్యావిశిష్టపురుషుఁడా! నీవలనఁబుట్టిన సమష్టి స్థూలప్రపంచరూప కిరణములును, సమష్టిసూక్ష్మ

ప్రపంచరూప తేజస్సును నధిష్ఠానపరమాత్మ స్వరూపమును గప్పినవి. అట్లే వ్యష్టిస్థూలశరీర రూప కిరణములును, వ్యష్టి సూక్ష్మశరీర రూప తేజస్సును నధిష్ఠాన ప్రత్యగాత్మస్వరూపమును గప్పినవి. కావునఁ గిరణరూపమగు వ్యష్టి, సమష్టి స్థూలోపాధులను దొలఁగింపుము. తేజోరూపమగు వ్యష్టి, సమష్టి, సూక్ష్మోపాధుల నుపసంహరింపుము. అప్పుడునీదివ్య మంగళమగు ప్రత్యగభిన్న పరబ్రహ్మస్వరూపమును నీయనుగ్రహామువలన నేను జూడఁగలను. వ్యష్టి, సమష్టి, స్థూల సూక్ష్మోపాధులను దొలఁగించినచో దివ్యమంగళ స్వరూపుఁడవగు నీకంటె నేను భిన్నుఁడనుకాను. నీవేనేను. నేనేనీవు.

**ప్రణవోపాసన:—**

**వాయు రనిల మమృత మథేదం॰భస్మాంతగ్ం శరీరమ్,**
**ఓం క్రతో స్మర॰కృతగ్ం స్మర,క్రతో స్మర కృతగ్ం స్మర.17**

వాయుః = వ్యష్టి ప్రాణము
అనిలమ్ = సమష్టి ప్రాణమగు
అమృతమ్ = సూత్రాత్మనుబొందును.
అథ = తరువాత
ఇదమ్ = ఈ
శరీరమ్ = స్థూలశరీరము
భస్మాన్తమ్=భస్మమేఅంతముగా గలదియగును.

క్రతో = ఓ జీవుఁడా!
ఓమ్= ఓంకారవాచ్యుఁడగుబ్రహ్మమును
స్మర = స్మరింపుము.
కృతమ్ = చేసియుండిన శుభకర్మము
స్మర = స్మరింపుము. (అను)
క్రతో = ఓజీవుఁడా!
కృతమ్=చేసియుండిన శుభకర్మములను
స్మర = స్మరింపుము.
స్మర = స్మరింపుము.

ప్రపంచమునఁగల సర్వపదార్థములు నామము, రూపము అని రెండు భాగములు. రూపములు వాని నామములకంటె భిన్నములు కావు. రూపములన్నియు వాని నామములచేతనే నిరూపింపఁబడి గ్రహణత్యాగయోగ్యములగుచున్నవి. కావున రూపములకు నామములు సారము. ఘటరూపము లనేకములు. ఘటనామమేకము. అనేకములగు ఘటాకారములు పరస్పర వ్యభిచారులు. ఏకమగు ఘటనామ మనుగతము. వ్యభిచారులు మిథ్య. అనుగతము సత్యము. మిథ్యయగు నాకారములు సత్యమగు నామములకంటె భిన్నములుకావు. ఇదేవిధమున సర్వపదార్థముల యాకారములు వాని నామములకంటె భిన్నములు కావు. ఆ నామములన్నియు నోంకారముకంటె భిన్నములు కావు. లౌకిక వైదికములగు సమస్తనామములు ఓంకారమునుండియే యుత్పన్నములైనవి. నామములు పరస్పర వ్యభిచారులు. ఓంకారము ధ్వనిరూపమున సర్వనామములయం దనుగతము. వ్యభిచారులగు నామములు మిథ్య. అనుగతమగు నోంకారము సత్యము. ఆ యోంకారము బ్రహ్మమునకు వాచకము. బ్రహ్మ మోంకారమునకు వాచ్యము. వాచ్యవాచకము లభేదమగుటచే నోంకారము బ్రహ్మస్వరూపము. ఓంకారము బ్రహ్మమునం దధ్యస్తము. బ్రహ్మ మధిష్ఠానము. అధ్యస్త మధిష్ఠానముకంటె భిన్నము గాదు. కావున నోంకారము బ్రహ్మస్వరూపము.

ఆ బ్రహ్మమునకు విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యా కృత, పరమాత్మలను నాలుగు పాదములు. ఆత్మకు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మలను నాలుగుపాదములు. ప్రణవమునకు అకార, ఉకార, మకార, ఓంకారములను నాలుగు పాదములు. ఆత్మపాదములు బ్రహ్మపాదముల యం దంతర్గతములు. ఆత్మపాదము లంతర్గతములుగాఁ గల బ్రహ్మపాదములు వాచ్యములు. వానికిఁ గ్రమముగఁ బ్రణవపాదములు వాచకములు. విశ్వ, తైజస, ప్రాజ్ఞ లంతర్గతములుగాఁ గల విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృతులు పరస్పర వ్యభిచారులు. వీనియందుఁ బ్రత్యగభిన్న పరమాత్మ యనుగతము. అట్లే అకార, ఉకార, మకారములు పరస్పర వ్యభిచారులు. ఓంకార మనుగతము. వ్యభిచారులు మిథ్య. అనుగతములు సత్యము. కావున నో జీవుఁడా! నీవు మరణపర్యంతము వ్యష్టి, సమష్టి, స్థూల సూక్ష్మ, కారణ ప్రపంచానుగతమగు ప్రత్యగభిన్న పర బ్రహ్మమును అకార, ఉకార, మకారానుగతమగు నోంకారరూపమున ధ్యానింపుము. సమష్టి స్వార్థమునకొఱకు నిత్యనైమిత్తికాది నిష్కామకర్మము లాచరింపుము. మరణ కాలమున నీవుచేసిన సమష్టికర్మోపాసనలను స్మరింపుము.

అట్లాచరించినచో నీవు మృతినొందినపిదప నీ వ్యష్టి స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల కధిష్ఠానమగు ప్రత్యగాత్మ సమష్టి స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల కధిష్ఠానమగు పరమాత్మయం దేకమగును. వ్యష్టికారణ శరీరమగు

నవిద్య సమష్టికారణశరీరమగు మాయయందుఁ జేరును. వ్యష్టి సూక్ష్మశరీరమునఁగల యంతఃకరణము సమష్టిసూక్ష్మ ప్రపంచమునఁ గల మహత్తత్త్వమును, ఇంద్రియములు వాని యధిదేవతలను, ప్రాణవాయువు మహావాయువును బొందుచున్నవి. అప్పుడు వ్యష్టిస్థూలశరీరము భస్మమే యంతముగాఁ గలదియై సమష్టి స్థూలప్రపంచమునఁ గలసిపోవు చున్నది. ఇట్లు ప్రళయపర్యంతము సమష్ట్యుపాధిని ధరించి హిరణ్యగర్భానందము ననుభవించి ప్రళయానంతర మా సమష్ట్యుపాధినిఁ గూడఁ ద్యజించి నిరుపాధిక బ్రహ్మస్వరూపుఁడవగుదువు.

వైశ్వానరోపాసనః —

అగ్నే నయ సుపథా రాయే. అస్మా న్విశ్వాని దేవ వయు
నాని విద్వాన్, యుయో ధ్యస్మ జ్జుహురాణ మేనో భూయి
ష్ఠాం తే నమఉక్తిం విధేమ. 18

అగ్నే = ఓవైశ్వానరాగ్నీ !
అస్మాన్ = మమ్ములను
రాయే=సమష్టికర్మఫలభోగము కొఱకు
సుపథా = మంచిమార్గముచేత
నయ = పొందింపుము.
దేవ = ఓదేవా !
విశ్వాని = సమస్తములయిన
వయునాని = కర్మములను
విద్వాన్ = ఎఱింగినవాఁడవు.
అస్మత్ = మానుండి
జుహురాణమ్ = వంచనాత్మకమగు
ఏనః = పాపబుద్ధిని
యుయోధి = తొలఁగింపుము.

తే = నీకొఱకు నమఉక్తిమ్ = నమోవాకమును
భూయిష్ఠామ్ = మిక్కుటమైన విధేమ = చేయుచున్నాము.

సూత్రాత్మయొక్క చాలనశక్తి వలన సమస్త స్థూలప్రపంచోత్పాదక మగు వైశ్వానరాగ్ని యుదయించుచున్నది. సర్వభూతములయందు సూక్ష్మరూపమున నున్న యుష్ణత్వము, జఠరాగ్ని దానిసామాన్యరూపము. మథనము వలన వెలువడిన జ్వలన, దహన, ప్రకాశములుగలది విశేష రూపము. సామాన్యాగ్ని సర్వభూతాంతరాళములయందుండి సమస్తమునువృద్ధిఁబొందించుచున్నది. విశేషాగ్ని దక్షిణ, గార్హపత్య, ఆహవనీయములని మూడు విధములు. ఇదిసర్వభూతములకు వెలుపలనుండి సమస్తమును వృద్ధిఁబొందించుచున్నది. ఇందు క్షుద్బాధ నివారించుటకొఱకు, బచనాది కార్యముల కుపకరించునది దక్షిణాగ్ని. తుష్టిపుష్టులకొఱకు గృహస్థులు నిత్యహవనము చేయుట కుపకరించునది గార్హపత్యాగ్ని. ఒకానొక నిమిత్తము ననుసరించి చేయు హవనకార్యమునకు సమిధలు మథింపఁగా కలిగిన దాహవనీయాగ్ని. ఈ యగ్నియొక్క సమష్టిస్వరూపమునెఱింగి సమష్టిస్వార్థముకొఱకుఁ గర్మము లాచరించుటయే వైశ్వానరవిద్య. చైతన్య విశిష్టమగు వైశ్వానరాగ్న్యుపాసనయే యీ మంత్రమునఁ జెప్పఁబడుచున్నది.

ఓ వైశ్వానరాగ్నీ! నీవు సామాన్య విశేషరూపమున సర్వమును వ్యాపించినవాఁడవు. సర్వజ్ఞుఁడవు. కావున

నా కాయిక, వాచిక, మానసికములగు సమస్తకర్మముల నెఱుంగుదువు. నేను చేసిన సమష్టి స్వార్థకరములగు పుణ్యకర్మ బీజములవలనఁ గలిగిన శుభవాసనా రూపాంకురముల ననుసరించి నన్ను శుభమార్గమున నడుపుము. ధర్మరూపాంకురముల ననుసరించి మృతినొందినపిదప సమష్టిరూపమగు వైశ్వానరుని బొందింపుము. అనర్థహేతువులగు నశుభవాసనా రూపాంకురములను, ననర్థదాయకములగు నధర్మరూపాంకురములను గలిగించు వ్యష్టి స్వార్థకరములగు పాపకర్మ బీజములుగల బుద్ధిని నానుండి తొలగింపుము. నీ కనేక నమోవాకము లర్పించుచున్నాను.

ఓమ్ తత్ సత్



# ఈశావాస్య ఉపనిషత్తు

( ప్రామాణిక ఉపనిషత్తులలో మొదటిది )

మూలము, టీక, భావము, వివరణము.




శ్రీ రావినూతల రాధాకృష్ణయ్య

# విషయసూచిక

# గురు వందనా

ఓం నమో బ్రహ్మాదిభ్యో
బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః
సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః
ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి ॥ 1

ఓం నారాయణం పద్మభవం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్రపరాశరం చ।
వ్యాసం శుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్రమథాస్య శిష్యం ॥ 2

శ్రీ శంకరాచార్యమథాస్య పద్మపాదం చ
హస్తామలకం చ శిష్యం
తం త్రోటకం వార్తికకారమన్యాన్
అస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥ 3

శ్రుతిస్మృతి పురాణానాం
ఆలయం కరుణాలయం
నమామి భగవత్పాదం
శంకరం లోకశంకరం ॥ 4

శంకరం శంకరాచార్యం
కేశవం బాదరాయణం
సూత్రభాష్యకృతౌ వందే
భగవంతౌ పునఃపునః ॥ 5

ఈశ్వరో గురురాత్మేతి
మూర్తిభేద విభాగినే
వ్యోమవద్వ్యాప్తదేహాయ
దక్షిణామూర్తయే నమః ॥ 6

ఓం

# ఈ శా వా స్యో ప ని ష త్తు

(మూ ల ము)

## శాంతి మంత్రః

ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే॥

ఓం శాంతిః! శాంతిః!! శాంతిః!!!

ఓం ఈశావాస్యమిదం సర్వం
యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుంజీథా
మా గృధః కస్య స్విద్ధనమ్ ॥ 1

కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషేచ్ఛతం సమాః।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి
న కర్మ లిప్యతే నరే॥ 2

అసుర్యా నామ తే లోకా
అంధేన తమసాఽఽవృతాః।
తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి
యే కే చ ఆత్మహనో జనాః॥ 3

అనేజదేకం మనసో జవీయో
నైనద్దేవా ఆప్నువన్పూర్వమర్శత్।
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్
తస్మిన్నపో మాతరిశ్వా దధాతి॥ 4

తదేజతి తన్నైజతి
తద్దూరే తద్వంతికే।
తదంతరస్య సర్వస్య
తదు సర్వస్యాస్య బాహ్యతః ॥ 5

యస్తు సర్వాణి భూతాని
ఆత్మన్యేవాను పశ్యతి।
సర్వభూతేషు చాత్మానం
తతో న విజుగుప్సతే ॥ 6

యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కః శోకః
ఏకత్వమనుపశ్యతః ॥ 7

స పర్యగాత్ శుక్రమకాయమవ్రణం
అస్నావిరం శుద్ధమపాపవిద్ధం।
కవిర్ మనీషీ పరిభూః స్వయంభూః
యాథాతథ్యతః అర్థాన్ వ్యదధాత్
శాశ్వతీభ్యః సమాభ్యః ॥ 8

అంధం తమః ప్రవిశంతి
యే అవిద్యాముపాసతే
తతో భూయ ఇవ తే
తమో య ఉ విద్యాయాం రతాః ॥ 9

అన్యదేవాహుర్విద్యయా
అన్యదాహురవిద్యయా ।
ఇతి శుశ్రుమ ధీరాణాం
యే నః తద్విచచక్షిరే ॥ 10

విద్యాం చావిద్యాం చ
య స్తద్వేదోభయం సహ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయాఽమృతమశ్నుతే ॥ 11

అంధం తమః ప్రవిశంతి
యేఽ సంభూతిముపాసతే।
తతో భూయ ఇవ తే
తమో య ఉ సంభూత్యాం రతాః ॥ 12

అన్యదేవాహుః సంభవాత్
అన్యదాహురసంభవాత్ ।
ఇతి శుశ్రుమ ధీరాణాం
యే నః తద్విచచక్షిరే ॥ 13

సంభూతిం చ వినాశం చ
య స్తద్వేదోభయం సహ ।
వినాశేన మృత్యుం తీర్త్వా
సంభూత్యాఽ మృతమశ్నుతే ॥ 14

హిరణ్మయేన పాత్రేణ
సత్యస్యాపిహితం ముఖం
త త్త్వం పూషన్నపావృణు
సత్యధర్మాయ దృష్టయే ॥ 15

పూషన్నేకర్షే యమ సూర్య
ప్రాజాపత్య వ్యూహరశ్మీన్ సమూహ ।
తేజో యత్తే రూపం కల్యాణతమం
తత్తే పశ్యామి యోఽసావసౌ
పురుషః సోఽహమస్మి ॥ 16

వాయురనిలమమృతం
అథేదం భస్మాంతం శరీరం ।
ఓం క్రతో స్మర కృతం స్మర
క్రతో స్మర కృతం స్మర ॥ 17

అగ్నే నయ సుపథా రాయే
అస్మాన్విశ్వాని దేవ వయూనాని విద్వాన్ ।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥ 18

ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః



ఓమ్

# ఉపోద్ఘాతము

ఉపనిషద్ ద్రష్టలకు, బ్రహ్మవిద్యోపదేశికులకు, ఆత్మవిద్యా గురువులకు, ఆధ్యాత్మికాచార్యులకు నమస్కృతులు. అన్నింటికీ ఆధారమైనట్టి, అధిష్ఠానమైనట్టి, సర్వమునకు ఉద్గమ స్థానమైనట్టి సచ్చిదానంద పరబ్రహ్మమునకు ప్రణిపాతములు.

ప్రపంచంలో ఉండే గొప్పవైన మతాలన్నింటికి ఆయా మతాలకు సంబంధించిన మత గ్రంథాలున్నాయి. వాటిని వారు భగవద్వచనమని గాని, లేక దేవతా వాక్యమనిగాని విశ్వసిస్తారు. వాటిని తమ మతాలకు ఆధారాలుగ భావిస్తారు. ఈ మతగ్రంథాలన్నిటిలో, పాశ్చాత్య పండితుల ప్రకారం, హిందువుల వేదాలు అతి ప్రాచీనమైనవి. అందువల్ల వేదాల్ని గురించి కొంచెం సదవగాహన అవసరం.

వేదాలు అని పిలువబడే ఈ లిఖితరాశిని 'కొందర వ్యక్తుల పలుకులు' అని అనడానికి వీల్లేదు. వేదాల పుట్టుకకు తాఖీఖును నిర్ణయించేందుకు లేదు. ఇక ముమ్ముందు సైతం నిర్ణయించ లేము. మనము వేదాలను సనాతనమని నమ్ముతాము. మనం ఒక ముఖ్యవిషయాన్ని స్మరించాలి. ప్రపంచంలోని ఇతర మతాలన్నింటికి ఆ మతగ్రంథాలను ప్రసాదించిన వ్యక్తులు, లేక దేవదూతలు ఉన్నారు. వేదాలను మనకు అముక వ్యక్తులు అందజేయలేదు. వేదాలకు ప్రమాణం వేదాలే. ఎందువల్లనంటే అవి నిత్యములు.

మఱియు భగవద్వచనం కాబట్టి. వేదాలను ఎవరూ వ్రాయ లేదు. వాటిని ఎవరూ సృష్టించ లేదు. అవి ఎల్లప్పుడూ ఉన్నాయి. అవి అనంత కాలాన్నుండి విలసిల్లుతూన్నాయి. సృష్టి ఏ విధంగా అనంతమో, ఏవిధంగా నిత్యమో, సృష్టికి ఏవిధంగా ఆద్యంతాలు లేవో అదే విధంగా భగవద్ జ్ఞానానికి మొదలు తుదులు లేవు. ఇటువంటి జ్ఞానాన్నే వేదములు అని వ్యవహృతం చేస్తాము.

వేదాంతం అని పిలువబడే జ్ఞానరాశిని కనుగొన్న వారు ఋషులు. ఋషి అంటే ఎవరు? మంత్ర ద్రష్టయైన వాడు ఋషి. తత్త్వదర్శియైనవాడు ఋషి. భావాలను (తలపులను, సంకల్పాలను) దరిస్తాడు ఋషి. అంటే భావము అతనిది గాదు. వేదంలో ఒక ఋషికి సంబంధించిన భాగం ఉందనుకొంటాం. దాన్ని ఆ ఋషి వ్రాయలేదు. అతడు దాన్ని సృష్టించ లేదు కూడ. అంతకు మునుపే ఉంటూండిన భావాన్ని అతడు దర్శించాడన్న మాట. అతడు దర్శించినటు వంటి భావం విశ్వంలో నిత్యంగా ఉంది. ఋషి దాన్ని దర్శించాడు. ఋషులు ఆధ్యాత్మిక దర్శినులు.

వేదాలను ముఖ్యంగా రెండు భాగాలుగ విభజించాడు. మొదటిది కర్మకాండ. రెండవది జ్ఞానకాండ.

కర్మకాండ నానావిధములైన యజ్ఞయాగాదులతో కూడియుంటుంది. ఈ నాటి పరిస్థితులలో వాటిలో చాలా వాటిని, అభ్యాసయోగ్యం గాక వదలిపెట్టారు. కానీ మిగిలి నవి కొన్ని ఏదో ఒక రూపంలో ఈ నాటికి ఉన్నాయి. కర్మకాండ ముఖ్యాంశాలు. ఈనాటికి కొద్దో గొప్పో అనుసరింప

బడుతూన్నాయి. మానవుడు ఆచరింపవలసిన ధర్మాలు, విద్యార్థి కర్తవ్యాలు, గృహస్థు విధ్యుక్త ధర్మాలు, సంన్యాసి ధర్మాలు, వివిధ ఆశ్రమ ధర్మాలు ఈ నాటికి కూడ కొంత కొంత ఆచరణలో ఉండడం చూస్తూన్నాం.

మన మతంలోని ఆధ్యాత్మికభాగం జ్ఞానకాండలో కనిపిస్తుంది. అదే వేదాంతం. అంటే వేదములయొక్క అంతం. వేదముల సారసంగ్రహం, వేదముల గమ్యం, లక్ష్యం. వేదముల పిండితార్థ జ్ఞానాన్ని వేదాంతం అని పిలిచారు. వేదాంతాన్ని ఉపనిషత్తులు అంటారు. భారతదేశం లోని ప్రతి హిందువునకు — ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణపత్య, సౌర మతస్థులలో ఎవరైనా కావచ్చును — వేదముల ఉపనిషత్తులు ప్రామాణికంగా గ్రహణీయం. ఉపనిషత్తులు వారికి ప్రామాణికములు, కాని, వారి వారి మతానుసారము అర్థవివరణలు చేసుకొంటారు.

ఉపనిషత్తుల్లాంటి ఆత్మప్రేరకమైన, మనోజ్ఞమైన, దివ్యమైన మరియొక గ్రంథము ప్రపంచంలో కానరాదు. ఉపనిషత్తులు ప్రబోధించే వేదాంతం, తత్త్వజ్ఞానం ఇటు ప్రాచ్యభూమిలో, అటు పాశ్చాత్య దేశాలలో ప్రజలకు శాంత్యుపశమనాలకు మూలములై యున్నాయి. (ప్రపంచ చరిత్రలో)ఉపనిషద్ బోధనలలో ఉండే మహోన్నతమైనట్టి, మనోజ్ఞమైనట్టి భావాలను అతిశయించి మానవుని మేధ ఆలోచింపలేక పోయింది.

ఉపనిషత్తులు వేదముల సారం. అవి వేదముల పిండి తార్థం. అవి వేదాంత తత్త్వజ్ఞానానికి మూలం. ప్రతి మంత్రం నుంచి గంభీరములైన, మనోజ్ఞములైన, మహోన్నతములైన దివ్యభావములు ఉత్పన్నము లౌతాయి. ఉపనిషత్తులు ఋషులయొక్క ప్రత్యక్ష అనుభవాల్ని చాటుతాయి. ఉపనిషత్తులు పరమ విజ్ఞాన శోభితములు. కాబట్టి అవి ప్రజల హృదయాన్ని మథించి, వారికి దివ్యజ్ఞానాన్ని కలుగజేస్తూ న్నాయి.

పదాలు పరిమితం, భాష అపరిపూర్ణం కాబట్టి పరి మిత పదజాలంతో ఉపనిషత్తుల వైభవాన్ని వర్ణించేందుకు వీలులేదు. ఉపనిషన్మహిమ అనిర్వచనీయం. వాస్తవంలో ఉపనిషత్తులు మానవకోటికి శాంత్యుపశమనములను ప్రసా దిస్తాయి. అవి మనోజ్ఞములు, ఆత్మప్రేరకములు. లక్షలాది ముముక్షువులకు ఉపనిషత్తులు మార్గదర్శకములై ఉన్నాయి. వారు ఉపనిషత్తులనుండే ప్రోత్సాహాన్ని, జ్ఞానాన్ని పొందు తూన్నారు. ఉపనిషత్తులు వేదార్థసారసంగ్రహభూతములు. అవి విలువకట్ట వీలుకాని అమూల్యములైన పెన్నిధులు.

ఉపనిషత్తులలో వైదాంతిక భావన సంపుష్టంగా ఉంటుంది. అవి వేదాంత భావనల మహోన్నత శిఖరం. ఉపనిషత్తుల నైసర్గిక విలువ అప్రమేయం. ఉపనిషన్మంత్రా లలో గంభీరార్థాలు ఉంటాయి. భాష సుమంజులము. అనేక విధాల పరబ్రహ్మ తత్త్వాన్ని ఉపనిషత్తులు స్పష్టంగా వర్ణి స్తాయి. పురుషోత్తమ ప్రాప్తికోసం ఉపనిషత్తులు మనకు సరియైన పద్ధతుల్ని ప్రబోధిస్తాయి. ఈ ప్రపంచానికి ఉపని

షత్తులు ప్రప్రథమంగా ప్రదర్శింపబడి ఎన్నో యుగాలైనాయి. అయినప్పటికి ఈనాటికి అవి అత్యంత మృదుమధురంగా, మనోహరంగా ఉన్నాయి. వాటి స్రోత్తందనం నిరుపమం. వాటి సౌరభం నిత్యనూతనం. చాలమంది ఈనాడు ఉపని షత్తులను పఠింపకుండ జీవించలేరు. అవి ఆత్మకు పరమా న్నము.

సుప్రసిద్ధ పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞుడైన శోప్యేహార్ (Schopenhaver) ప్రతిదినం రాత్రి పడుకోబోయే ముందు ఉపనిషత్తులను భక్తిశ్రద్ధలతో చదివేవాడు. అతని మేజా బల్లపై ఎల్లప్పుడూ ఒక ఉపనిషత్తు గ్రంథం ఉండేది. తన జీవిత సమయంలోగాని, తన మరణకాలంలోగాని ఉపశమన ప్రదాయిని ఉపనిషత్తే యని విశ్వసించేవాడు. ఉపనిషత్ పఠనం లాంటి ప్రయోజనకరమైనది, మహోన్నతమైనది ప్రపంచంలో మఱొకటి లేదని అతడు వక్కాణించాడు. ఉపని షత్తులు సత్యదృష్టిని ప్రదర్శిస్తాయి. ఆ కారణంచేత అవి మానవుని శాస్త్రీయ దృక్పథాన్ని, తాత్త్విక జిజ్ఞాసను, మత పిపాసను తప్పక సంతృప్తిపరుస్తాయి. హిందూమతం పైన, భారతీయ తత్త్వశాస్త్రం మీద నిస్సందేహంగా ఉపనిషత్తుల ప్రభావం ఎప్పటినుంచో ఉంది. ఇంక ఎంత కాలమో ఉంటుంది.

ఉపనిషత్తులు మనోజ్ఞమైనట్టి వేదాంత భావనలతో, సార్వజనీన సత్యదర్శనములతో నిర్భరితమైనట్టి ఆధ్యాత్మిక ప్రసంగాలు. ప్రాచీనకాలపు ప్రాచ్య ఋషులు, తత్త్వ ద్రష్టలు జీవిత మూల సత్యాలను అవగతం చేసుకోవడానికి

ప్రయత్నించారు. మానవసృష్టి, మానవప్రకృతి, మానవుని భవితవ్యత, విశ్వసృష్టి, విశ్వస్వభావము, విశ్వనియతి — ఈ సమస్యలను పరిష్కరించడానికి మన ఋషులు యత్నించారు. జ్ఞానము, అస్తిత్వము — వీటి అర్థాన్ని, విలువను అవగతం చేసుకోవడానికి వారు యత్నించారు. జీవితసాధన సమస్యలకు, ప్రపంచ సమస్యలకు ఒక పరిష్కృతిమార్గాన్ని కనుగొనడానికి మన ఋషులు యత్నం చేశారు. జీవాత్మకు అదృష్టవస్తువునకు (పరమాత్మకు) ఏమి సంబంధమో తెలిసికోవడానికి వారు ప్రయత్నించారు. "నేనెవరు? ఈ సంసారం ఏంటి? ఈ జగత్తు ఏమిటి? మనం ఎక్కడనుంచి వచ్చాము? మనకు ఆలంబనం ఏమిటి? మనం ఎక్కడికి పోతాం? అజరమైన, అమరమైన, అమృతమైన, ఆనందమైన, అవిక్రియమైన, ఆత్మభవమైన ఆత్మ ఉందా? అమృతత్వం (స్వాతంత్ర్యం, సిద్ధి, నిత్యానందం, పరమశాంతి) అనేది ఏదైనా ఉందా? అమృతత్వాన్ని పొందడం ఎలా?" — ఇటువంటి పరమ గహనమైన ప్రశ్నలకు సముచిత సమాధానాలను అన్వేషించేందుకు యత్నించారు ఆ ఋషీశ్వరులు.

వారు తపస్సు చేశారు. అంతరాలోకనం అభ్యసించారు. ఆత్మ పృథఃకరణ సల్పారు. బ్రహ్మవిచారం చేశారు. సజ్జీవనం గడిపారు. యమనియమములను అభ్యసించారు. విశుద్ధమైన అంతరాత్మపై ధ్యానించారు. ఆత్మసాక్షాత్కారాన్ని పొందారు. ప్రగాఢ సత్యాన్ని వారు దర్శించారు. వారి జ్ఞానం సూక్ష్మమైనది, ప్రత్యక్షమైనది. వారి స్వానుభవములు ప్రత్యక్షమైనవి, అద్వితీయమైనవి,

ప్రమాణనిరపేక్షమైనవి, గూఢమైనవి, గుప్తమైనవి, గహాన మైనవి. వారి ఆధ్యాత్మిక అనుభవాలను ఏ విజ్ఞాన శాస్త్రం కూడ అభిశంసనం చేయజాలదు. సర్వతత్త్వశాస్త్రాలు తమ ప్రయత్నాల అంత్యగమ్యంగా ప్రకటించే సత్యాలు మనోజ్ఞ మైన ఉపనిషత్తులలో గ్రథితమై యున్నాయి.

కొందరు పాశ్చాత్య పండితులు ఉపనిషత్తులు క్రీ. పూ 600 నాటివని నిర్ణయించారు. ఉపనిషత్తులన్నీ బౌద్ధయుగ పూర్వానికి చెందినవని వారి యుద్దేశ్యం. ఇది నిజంగా శోచ నీయమైన విషయం. ఉపనిషత్తులు వేదంలోని జ్ఞానకాండకు సంబంధించినవి. అవి సనాతనమైనవి, నిత్యమైనవి. అవి హిరణ్యగర్భుని ముఖారవిందమునుండి వెలువడినవి. అటువం టప్పుడు ఉపనిషత్తులకు కాలాన్ని ఎవరు నిర్ణయించగలరు?

ఉపనిషత్తులు గంభీరమైన, గూఢమైన దివ్యజ్ఞానానికి ఉద్గమస్థానం. ఈ భయంకరమైన సంసారాన్నుండి తప్పించు కోవడానికి ఉపనిషత్తులు అద్భుత సాధనంగా పనికి వస్తాయి. ఉపనిషత్తులువిశ్వమత గ్రంథాలు. అన్ని జాతులకు చెంది నటువంటి మతప్రేమికులకు గాని, సత్యాన్వేషకులకు గాని, ఉపనిషత్తులు నచ్చుతాయి. ఉపనిషత్తులలో జ్ఞానయోగ వేదాంతానికి సంబంధించిన గూఢ రహస్యాలు ఉన్నాయి. ఉపనిషత్తులు అభ్యాసయుక్తమైన సూచన లిస్తాయి. అవి సూక్ష్మమర్మాలను తెలుపుతాయి. అవి ఆత్మసాక్షాత్కార మార్గాన్ని బాగా ప్రకాశింప జేస్తాయి.

వేదాలు నాలుగు. అవి 1. ఋగ్వేదం, 2. యజుర్వేదం, 3. సామవేదం, 4. అథర్వణవేదం. 'విద్' అను ధాతువునుండి వేదమనే పదం వచ్చింది. 'విద్' అంటే తెలిసికొనుట. వేదము అంటే విజ్ఞాన గ్రంథం. వేదాలు సనాతనమైనవి. అవి పురాతనమైనవి. అవి పురాణమైనవి. అవి పుస్తకాలు కావు. వేదాలలోని అభిప్రాయలే వేదాలు. అవి భగవంతుని ముఖ పద్మంనుండి వెలువడ్డాయి.

ప్రతి వేదంలో మంత్రములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు ఉన్నాయి. వరుణేంద్ర రుద్ర మరుత్తులు మున్నగు దేవతలను స్తుతిస్తూ మంత్రములు, స్తోత్రములు ఉన్నాయి. వాటి నన్నిటిని ఒకటిగ ప్రోగుచేశారు. ఆ కూర్పులను సంహితలు అంటారు. యజ్ఞక్రతువులను ఏవిధంగా ఆచరించాలో వివరించేవి బ్రాహ్మణములు. ప్రాచీన ఋషీశ్వరులయొక్క జ్ఞానము, వేదాంత తత్త్వశాస్త్రము ఉండేవి ఉపనిషత్తులు.

ఉపనీయ తమాత్మానం
బ్రహ్మాపాస్త ద్వయం యతః।
నిహంత్య విద్యాం తజ్జం చ
తస్మాదుపనిషద్ భవేత్ ॥ 1

నిహత్యా నర్థమూలం స్వా
విద్యాం ప్రత్య క్తయా పరం।
నియస్యపాస్త సంభేద
మతో వోపనిషద్ భవేత్ ॥ 2

ప్రవృత్తి హేతూన్నిః శేషాం
స్తన్మూలోచ్ఛేదకత్వతః।
యతో వసాదయే ద్విద్యాం
తస్మాదుపనిషద్ భవేత్ ॥ 3

ఉపనిషన్నామమునకు పైవిధంగా వ్యుత్పత్తు లొసంగబడినవి.

ఉపనిషత్తుల జ్ఞానం కలిగియుండడం వల్ల మనం బ్రహ్మమునకు సమీపమున ఆసీనులం కాగలం, అనగా ఆత్మసాక్షాత్కారాన్ని పొందగలం. అందువల్ల దానికి ఉపనిషత్తు అనే పేరు వచ్చింది.

ఉపనిషత్తులు బ్రహ్మమునకు దారిజూపి, జిజ్ఞాసువులు బ్రహ్మమును పడయుటకు తోడ్పడును. కాబట్టి వాటిని బ్రహ్మజ్ఞానమని అంటారు.

'సద్' అనగా నాశమొనర్చుట, ఉపనిషద్ జ్ఞానం సంసార బీజమైన అజ్ఞానాన్ని ధ్వంసం చేస్తుంది. కాబట్టి దానికి ఉపనిషద్ అనే పేరు వచ్చింది.

ఉపనిషద్ అనే పదాన్ని గౌణార్థంలో గ్రంథానికి కూడ సౌజన్యంతో వాడుతున్నాము.

ముక్తోపనిషత్తులో 108 ఉపనిషత్తులున్నాయని పేర్కొనబడియుంది. కాని యీ సంఖ్యకు మరికొన్ని కలుపబడ్డాయి.

ఉపనిషత్తులు పూర్ణైకత్వ తత్త్వాన్ని బోధిస్తాయి. అన్ని ఉపనిషత్తుల బోధనలలో మనకు ఈ క్రింది రెండు బోధలు ప్రధానంగా కనబడుతున్నాయి. (1) అంత్య విమోచనం బ్రహ్మజ్ఞానం వలన మాత్రమే మనం పొందగలం,

(2) సాధన సంపత్తి గలవాడు బ్రహ్మమును పడయగలడు.

అంత్యవిమోచనం ముక్తి. ఆత్మజ్ఞానంవల్ల ముక్తిలభ్య మౌతుంది. జ్ఞానాన్ని పొందేటందుకు మనకు చిత్తైకాగ్రత ఉండాలి. ఏకాగ్రత ఉపాసనవల్ల కలుగుతుంది. ఉపాసన చిత్తశుద్ధివల్ల కలుగుతుంది. చిత్తశుద్ధి నిష్కామ్యకర్మవల్ల వస్తుంది. నిష్కామ్యకర్మను ఆచరించేటందుకు మనం ఇంద్రియాలను నిగ్రహించియుండాలి. ఇంద్రియాలు నిగ్రహింపబడాలంటే వివేకవైరాగ్యాలు అత్యవసరం.

మోక్షం పరమప్రయోజనం, జ్ఞానం అవాంతర ప్రయోజనం. అరటి ఫలం పరమప్రయోజనం. అరటి ఆకులు, పువ్వులు, బొందె మొదలగునవి అవాంతర ప్రయోజనాలు. పరమానంద ప్రాప్తికి జ్ఞానమొక సాధనము. పరమానంద ప్రాప్తి, సకల విధ దుఃఖ నివారణ — ఇవి మోక్షస్వరూపం.

బ్రహ్మము, ఆత్మ, పురుషుడు, చైతన్యము, ప్రజ్ఞ, భగవంతుడు, అమృతత్వము, స్వేచ్ఛ, సిద్ధి, శాంతి, ఆనందము, భూమము — ఇవన్నీ పర్యాయపదాలు. వ్యక్తిస్వాత్మతో పరమాత్మ తాదాత్మ్యమని అవగతము చేసుకోవడమే బ్రహ్మజ్ఞానం. మానవుడు తన ఆత్మతో పరబ్రహ్మము ఒకటియని తెలిసికోనడమే ఆత్మజ్ఞానం. జీవునకు, బ్రహ్మమునకు తేడా ఉపాధిలో మాత్రమే ఉంది. వాస్తవంలో, తత్త్వతః జీవుడు బ్రహ్మము అయినప్పటికి అంతఃకరణ ఉపాధితో సంబంధం పెట్టుకొన్నందువల్ల అతడు ప్రాపంచిక దుఃఖాలకు గురియౌతున్నాడు. జీవబ్రహ్మముల

మధ్య నిజమైన భేదం లేనందువల్ల పరబ్రహ్మము జీవాత్మతో తాదాత్మ్యమని గ్రహించాలి. అందువల్ల అసలు సత్యాన్ని తెలిసికొనినవారు బ్రహ్మము, ఆత్మ తాదాత్మ్యమనీ అవగతం చేసుకొంటారు. అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మమును), అయమాత్మా బ్రహ్మ (ఈ ఆత్మయే బ్రహ్మము) అను మహా వాక్యములలో చెప్పబడినట్లు వారు జీవబ్రహ్మైక్యమును తెలుసుకొంటారు. వారు తమ శిష్యులకు అదే విషయాన్ని 'తత్త్వమసి' (అదియే నీవు) అని బోధిస్తారు. అందువల్ల బ్రహ్మము ఆత్మతో తాదాత్మ్యమని గ్రహించాలి. బ్రహ్మ విదుడు బ్రహ్మమగును. అతడు జీవించియుండగనే బ్రహ్మమై, జనన మరణ చక్రమునుండి విముక్తుడౌతాడు. బ్రహ్మ జ్ఞానమే అంత్యవిమోచనానికి, అనగా మోక్షానికి సాధనము.

ఉపనిషద్ జ్ఞానాన్వేషికి ప్రథమార్హత సాధన చతుష్టయం. సాయుజ్యం పడయుటకోసం కావలసిన నాలుగు సాధనాలను సాధన చతుష్టయం అంటారు. జ్ఞానయోగ పథంలో పయనించే జిజ్ఞాసువులు తప్పకుండ అలవరచుకోవలసిన నాలుగు విధములైన ఆధ్యాత్మికాభ్యాసాలను సాధన చతుష్టయం అంటారు. మాటకువస్తే, ఏ విధమైనటువంటి దివ్యమార్గంలో క్రమపరిణామం పొందేవారు సైతం అనుష్ఠింపవలసిన నాలుగు సాధనములను సాధన చతుష్టయం అని చెప్పవచ్చు.

ఆ నాలుగు సాధనలు, లేక అర్హతలు ఏవంటే.

1. వివేకము.
2. వైరాగ్యము.

3. షట్ సంపత్తి.

4. ముముక్షుత్వము.

కర్మఫలాలను ఎదురుచూడకుండ, అహంకారం లేకుండ, పరమేశ్వరార్పితంగా ఏ వ్యక్తి తాను తొలి జన్మలలో పుణ్యకర్మలను ఆచరించియుంటాడో, అతనిలో, భగవదనుగ్రహంవల్ల, వివేకోదయం ఔతుంది. 'వివేకం' అంటే ఏమిటి? విచక్షణా జ్ఞానాన్ని వివేకం అంటారు. ఏది ఆత్మ, ఏది అనాత్మ; ఏది సత్యం, ఏది అసత్యం; ఏది సత్, ఏది అసత్; ఏది నిత్యం, ఏది అనిత్యం; ఏది దృక్, ఏది దృశ్యం; ఏది కర్త, ఏది కర్మ; — వీటిని తెలుసుకోవడం వివేకం. ఆత్మ అనాత్మల, సత్యాసత్యాల, శాశ్వత అశాశ్వతాల, కర్త కర్మల విచక్షణ జ్ఞానాన్ని వివేకం అంటారు.

వైరాగ్యం అంటే నైరాశ్యం, కామరాహిత్యం. అది ఇంద్రియ విషయాల యెడ, ఇంద్రియభోగం పట్ల ఉండే ఉపేక్ష. ఇహలోక, పరలోక భోగ్యవిషయాల పట్ల ఉండే జిహాసా బుద్ధిని వైరాగ్యమంటారు. ప్రత్యక్షానుభవం, శ్రుతివాక్యం మున్నగువాటిచే అసత్యాలని తెలియవచ్చే, ఆబ్రహ్మస్తంబపర్యంతం ఉండే భోగ్యవిషయాలలో కలిగే అరోచక మనః ప్రవృత్తిని వైరాగ్యం అంటారు.

వైరాగ్యస్య ఫలం బోధం
బోధస్య ఫలం ఉపరతిః

అంటే వైరాగ్యంవల్ల అర్థగ్రహణం (ప్రజ్ఞానం) కలుగుతుంది; ప్రజ్ఞానంవల్ల ఉపరతి (అత్యంత సంతృప్తి) కలుగుతుంది.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా
జీవో బ్రహ్మైవ న- అపరః,

పరమాత్మ సత్యం. ప్రపంచం అసత్యం. జీవాత్మ పరబ్రహ్మమునుండి వేరుకాదు. ప్రపంచవిషయాల యెడగల జిహాసా బుద్ధివల్ల, అనగా వైరాగ్యంవల్ల ఈ జ్ఞానం ఉదయిస్తుంది.

వివేకంవల్ల కల్గిన వైరాగ్యం మాత్రమే శాశ్వతంగా ఉండగలదు. అటువంటి వివేకపూర్వక వైరాగ్యం మనకు మన ఆధ్యాత్మికాభ్యాసాలలో తోడ్పడగలదు. కారణ వైరాగ్యం మనకు దోహదకారి కాజాలదు. ఆస్తినష్టంవల్ల, ఉద్యోగం ఊడడంవల్ల, భార్య మరణించడంవల్ల, పుత్రుడు చనిపోవడం వల్ల, భగ్నప్రేమవల్ల కలిగే వైరాగ్యాన్ని కారణ వైరాగ్యం అంటారు. ఈ కారణవైరాగ్యం అనిత్యం, అశాశ్వతం, తాత్కాలికం. అది అమ్మోనియాలాగా తృటిలో అదృశ్యమౌతుంది.

షట్సంపత్తి అంటే ఆరు సద్గుణాలు. అవి ఏవంటే:

(1) శమము
(2) దమము
(3) ఉపరతి
(4) తితిక్ష
(5) శ్రద్ధ
(6) సమాధానము.

శమం అంటే మనోనిగ్రహం. నిరంతర వాసనా నిర్మూలనంవల్ల కలిగే మనః ప్రశాంతతను శమం అంటారు.

ఎడతెగని కోరికల నాశంవల్ల కలిగే మనశ్శాంతిని శమం అంటారు. ప్రశాంతంగ ఉండడాన్ని కూడ శమం అంటారు. మన మనస్సులో ప్రాపంచిక విషయవాసనలు, కోరికలు తలఎత్తినపుడు వాటిని నెరవేర్చుకోనేందుకు ప్రయత్నింప కూడదు. వివేకంతో, విచారంతో, వైరాగ్యంతో వాటిని తిరస్కరించాలి. ఎడతెగని అభ్యాసంవల్ల మనకు చిత్తప్రశమనం, మనఃప్రశాంతత, మనోబలం చేకూరుతుంది. అభ్యాసంవల్ల మనస్సు సన్నగిల్లుతుంది. దాని సంచారగుణం నిరోధింపబడుతుంది. దాని బహిర్ముఖ సంచార ప్రవృత్తి నిగ్రహింపబడుతుంది. కోరికలు విధ్వంసమైతే, సంకల్పాలు వాటంతటు అవే నాశమొందుతాయి. ఇంద్రియవిషయాల లోపాలను ఏమరక, ఎడతెగక పరిశీలించడంవల్ల, మనస్సు ఇంద్రియ విషయ బాహుళ్యాన్నుంచి అసక్తమౌతుంది. తదనంతరం అది బ్రహ్మముపై లగ్నమౌతుంది.

దమం అంటే ఆత్మసంయమం, ఆత్మనిగ్రహం. దమం అంటే ఇంద్రియ నిగ్రహం. బాహ్యేంద్రియ నిగ్రహాన్ని దమం అంటారు. కన్నులు ఒక అందమైన వస్తువును చూడాలని కోరుతాయి, మనం వెంటనే కన్నులను ఆ అందమైన వస్తువునుండి ప్రత్యాహారంచేస్తే దాన్ని దమం, లేక ఆత్మసంయమం ( Self – restraint ) అంటారు. మనం ఇలాగే ఇతర ఇంద్రియాలను గూడ నిశ్చయ ప్రయత్నంతో నిగ్రహించాలి.

చెవులు, చర్మము, కన్నులు, నాలుక, నాసిక — ఇవి జ్ఞానేంద్రియాలు, వాక్కు, చేతులు, పాదములు, జన

నేంద్రియము, పాయువు — ఇవి కర్మేంద్రియాలు. శమ, దమ అభ్యాసంవల్ల ఈ కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు నిగ్రహింపబడుతాయి. శమ, దమ అభ్యాసంవల్ల దశేంద్రియాలు నిరోధింపబడుతాయి, క్రమశిక్షణలో ఉంచబడుతాయి.

మనస్సును లోబరచుకొంటే ఇంద్రియాలను వశం చేసుకొన్నట్లే. శమాన్ని అభ్యసిస్తే దమాన్ని అభ్యసించినట్లే. అందువల్ల దమాన్ని అభ్యసించడం అనవసరమని కొందరు చెబుతారు. శమదమాలను రెంటిని అభ్యసిస్తే, శత్రువును లోనుండి, వెలుపలనుండి ఎదుర్కొన్నట్లౌతుంది. ప్రారంభకులైన జిజ్ఞాసువులలో, వారు ఎంతగానో శమాన్ని అభ్యసించినప్పటికి, మనస్సు నిలకడగా ఆత్మలో కేంద్రీకృతం కాదు. అది బాహ్యవస్తువుల చెంతకు పరుగెత్తి వెళ్ళాలని ప్రయత్నిస్తూంటుంది. అందువల్ల ప్రారంభకులైన జిజ్ఞాసువులు దమాన్నికూడ అభ్యసిస్తే, అది వారికి మనస్సును సమర్థవంతంగా అదుపులో ఉంచుకోవడానికి ఎంతగానో తోడ్పడుతుంది. ఒక తుంటరి పిల్లవాని చేతులు కట్టివేస్తే, వాడు కాళ్ళతో అల్లరిచేయడానికి యత్నిస్తాడు, వాడి కాళ్ళు కూడ కట్టివేస్తే అతడు ఊరకుంటాడు. శమం చేతులు కట్టివేయడం లాంటిది; దమం కాళ్ళు కట్టివేయడం లాంటిది. కాబట్టి శమంతోబాటు దమాన్ని అభ్యసించడం వాంఛనీయం.

రాజయోగ విద్యార్థి ప్రాణాయామ, ప్రత్యాహారాలను అభ్యసిస్తాడు. జ్ఞానయోగ విద్యార్థి శమదమాలను

అభ్యసిస్తాడు. ప్రత్యాహారం దమాభ్యాసానికి సరిపోలుతుంది. ప్రాణాయామం తరువాత ప్రత్యాహారం వస్తుంది. అలాగే శమం తరువాత దమం వస్తుంది. జ్ఞానయోగ విద్యార్థి మనస్సును నిరోధించి, అనగా దానిని ప్రశాంతపరచి, ఇంద్రియాలను ప్రత్యాహారం చేస్తాడు. రాజయోగ విద్యార్థి ప్రాణాయామంతో ప్రాణాన్ని నిగ్రహిస్తాడు. ప్రాణం నిగ్రహింపబడితే మనస్సు నిగ్రహింపబడుతుంది. తద్వారా అతడు ఇంద్రియాలను ప్రత్యాహారం చేస్తాడు. మనస్సును, ప్రాణాన్ని రెంటిని ఒకేసారి ప్రత్యాహారం చేయడం ఈ అభ్యాసంలోని విశేషం. మనస్సు ఇంద్రియాలను చలింపజేస్తుంది. ప్రాణం ఇంద్రియాలకు శక్తినిస్తుంది. మౌలికంగా, శమదమాలను రాజయోగ అభ్యాసాలని చెప్పవచ్చు.

ఉపరతి తృప్తిని సూచిస్తుంది. అంతఃకరణము బహిర్ముఖము కాకయుండుటను ఉపరతి అంటారు. ఉపరతి సంపూర్ణమైన సంతుష్టిని, సంతోషాన్ని సూచిస్తుంది. సంపూర్ణ త్యాగంవల్ల, పరమవైరాగ్యంవల్ల మాత్రమే ఉపరతిని అలవరచుకోగలం. కొందరు ఉపరతియంటే సర్వ కర్మ సంన్యాసమని, సంన్యాసం స్వీకరించడమని నిర్వచిస్తారు. ఉపరతి అంటే ఆత్మ ప్రత్యాహారం. బాహ్య పరిసరాలనుండి కోపం పుట్టే కారణం ఎటువంటిది ఉన్నప్పటికి మనస్సు ఏమీ పట్టించుకోని స్థితిని ఉపరతి అంటారు. ఉపరతి అంటే సంపూర్ణ జితేంద్రియత్వం. భోగ్యవస్తువులనుండి మనస్సును త్రిప్పివేయడాన్ని ఉపరతి అని చెప్పవచ్చు. శమదమాల తరువాత ఉపరతియొక్క అభ్యాసం వస్తుంది.

ఉపరతిలో సుప్రతిష్ఠితుడైన యోగి అత్యంత సురూప వతియైన యువతిని సందర్శించినా, రాతిబొమ్మను చూచినా, కొయ్య దుంగను ఆలోకించినా, చెట్టును వీక్షించినా అతనిలో కలిగే భావనలో ఏ తేడా కనబడదు. ఉపరతిలో సుప్రతిష్ఠితుడైన జ్ఞానయోగి అత్యంత రుచికరమైన పదార్థాలను చూచినను ఎటువంటి ప్రలోభం చెందదు. వాటిమీద ఆ మహాపురుషునకు ఎటువంటి తృష్ణ ఉండదు. అతనికి ఏ వస్తువు మీదగాని, తినుబండారం మీదగాని మక్కువ ఉండదు. అతని ముందు మన మేమి ఉంచినా తృప్తి చెందుతాడు. తాను భుజించడానికి తనకు ఫలానా ఫలానా భోజ్యాలు కావాలని అతడెన్నడు ఆసింపడు.

ఈ మనశ్శాంతి, ఉపరతి, సంతుష్టి అతనికి ఎలా వచ్చింది? వివేకాన్ని, వైరాగ్యాన్ని, శమాన్ని, దమాన్ని అతడు అభ్యసించడం ద్వారా అతనికి కల్గిన మానసిక శక్తి వల్ల ఉపరతి చేకూరింది. పై అభ్యాసాలవల్ల మనస్సు అద్భుతమైన ప్రశాంతతను, వర్ణనాతీతమైన ఆధ్యాత్మికానందాన్ని అనుభవిస్తుంది. అప్పుడు మనస్సు తుచ్ఛమైన సుఖాలను కోరదు. అప్పుడు మనస్సు మిథ్యా సుఖాలతో తృప్తి చెందదు. కలకండ దొరికినట్టి మనస్సు నల్లబెల్లానికోసం పరుగెత్తుతుందా? ఉత్కృష్టమైన ఆనందాన్ని మనస్సు అనుభవించేటట్లు చేయడంవల్ల, దానిని ప్రపంచ విషయముల యెడ సంగం లేకుండ ఉండేటట్లు చేయవచ్చు. ప్రత్తిగింజలు బాగా రుబ్బిన మంచి దాణా ఎద్దుకుపెడితే అది ఎండుగడ్డి కోసం పరుగిడుతుందా? మనస్సు వృషభం లాంటిది.

అలాగే మనస్సు యథార్థమైన ఆధ్యాత్మికానందాన్ని ఆస్వాదిస్తే, అది తుచ్ఛమైన మిథ్యా సుఖాలకోసం పరుగులు మానుతుంది.

బ్రహ్మచర్యం అనుష్ఠించే వారు శమం, దమం, ఉపరతి – వీటి అభ్యాస విధానం బాగా తెలిసికొని యుండాలి. శమ, దమ, ఉపరతులను గూర్చిన సదవగాహన లేకుంటే, వాటి అనుష్ఠానం లేకుంటే బ్రహ్మచర్యానుష్ఠానంలో నెలకొని యుండడం సాధ్యం కాదు. ఆ కారణంచేత బ్రహ్మచర్య అనుష్ఠానానికి శమ, దమ, ఉపరతుల అభ్యాసం చాల ముఖ్యం.

దుఃఖ పడకుండ, ఏడ్వకుండ, ప్రతి క్రియలు చేయకుండ అన్ని దుఃఖాలను సహించడాన్ని తితిక్ష అంటారు. తితిక్ష అంటే భరించే శక్తి, ఓర్చుకొనే శక్తి, సహించే శక్తి. తితిక్షువు దుఃఖాలను, నిందలను, శీతోష్ణాలను భరించగలుగుతాడు. అవి తనకు ఎందుకు దాపురించాయా అని చింతిల్లడు. అతడు వాటిని సరకుగొనడు. అతనికి ఏ బాధగాని, ఆవేదనగాని యుండదు. బాధలు ప్రాప్తిస్తే అతడు విలపింపడు. తితిక్ష మనోబలాన్ని (will – power) ను వృద్ధి చేస్తుంది. కేవల తితిక్షాభ్యాసం మోక్షాన్ని ఇవ్వజాలదు. కాని తితిక్ష వివేక వైరాగ్యాలతో జతగూడినపుడు అది ఆత్మజ్ఞాన ప్రాప్తికి, లేదా అమృతత్వప్రాప్తికి ఒక సాధన మాతుంది. దేహాధ్యాస (దేహాన్ని ఆత్మతో తాదాత్మ్యం చేయడం) సుఖదుఃఖాలకు (ద్వంద్వాలకు) కారణం. మనం ఎంత ఎక్కువగ సర్వగతమైన అమృతాత్మతో తాదాత్మ్యం చేసుకోగలమో అంత తక్కువగా మనం సుఖదుఃఖాదులచే (ద్వంద్వములచే)

శాధితుల వలె తాము. కాబట్టి జిజ్ఞాసువులు శీతోష్ణాలను, సుఖదుఃఖాలను ఓర్పుతో భరించేదానికి యత్నించి తుల్య మానసికావస్థను సంపాదించుకోవాలి. సుఖదుఃఖాలను అనుభవించేది (feel) మనస్సు.

శ్రద్ధ అంటే విశ్వాసం. పరబ్రహ్మముయొక్క అస్తిత్వంలో అకుంఠిత విశ్వాసాన్ని, గురుదేవుని బోధనలలో అచంచల విశ్వాసాన్ని, శాస్త్రములందు సంపూర్ణ విశ్వాసాన్ని, తన యందలి ఆత్మవిశ్వాసాన్ని శ్రద్ధ అంటారు. శ్రద్ధాళువైన జిజ్ఞాసువు, గురు చరణాంబుజాలను నిరంతరం సేవించునతడు, గురూపదేశాలను శ్రవణము చేయునతడు, తన యింద్రియాలను వశపరచుకొన్నవాడు తప్పక జ్ఞానాన్ని పడసి, సత్వరంగా పరమశాంతిని, లేక మోక్షాన్ని పొందుతాడు. పై మూడు అర్హతలు అవశ్యం ఉండితీరాలి. అప్పుడే సత్వరంగా అతడు పరమశాంతిని పొందగలుగుతాడు. ఒక్క అర్హత మాత్రమే చాలదు.

పరిశుద్ధ బ్రహ్మమునందు సర్వకాల సర్వావస్థలందు బుద్ధిని నిశ్చలంగా ఉంచుటను సమాధానం అంటారు. ఏకాగ్ర చిత్తమును సమాధానం అంటారు. ఏకాగ్ర చిత్తము ఎల్లప్పుడూ సహజముగ అంతరాత్మపై మరలును. కావున ఏకాగ్రచిత్తముగల యోగ విద్యార్థి బ్రహ్మనిష్ఠ గురుని సమీపించి, శ్రుతులను శ్రవణముచేసి, మననము సల్పి, 'తత్త్వమసి' మహావాక్యార్థముపై ధ్యాన మొనర్పవలెను. అతడు నిరంతరము ధ్యానమగ్నుడు కావలెను. అప్పుడు అతడు ఆత్మసాక్షాత్కారమును పడయును.

స్వస్వరూప జ్ఞానంతో విముక్తుడయ్యేందుకు ఇచ్ఛగించుటను ముముక్షుత్వం అంటారు. మోక్షం పొందాలి అనే తీవ్రవాంఛను ముముక్షుత్వం అంటారు.

వివేకం ఉంటే వైరాగ్యం దానంతట అదే కలుగుతుంది. వివేకవైరాగ్యాలు ఉంటే శమం దానంతట అదే కలుగుతుంది. వివేక, వైరాగ్య, శమ సంపన్నునకు దమం దానంతట అదే ప్రాప్తిస్తుంది. శమదమాలుంటే ఉపరతి దానంతట అదే వస్తుంది. ఈ అర్హతలన్నీ ఉంటే తితిక్ష, శ్రద్ధ, సమాధానం, ముముక్షుత్వం వాటంతట అవే వ్యక్తమౌతాయి.

కొందరు వేదాంతులు సాధనచతుష్టయాన్ని పొందడం అవసరం లేదంటారు. బ్రహ్మధ్యానం చేస్తే అన్ని సద్గుణాల్ని పొందగలం అంటారు వారు. వారు చెప్పింది సరియే కావచ్చు; మంచి ఉత్తమాధికారి మాత్రమే ఈ పద్ధతిని అనుసరింపగలడు. అతడు తన పూర్వ జన్మలలో సాధనచతుష్టయాన్ని ఆర్జించియుంటాడు. ప్రప్రథమంలో సామాన్య జిజ్ఞాసువు బ్రహ్మధ్యానం చేయలేడు. అతని మనస్సు అల్లరిదయ్యం. అతని ఇంద్రియాలు ఎగురుతూ, దుముకుతూ ఉంటాయి. అతడు ధ్యానించడానికి యత్నించవచ్చు. అతడు గాలిలో మేడలు కట్టవలసిందే. తాను నిర్వికల్ప సమాధిలో ప్రవేశించానని అనుకోవడం వట్టి వెర్రి. గాఢ నిద్రను సమాధి అనుకొంటాడు అతడు. అయితే, నిశ్చయమైన బ్రహ్మభావన ఎవరికి సాధ్యం? వివేకం, వైరాగ్యం, శమం, దమం, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానం, ముముక్షుత్వం —

ఈ తొమ్మిదింటిని అభ్యసించి, పరిశుద్ధపరుపబడిన మనస్సు నకు మాత్రమే నిశ్చితమైన పరబ్రహ్మభావన ఉదయింపగలదు. చంచల మనస్సులో, అపరిశుద్ధ హృదయంలో బ్రహ్మభావనలకు చోటులేదు.

అలవాటు చొప్పున జీవన్ముక్తుని కన్నులు సైతము వస్తువుల కేసి చూస్తాయి. కాని అతడు సంకల్పిస్తే తన కన్నులను సంపూర్ణంగా ప్రత్యాహారం చేసి, వాటిని వట్టి గుంతలుగ చేసివేయగలడు. అతడు ఒక స్త్రీని దర్శించాడు అనుకొందాం. అతడు ఆమెను తనకు బాహ్యంగా చూడడు. అతడు యావత్ ప్రపంచాన్ని తనలోనే చూస్తాడు. అతడు ఆ స్త్రీని స్వాత్మగా భావిస్తాడు. అతనిలో లింగ - భావన లేదు. అతని మనస్సులో చెడు సంకల్పాలు లేవు. అతనికి ఆ స్త్రీ యెడ లైంగిక ఆకర్షణ యుండదు. విషయాసక్తుడు ఆమెను తనకు బాహ్యంగా చూస్తాడు. అతనిలో కామ సంకల్పాలుంటాయి. అతనికి ఆత్మభావం లేదు. అతనికి స్త్రీ ఆకర్షణ ఎక్కువ. ఇది జ్ఞాని దృష్టికి, విషయాసకుని దృష్టికి మధ్యగల తేడా. స్త్రీని చూడడంలో దోషం లేదు, ప్రమాదం లేదు. కాని కామసంకల్పాలు మనస్సులో జనింపనీయరాదు. 'శ్రీమాత జగజ్జననియొక్క స్వరూపాలు స్త్రీలు' అని భావించాలి. స్త్రీ సౌందర్యాన్ని పరమేశ్వరుని దివ్యసౌందర్యంగా తిలకించాలి. అన్ని రూపాలను పరమేశ్వరుని ప్రతిమలని తలవాలి. అప్పుడు మన మనస్సు ఉన్నత పరుపబడుతుంది.

ఆత్మసాక్షాత్కారం మాత్రమే అజ్ఞానాన్ని, అవిద్యను

అంతె మొందించి అమృతత్వాన్ని, నిత్యానందాన్ని, శాశ్వత శాంతిని ప్రసాదించగలదు. బ్రహ్మజ్ఞానం మాత్రమే అన్ని క్లేశాలను, మోహాన్ని, దుఃఖాన్ని నిర్మూలించగలదు. ఉపనిషత్తుల ప్రకారం, మానవ జీవిత గమ్యము ఆత్మసాక్షాత్కారమే.

'అనుబంధ చతుష్టయం' అంటే ఏమిటి? విషయం, ప్రయోజనం, సంబంధం, అధికారి — యీ నాల్గింటిని అనుబంధ చతుష్టయం అంటారు. (1) ఉపనిషత్తుల పాఠ్యవిషయం ఏమిటి? ఉపనిషత్తుల పాఠ్య విషయం సర్వోత్కృష్టమైన బ్రహ్మమే. అనగా పరమాత్మయే విషయం. (2) ఉపనిషద్ జ్ఞాన ప్రయోజనం ఏమిటి? ఉపనిషద్ జ్ఞాన ప్రయోజనం అత్యంత సంసార నివృత్తి మఱియు బ్రహ్మానంద ప్రాప్తి. అనగా అమృతత్వసిద్ధి (మోక్షప్రాప్తి) మఱియు తత్ ఫలితంగా కలిగే సంసారబంధ నివృత్తి. (3) సంబంధం ఏమిటి? సంసార నివృత్తి, మోక్షప్రాప్తి — ఈ ఫలాన్ని ప్రకటించడంతో సంబంధాన్ని గురించి చెప్పినట్లే ఔతుంది. (4) ఇక ఉపనిషత్తులు చదువడానికి అధికారి ఎవరు? ఉపనిషత్తులు చదువడానికి, ఆత్మవిచారం సలుపడానికి, బ్రహ్మధ్యానం ఆచరించడానికి సాధన చతుష్టయ సంపన్నుడే అధికారి. ఉపనిషత్తులను సముచితంగా వేదాంతం అంటారు. వేదముల అంతము ఉపనిషత్తులు. శిష్టాచారమత శృంఖలాలనుండి ముక్తులైనవారికి మాత్రమే వేదాంతం ప్రత్యేకించబడింది. ఉపనిషత్తులు లేక వేదాంతం జనసామాన్యానికి నిర్దేశితం కాదు. ఉపనిషత్తులు ఉత్తములైన కొలదిమందికే నిర్దేశిత

ములు. ఉపనిషద్ బోధనలను స్వీకరింప అర్హులైనవారికి, యోగ్యులైనవారికి ఉపనిషత్తులు నిర్దేశింపబడినవి. అందువల్లనే ఉపనిషద్ అనే పదానికి మొట్టమొదట 'రహస్య బోధన', లేక 'రహస్య సిద్ధాంతం' అని అర్థమివ్వబడింది. జ్ఞానయోగ జిజ్ఞాసువునకు మొదటి అర్హత సాధన చతుష్టయమని మనము గ్రహింపవలయును.

'బ్రహ్మము' అంటే ఏమిటి ? బ్రహ్మము శాంతి రూపము. అది నిష్క్రియరూపము. అది ఎటువంటి ద్వైత భావనలేని నివృత్తిరూపము. 'అయం ఆత్మా శాంతః' 'శాంతం, శివం, అద్వైతం — స ఆత్మా' 'శాంతం. అజరం, అమృతం, అభయం, పరం' 'అజరం, అచరం, అమరం, అవినాశి' ఇలా శ్రుతులలో ఆత్మను గురించి వర్ణింపబడియుంది. ఏకాంతంలో, ఒంటరివై యుండి తీవ్రమైన నిరంతర నిధి ధ్యాసన యొనర్చుటవలన మాత్రమే ఈ స్థితి సాక్షాత్కారము కాగలదు. బ్రాహ్మీస్థితిని నిష్కామ్యకర్మవల్ల ఎప్పటికిని పొందలేము. అమృతమైన బ్రహ్మమునకు ఆది యుండజాలదు. అందువల్ల అమృతమైన బ్రహ్మము అనాది. సాధారణంగా బ్రహ్మమును ఆకాశానికి పోలుస్తారు. 'ఆకాశవత్ సర్వగత, నిత్య' అని శ్రుతులు ఘోషిస్తాయి.

వాస్తవంలో ప్రపంచం అనేది లేదు. అది భ్రాంతిమాత్రం. అది కేవలం ఛాయ. ఆకాశంలో నీలి వర్ణం ఎలా కనబడుతుందో అలాగే బ్రహ్మములో జగత్తు కనబడుతుంది. శుద్ధ సచ్చిదానంద బ్రహ్మమే సత్పదార్థము. విచారశీలికి ఈ ప్రపంచమనేదే యుండదు. ఈ ప్రపంచం మనోవిలాసం,

వాస్తవంలో సృష్టి లేదు. రజ్జువులో సర్పము వోలె (త్రాటిలో పాము లాగా) అది కేవల అధ్యారోపము. మందమతులైనట్టి జిజ్ఞాసువులు ఈ విషయాన్ని అర్థం చేసికోలేరు. అందువల్ల ఈ జిజ్ఞాసువుల తృప్తికోసం ఉపనిషత్తులలో సృష్టిక్రమం చెప్పడం జరిగింది.

మనం స్వప్నావస్థలో ఉన్నంతసేపు కలలు నిజంగా కనబడుతాయి. మనం మేల్కొంటూనే ఆ కలలు కల్లలౌతాయి. అదే విధంగా మానవుడు ఎంతకాలం అజ్ఞానంలో మునిగి ఉంటాడో అంతకాలం వానికి జగత్తు ఘన సత్యంగా గోచరిస్తుంది; అతనికి జ్ఞానం ఎప్పుడు లభ్యమౌతుందో, ఆత్మజ్ఞానం ఎప్పుడు ప్రాప్తిస్తుందో అప్పుడు అతనికి ఈ ప్రపంచం మిథ్యగా కనబడుతుంది. విషయాసక్తులు భార్యలో, బిడ్డల్లో, భాగ్యంలో, శరీరంలో సత్యాన్ని దర్శిస్తారు. భగవంతునిలో అసత్యాన్ని చూస్తారు. వివేకి భగవంతునిలో సత్యాన్ని, ప్రపంచ విషయాలల్లో అసత్యాన్ని చూస్తాడు.

వేదాంత తత్త్వం ఆరు ప్రమాణాలను ఒప్పుకొంటుంది. అవి ఏమిటంటే;

1. ప్రత్యక్షము.
2. అనుమానము.
3. ఉపమానము,
4. శబ్దప్రమాణము.
5. అర్థాపత్తి.
6. అనుపలబ్ధి.

ఉపనిషత్ప్రమాణం శబ్దప్రమాణం క్రిందికి వస్తుంది.

కొన్ని దృష్టాంతాల ద్వారా కొన్ని ఉపనిషత్సత్యాలను తెలిసికొందాం. సాధారణంగా దృష్టాంతాలు ఏకాదేశికంగా ఉంటాయి. అవి ఒక అంశాన్ని మాత్రమే సూచిస్తాయి. అవి అన్ని అంశాలను సూచింపవు. ఆకాశాన్ని ఉదాహరణగా తీసుకొందాం. ఆకాశాన్ని బ్రహ్మమునకు పోలుస్తారు. బ్రహ్మము ఆకాశంలాగా సర్వగతము. దాన్ని ఇంక మనం పొడిగించలేము. ఎందువల్లనంటే ఆకాశం జడం, బ్రహ్మము జడముకాదు.

(1) తమ నామరూపాల్ని పోగొట్టుకొని నదులు సముద్రంలో అదృశ్యమైనట్లు విజ్ఞుడు నామరూపాల్నుండి ముక్తుడై దివ్యపురుషుని చేరుతాడు.

(2) వస్త్రఖండం నూలే. గుడ్డ నూలునుండి వేరు కాదు. అలాగే ప్రపంచం ఆత్మనుండి వేరుకాదు. ఏ విధంగా 'నూలు' వస్త్రాన్ని పరివ్యాప్తి చెందియున్నదో అట్లే 'ఆత్మ' ప్రపంచాన్ని పరివ్యాప్తం చెందియుంది.

(3) బంకమట్టిని గురించి తెలుసుకొంటే కుండలన్నింటిని గురించికూడ తెలుసుకొనగలుగుతాము. అలాగే మనకు బ్రహ్మజ్ఞానం ఉంటే మనకు అన్నింటిని గురించి జ్ఞానం కలుగుతుంది. యావత్ ప్రపంచం బ్రహ్మముమీాద ఆధారపడియున్నది కదా !

(4) శబ్దం గ్రామఫోన్ రికార్డులో దాగియుంది, మొగ్గలో సౌరభం దాగియుంది. సూర్యుడు మేఘాలమాటున, అగ్ని ధూమం మాటున, బంగారం క్వార్ట్జలో, తైలం తిల

లలో, మనస్సు మెదడులో దాగియున్నాయి. అలాగే భగవంతుడు (పరమాత్మ) ఈ దేహంలో, తదితర వస్తువుల్లో దాగియున్నాడు.

(5) జలగ, జలజం (తామర పూవు) ఒకే మాత్ర జలంనుండి పుట్టాయి. అలాగే మంచి, చెడ్డ పరమాత్మనుండి, లేక ప్రకృతినుండి ఉద్భవించాయి.

(6) సూర్యకిరణాలవలన జనించిన మేఘాలు సూర్యునే మరుగుపరుస్తాయి. అలాగే ఈ అసత్యమైన మిథ్యాహంకారము ఆత్మసంభవమైనప్పటికి ఆత్మను మరుగుపరుస్తూంది.

(7) జెనానా స్త్రీ పరదా కంతలగుండ మనల్ని చూడగలదు. మనం ఆవిడను చూడలేం. అలాగే భగవంతుడు మనల్ని చూడగలడు. మనం ఆ ప్రభువును చూడలేం. కాని జ్ఞాన చక్షువుతో భగవంతుని చూడవచ్చు.

(8) కమ్మలు బంగారంయొక్క వివర్తం. పాము త్రాటి వివర్తం. బెంచి కొయ్య వివర్తం. ఘటం మృత్తిక వివర్తం. అలాగే ప్రపంచం, దేహం బ్రహ్మముయొక్క వివర్తం. వివర్తం అంటే అధ్యాస.

(9) మరుభూముల్లో మానవుడు నీటికోసం అన్వేషించినట్లే అజ్ఞానులు సుఖంకోసం ఈ ప్రపంచంలో ఇంద్రియ విషయాలలో, యువతులలో, ధనంలో, అధికారంలో, నామరూపాలల్లో నిష్ప్రయోజనంగా వెదుకుతారు. నిజమైన ఆనందం ఆత్మలో ఉంది. ఆనందం సర్వుల హృదయాంతర్వ్యాపియైన భగవంతునిలో ఉంది. ఆనందాన్ని అచ్చట (ఆత్మలో) అన్వేషించాలి.

(19) బంగారు లేశాలు మైనపు ముద్దలో ఉండేలాగున ప్రళయకాలంలో జీవాత్మలు బ్రహ్మమునందు ఉండును.

ఉపనిషత్సత్యాలను ధ్యానించడమే ఉపనిషత్ సాధన. ఇది జ్ఞాన యోగం. బ్రహ్మజ్ఞానం అనేది ఏదో ఒక వస్తువును గూర్చిన జ్ఞానం కాదు. బ్రహ్మము అగుటయే బ్రహ్మజ్ఞానము. అది సందర్శనము కాదు; అది అనుభూతి. బ్రహ్మమును తెలుసుకొనడమే జీవిత సాఫల్యము. బ్రహ్మమును తెలుసుకోకుండ మరణించువాడు కడు దురదృష్టవంతుడు. పరబ్రహ్మమును తెలుసుకొని ఎవడు మరణించునో అతడు మహాపురుషుడు. అతడే నిజమైన బ్రాహ్మణుడు.

'స్వరూపం' అంటే మన అసలు సచ్చిదానంతత్వం. మన అసలు స్వరూపాన్ని తెలుసుకోవడమే జీవిత గమ్యం. దాన్నే 'స్వరూప సాక్షాత్కారం' అంటారు. దీన్ని పొందడానికి వివేకం, విచారం అవసరం. సత్యాసత్యాల, నిత్యానిత్యాల, జడచైతన్యాల, ఆత్మానాత్మల మధ్య విచక్షణా జ్ఞానమే వివేకం. 'నేనెవరు? నా నిజమైన స్వరూపం ఏమిటి? ఆత్మ అంటే ఏమిటి?' — వీటిని విచారించుటయే విచారం.

ఈ రోజుల్లో మనం ఎక్కువగా వేదాంతపు ముచ్చట్లు చూస్తూంటాం. అసలు అనుభవ వేదాంతం శూన్యం. ప్రజలు 'ఏకత్వం, ఐక్యత, సమత' లను గూర్చి మాట్లాడుతారు. కాని పనికిమాలినటువంటి స్వల్ప విషయాల కోసం వారు పోరాడుతారు. వారి ఈర్ష్యకు, ద్వేషానికి హద్దులు లేవు. వారు అమిత నీచులు, సంకుచిత మనస్కులు. వారిని గురించి ఊహించలేము.

అద్వైత వేదాంతం సర్వ మతస్తులను ఆశ్లేషిస్తుంది. సాయుజ్యం అందరికీ అందుబాటులో ఉన్నదని చాటుతుంది. ప్రతి వ్యక్తీ ఆత్మసాక్షాత్కార పథం మీద ఉన్నటువంటి వాడే. దేవుడున్నాడని అనేందుకు తిరస్కరించేటటువంటి నాస్తిక వాదులు, పక్కా లోకాయత మతవాదులు, చార్వాకులు సైతము మిస్ కారు (తప్పి పోరు). ఎందువల్ల నంటే తమ మానసిక శక్తుల్ని బొత్తుగ వినియోగించకుండ, నైతిక విషయాల్నిగాని, మతసమస్యలను గురించిగాని బొత్తుగ తెలియని వారికంటె లోకాయత మతవాదులు మానవ క్రమ పరిణామంలో గాని, ఆత్మ సాక్షాత్కార నిశ్శ్రేణిలో గాని చాల ఉన్నతమైన మెట్టులో అడుగిడిన వారని చెప్పాలి. ప్రతి వ్యక్తిలో ఏకత్వాన్ని అనుభవించాలని వేదాంతం చెబుతుంది. 'లోకాః సమస్తా సుఖినో భవంతు' అనే వైదిక సూత్రంతో వేదాంతంసర్వ సృష్టిని ఆశీర్వాదిస్తుంది. ఒకర్ని మరొక విశిష్ట మతశాఖలోనికి మార్చాలని వేదాంతం అనుకోదు.మానవాభ్యుదయ పథంలో తానెట్టి దశలో ఉన్నప్పటికి ఎవడికి వాడు సత్యసంధుడుగా ఉండాలని, సత్యాన్వేషణలో తాను నిర్విరామంగా ఉండాలని వేదాంతం ఆశిస్తుంది. పిల్లలు తమ తల్లిని (ముఖ్యంగా వారు తమ శైశవంలో తల్లిని వదలియుంటే) గుర్తించలేక పోవచ్చు. ఆమెను ఎదిరించవచ్చు కూడ. కాని మాతృమూర్తికి అందరిని తెలియును. కాబట్టి తన పిల్లలనందరను, వారు ఎక్కడున్నాసరే, సమానంగా ప్రేమిస్తుంది. ఇది ప్రపంచంలోని ఇతర మతాల పట్ల అద్వైత వేదాంతానికి ఉండేటటువంటి ప్రేమ ప్రవత్తి.

అద్వైత వేదాంతం అందరికీ సంతోషాన్ని, ఆనందాన్ని, శక్తిని, శాంతిని, బలాన్ని ప్రసాదిస్తుంది.

మనకు భౌతికమైన మానసికమైన, నైతికమైన, ఆధ్యాత్మికమైన ఏ సంపదయున్నప్పటికి దాన్ని అందరితో పంచుకోవాలి. ఇది నిజమైన వేదాంతం. అధర వేదాంతం పక్కా కపటం. నిజమైనటువంటి అభ్యాసయుక్త వేదాంతం స్వల్పమైనప్పటికి మానవుని సత్వరంగా ఉద్ధరించి, అతనిని అమరునిగా, నిర్భయునిగా చేస్తుంది. 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' అని భగవద్గీత.

ఈ సందర్భంలో ఆధ్యాత్మిక ప్రచార ప్రాముఖ్యతను గూర్చి వివరించటం అసంగతం (digression) కాదను కొంటాను. గీతలో భగవాను డిలా సెలవిస్తాడు.

న చ తస్మాన్ మనుష్యేసు
కశ్చిన్ మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మాత్
అన్యః ప్రియతరో భువి॥

మరియు మానవులలో (శాస్త్ర సాంప్రదాయమును భక్తులకు చెప్పు) అతనికంటె నాకు ప్రియము కలుగజేయువాడు మరె వ్వరును లేడు. ఈ భువియందు అతనికంటెను నాకు మిక్కిలి ప్రియమగువాడు ఎవడునూ లేడు, ఉండబోడు.

మానవుని బాధల్ని పూర్తిగా నివారింపగలిగిన కార్య క్రమం ఏమిటి? మూల అవిద్యను తొలగించి, అంతశ్శాంతిని, నిత్యానందాన్ని ఇవ్వగలిగిన కార్యక్రమం. ఆ కార్యక్రమం ఏంటి? అది ఆధ్యాత్మిక ప్రచారం, బ్రహ్మవిద్యా వ్యాప్తి,

ఆత్మ శాస్త్ర ప్రచారణం. ఆ కార్యక్రమం మానవ సేవల విజయోత్కర్షం, అది మహాయోగం, గొప్ప యజ్ఞం.

మానవుని దుఃఖానికి మూలకారణం (Root cause) ఏమిటి? వాస్తవమైన జీవితగమ్యాన్ని గురించి తెలుసుకోక పోవడం, ఆత్మస్వభావాన్ని అవగతం చేసుకోక పోవడం.

అధ్యాత్మ శాస్త్రం మానవునకు అసలు పెన్నిధానం. అది అవ్యయ నిధి. పరమోత్కృష్టమైన ఈ దివ్యసౌభాగ్యం భారతావనికే దక్కుతుంది. అత్యంత సంస్కృతీ పరులైన వారు, మహాధనికులైనవారు ప్రపంచంలోని నానాప్రాంతాల నుండి భారతవర్షానికి యోగాభ్యాసంకోసం వస్తూంటారు. వారు ఇచ్చటి ఋషుల నుండి, మహనీయుల నుండి, మహాత్ములనుండి, తపోధనులనుండి మార్గదర్శకత్వం పొంది, అవ్యయమైన ఆధ్యాత్మిక ధనాన్ని ఆర్జిస్తారు. ఈ అవ్యయ ధనాన్ని ఎవ్వరు ముచ్చిలించలేరు. భారత దేశం ఎన్నటికీ భౌతికంగా, ఆధ్యాత్మికంగా సంపన్న దేశంగానే ఉంటుంది. ఎన్నో జాతులవారు మన దేశంపై దండయాత్రలు జరిపారు. అయినప్పటికి మన వనరులు విస్తారంగానే ఉన్నాయి. భారత మాత ఎన్నడూ స్వేచ్ఛతోనే ఉంటుంది. భారతీయుల నాగరకత, సంస్కృతి ప్రపంచంలో అగ్రస్థానం వహిస్తుంది.

ధనంవల్ల ఆనందం రాదు. పాశ్చాత్య దేశస్థులకు అపరిమితంగా ధనం ఉంది. కాని, వారు శాంతి లేకుండ ఉన్నారు. స్వార్థబుద్ధి, లోభము, ద్వేషము, ఈర్ష్య, మాత్సర్యము వారి శాంతిని సంహరించాయి. దీనినిబట్టి మనం ఆధ్యాత్మిక జీవితం మాత్రమే నిజమైన శాశ్వతశాంతిని,

ఆనందాన్ని ఇవ్వగలదని నిర్ధారింపవచ్చు.

అధ్యాత్మిక కార్యక్రమాల్లో నిమగ్నులైన వారిని జూచి, 'మీరు మీ అమూల్యమైన కాలాన్ని, మేధాసామర్థ్యాలను పనికి మాలిన కార్యక్రమాలల్లో వృథా చేయడం ఏం బాగు లేదండీ. అవి మనసత్వర సమస్యలను ఏమైన తీర్చగలవా, పెట్టగలవా?' అని అంటూంటారు. మన వర్తమాన స్థితికి ఏది మూలకారణమో తెలుసుకోవాలి. దాన్ని ఛేదించడంవల్లనే మన సత్వర సమస్యా పరిష్కారం కాగలదు. దేశప్రజలలో అధిక సంఖ్యాకులకు అత్యుత్తమ సంస్కృతి, శీలం ఉండాలి. అలా లేనినాడు ఆ దేశం అభివృద్ధిని సాధించలేందు. దాని మనుగడకే ముప్పు వస్తుంది. భారతీయుడు గతమెంతో ఘనకీర్తిగలవాడు. మన దేశ ప్రాచీన సంస్కృతి విశిష్టమైనది. ఆ సంస్కృతి ఈ నాడు ఏకొలది మందిలో పరిమితం. దాన్ని మనం పునరుద్ధరించాలి. మనం పోగొట్టుకొన్న ఐహిక, ఆధ్యాత్మిక, పైతృక ధనాన్ని, వారసత్వ సంపదను తిరిగి పొందాలంటే మన సంస్కృతిని మహోన్నత స్థాయికి తీసుకొని పోవాలి.

'తినేదానికి తిండి, కట్టుకోడానికి బట్ట, ఉండేదానికి కొంప నోచుకోని సామాన్యప్రజానీకం, నిమ్నతర మధ్యమ తరగతి ప్రజలు తమ భౌతిక అవసరాలను తృప్తిపరచుకోకుండ, ఆధ్యాత్మిక ప్రచారకులు చేసే ఈ సాంస్కృతిక బోధల్ని ఎలా జీర్ణించుకో గలరు?' అని మన ఆర్థిక శాస్త్ర అధ్యాపకులు అంటూంటారు. దీనికి మన ప్రత్యుత్తరం ఏంటి? శ్రీమంతులైన మన విద్యాధికులు తమ అనుదిన

జీవితంలో మతాన్ని, వేదాంతాన్ని అనుష్ఠించి, ప్రప్రథమంలో వారు తమ శీలాన్ని, సంస్కృతిని అభివృద్ధి పరచుకోవాలి. వారు నిస్స్వార్థ సేవాసక్తిని, ఆత్మత్యాగ భావాన్ని అలవరచుకోవాలి. పేద ప్రజానీకాన్ని ఉద్ధరించాలి. అప్పుడు మనం పోగొట్టుకొన్న దివ్యవైభవాన్ని, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని తిరిగి మనం పొందగలం.

కొందరు ఉదరపరాయణులు శీలాన్ని గురించిగాని, సంస్కృతిని గురించిగాని పట్టించుకోరు. వారు పేద ప్రజల ఆర్థిక శ్రేయస్సునుగురించి అనుకోరు. వారు ఇలా అంటూంటారు "మాకు టైమ్ ఎక్కడుందయ్యా? ఏ పనిచేయడానికి మాకు విశ్రాంతి ఏదీ? ఎవరిపని వాళ్ళు చేసుకోవాలి. మేము రాత్రి చాల పొద్దుపోయేవరకు మా పేషంట్లతో వేగాలి. మేము విశ్రాంతి తీసుకొనేందుకు, షాపింగ్ వెళ్ళడానికి, సినిమాలకు వెళ్ళడానికి, ఇతర అవసరాలకు మాకు టైమ్ ఉండాలికదా మరి?" ఇటువంటివారి దృష్టి స్థూలమైనది. వారిది పరిమిత దృష్టి. వారికి పారమార్థిక విషయాలను గురించి బొత్తిగ తెలియదు. వారిది అసుర జీవన ప్రవృత్తి. ఈ దుష్ట ప్రవృత్తి భవిష్యజ్జన్మల్లో బంధాన్ని, బాధల్ని కలుగజేస్తుంది. మనస్సుంటే మార్గముంటుంది. (**where there is a will there is a way**). వారు మనః పూర్వకంగా బాధిత మానవకోటిని సేవించాలంటే వారికి కావలసిన విరామం ఉంటుంది. శక్తి ఉంటుంది.

"మనం మన సాయశక్తుల్ని ఆర్థిక, రాజకీయ రంగాలకు వినియోగించాలి. ఆధ్యాత్మిక సంస్కృతీ ప్రచారంలో

మన సర్వశక్తుల్ని ధారపోయడం వట్టి వృథా. మనకు ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చిన మీదట ఆ సంస్కృతిని, శీలాన్ని, ఉత్తరజీవితాన్ని గురించి అనుకోవచ్చు" అని కొందరు అభిప్రాయపడుతారు. ఈ అభిప్రాయంతో మనం ఎలా ఏకీభవించ గలం? అటువంటి పరిస్థితిలో మనం ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చేదాకా తినడం, త్రాగడం, వృత్తికార్యక్రమాలు మొదలైన వాటన్నిటిని ఆపేయాలి. దేహానికి అన్నం ఎంత ముఖ్యమో, ఐహిక జీవనానికి ధనం ఎంత అవసరమో, ఆత్మకు సంస్కృతి, శీలము, మతం అంత అవసరం. ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చే వరకు మనం కాచుకొని ఉంటే మనం అసలు ముందడుగు వేయలేం. మన జీవిత కాలంలోనే ఆర్థిక స్వాతంత్ర్యం వస్తుందని ఎవరు గట్టిగ చెప్పగలరు ? ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చేవరకు శీలాన్ని, సంస్కృతిని, మతాన్ని పట్టించుకోకపోతే మనం ఈ అమూల్యమైన జీవితాన్ని, మానవ జన్మను వ్యర్థం చేసినవారం ఔతాము.

కొందరు అధ్యాపక మేధావు లిట్లా భావిస్తారు; "మనం ఆధ్యాత్మిక జీవితానికి, మతానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చేసాం. అందువల్ల మనం పడిపోయాం, దాస్యాన్ని అనుభవించాం. గతంలో మనం భౌతిక అభ్యుదయాన్ని ఉపేక్షించాం. అందువల్ల మనం పేదవారం అయినాము. మతం, వేదాంతం — వీటిని అలా అట్టిపెట్టి మనం మన

భౌతిక వనరుల్ని, భౌతిక శక్తుల్ని పెంపొందించుకొని పాశ్చాత్యులు సాధించిన పురోగమనాన్ని, అధికారాన్ని, సుఖాల్ని మనం కూడ సాధించాలి.'' నిజమే. రాజకీయ రంగంలో, ఆర్థిక రంగంలో, సాంఘిక రంగంలో పనిచేసేటటు వంటివారు కూడ ఆధ్యాత్మిక అధిష్ఠానంమీద సుశిక్షితులు కానిదే, మత శిక్షణ పొందనిదే వారు ప్రజోపయోగమైన పనులను సక్రమంగా, సరిగా నిర్వర్తించలేరు. సాంఘిక, రాజకీయ నాయకులు — కొందరు మినహా – స్వార్థపూరిత ఉద్దేశ్యాలతో పనిచేస్తారు. పేరుకోసం, ప్రతిష్ఠకోసం, ధనం కోసం, ఆధిక్యతకోసం, అధికారంకోసం వారు హోరా హోరీ లడాయి సాగిస్తూంటారు.

"ఆధ్యాత్మిక జీవితానికి, భౌతిక జీవితానికి మనం మధ్యే మార్గం చూడాలి. ఆధ్యాత్మిక అంశానికి మాత్రమే మనం ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చిన దానివల్ల ఈ ప్రస్తుత పరిస్థితికి దిగజారినాము. అందువల్ల భారత దేశానికి సంబంధించినంతమట్టుకు మనం భౌతిక, పారిశ్రామిక అభివృద్ధిని సాధించాలి.'' అని కొందరు మేధావులు అంటూంటారు. ఆధ్యాత్మిక, భౌతిక రంగాలలో పూర్ణాభివృద్ధి ఉండవలసినదే. అయితే, మన పతనానికి కారణం ఏమిటి? మనం కామం, లోభం, ద్వేషం, స్వార్థం, అనైక్యత – ఈ దోషాలతో కూడిన ఐహిక జీవనానికి అధిక ప్రాధాన్యం ఇవ్వడమే

అనాలి. ఆధ్యాత్మిక రంగాన్ని, ఐహిక రంగాన్ని - ఈ రెంటిని ఉపేక్షించేందుకు వీల్లేదు. రెండు రకాల సేవకులు - సాంఘిక పరమైనవారు, మతపరమైనవారు - ఈ ఆధునిక ప్రపంచంలో భౌతిక, ఆధ్యాత్మిక రంగాలల్లో తుల్యాభివృద్ధిని సాధించడానికి అవసరమౌతున్నారు. వడ్రంగి పని వేరు; ఎలెక్ట్రీషియన్ పని వేరు. ఒకరి పనిని మరొకరు చేయాలని మనం ఆశించకూడదు. ఇరువురు అవసరమే. ఆర్థిక, సాంఘిక, రాజకీయ, పారిశ్రామిక రంగాలలో నిర్మాణాత్మకాభివృద్ధి అవసరమే.

'ఐహిక జీవితం శ్రేయస్కరమా, ఆముష్మిక జీవితం శ్రేయోదాయకమా?' అనే విషయంలో సర్వసంగపరిత్యాగులకు, గృహస్థులకు వివాదం ఉంది. 'జీవాత్మ, పరమాత్మ - ఇవి ఒకటేనా, లేక వేర్వేరా?' అనే విషయాన్ని గురించి ద్వైతులకు, అద్వైతులకు తగాదా ఉంది. 'ఎటువంటి రకమైన సేవ అవసరం?' అనే విషయాన్ని గురించి రాజకీయ సేవకులకు, ఆధ్యాత్మిక సేవకులకు వివాదం ఉంది. గృహస్థులను, ద్వైతమతస్థులను, రాజకీయనాయకులను ఒప్పింపజేయడం చాల కష్టం. సాధన ద్వారా, అభ్యాసం ద్వారా వారు తమ మనస్సును శుద్ధి చేసుకోవాలి. దోష సంస్కారాలను తొలగించుకోవాలి. ఆధ్యాత్మిక రంగంలో పనిచేసేవారు ఇతర రంగాలలో పని చేసేవారితో వాదోపవాదాలు చేయడం కూడదు. ఆధ్యాత్మిక రంగంలో పనిచేసేవారు ఇతరరంగాలలో

పనిచేసేవారితో సహకరించి పనిచేయాలి. అంతేగాకుండ తమ ఆధ్యాత్మిక కార్యక్రమాలను గూడ అధికోత్సాహంతో కొనసాగిస్తూండాలి.

అయితే, ప్రజల్ని రక్షించగలిగేది మతం (ధర్మం) ఒక్కటే అని గుర్తించుకోవాలి. మతం లేకుండ మానవుడు వ్యర్థజీవి ఔతాడు. రాజకీయస్వాతంత్ర్యం, ఆర్థికస్వాతంత్ర్యం ఈ ప్రపంచంలోని దుఃఖాల్ని, బాధల్ని పూర్తిగ రూపు మాప జాలదు. వాటివల్ల మనకు కొన్ని సౌకర్యాలు లభించ వచ్చు. ఈ లోకం కుక్కతోక లాంటిది. కుక్కతోక వంకర. ఈ లోకంయొక్క వంకరను సరళం చేయలేం. సంస్కృతోజ్వలకలమాన్న భోజనము శాశ్వతసుఖాన్ని ప్రసాదించలేందు. పాశ్చాత్యుల ఆధునిక విలాసాలు, భోగాలు ఆధ్యాత్మిక జీవనానికి పరమశత్రువులు. అవి శాంతి విరోధులు. పాశ్చాత్యుల ఆధునిక విలాసాలు, భోగాలు మనల్ని చ్యుతుల్ని చేస్తాయి. వాస్తవంలో ప్రపంచంలో మానవునికి కావలసింది చాల స్వల్పమే. 'అహో జనానాం వ్యసనాభి ముఖ్యం' — 'అయ్యో, జనులు వ్యసనములవైపు నకు పోవుచున్నారు గదా' యని శ్రీ కులశేఖరులు చింతి స్తారు. ప్రాపంచకులలో ఆధ్యాత్మిక ప్రబోధాన్ని కలిగించి, వారిని వ్యసనముల బారినుండి రక్షించి, సమస్త పురుషార్థ ములు వారికి సిద్ధింపజేయుటకై ఆధ్యాత్మిక ప్రచారము

అవసరమైయున్నది. ప్రచారానికి ముందు ఆచారం, విచారం ఉండడం శ్రేయస్కరం. ఆధ్యాత్మిక విద్యా వ్యాప్తి (Dissemination of spiritual knowledge)ని ఉద్దేశ్యంగా ఉంచుకొని ఈ గ్రంథ రచనకు పూనుకోడం జరిగింది.

మానవకోటికి ఉపనిషత్తు బోసగే అద్భుతమైన సందేశము ఏమిటి?

"హే మానవా, జీవ భావాన్ని నిర్మూలించు. జీవ భావానికి ప్రతిపక్ష భావనయైన 'అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మమును)' భావనను ఉంచుకో, వ్యావహారిక బుద్ధివల్ల జీవ భావన కలుగుతుంది. పరిశుద్ధ బుద్ధితో, పరిశుద్ధ హేతువుతో వ్యావహారిక బుద్ధిని నిర్మూలించు.

తత్త్వమసి, అదియే నీవు. నీవు బ్రహ్మము. నీవు ఒక ఉద్యోగశాలలో పేద గుమాస్తా యైనప్పటికిని ఈ ఒక్క భావనలోనే స్థిరుడై యుండుము. గుమాస్తా భావన ఒక మానసిక సృష్టి. ఎల్లప్పుడూ అనవసాదముతో నుండుము. నిర్భయుడవై యుండుము. నీవు దేహామునకు భిన్నుడవు. నీవు మనస్సునకు భిన్నుడవు. నీవు పంచకోశములనుండి నీ ఆత్మను వేరుచేయుము.

'నేను దేవుడను, నేను బ్రహ్మము' అని ధైర్యముగ చెప్పుము. అటుల భావింపుము. ఇది నీ జన్మ హక్కు. వత్సా, భయపడకుము. లెమ్ము, సాక్షాత్కారము పడ

యుము. సత్యాన్ని చాటుము. ఇతరులు కూడ సత్యాన్ని తెలిసికొనేటట్లు చేయుము వారికి సాయపడుము.

అన్ని దేహాలు నీవి అనుకో. నీ దేహంకోసం ఎటు వంటి ప్రత్యేక సంగాన్ని ఉంచుకోవద్దు. నీవు ఒక్క దేహం తోనే నిన్ను నీవు బంధ పరచుకోకు. 'అన్ని దేహాలు నావి' అని చెప్పుము. వ్యాకోచము నొందుము. విశ్వవిరాట్‌తో నిన్ను నీవు తాదాత్మ్యపరచుకొనుము. వేదాంత సాధనలో మొదటి మెట్టు ఈ స్థూల వ్యాకోచము.

హిరణ్యగర్భునితో నిన్ను నీవు తాదాత్మ్యపరచుకో. ఇది సూక్ష్మ వ్యాకోచము. ఇది రెండవ మెట్టు. తరువాత ఈశ్వరునితో, అనగా సర్వకారణ శరీరాలతో నిన్ను నీవు తాదాత్మ్యపరచుకో. కట్టకడపట (విరాటుని, హిరణ్యగర్భుని, ఈశ్వరుని అతిశయించు) బ్రహ్మముతో నిన్ను నీవు తాదాత్మ్యపరచుకొనుము. ఓ ముముక్షూ, స్థూలాన్ని సూక్ష్మంలో లయం చేయుము. సూక్ష్మాన్ని కారణంలో లయం చేయుము. కారణాన్ని ఆత్మలో లయ మొనర్చుము. ఇది లయ క్రమము.

మనకు ఇచ్చట కనబడే అన్ని వస్తువులలో పరబ్రహ్మము వ్యాపించియున్నది. కాబట్టి మానవుడు భేదభావనను వదలి బ్రహ్మానందాన్ని అనుభవించాలి. పరుల సొత్తుకోసం ఆస పడరాదు.

జీవితం దుఃఖసాగరం కాదు. సంగాన్ని వదలిపెట్టి కర్మలు చేస్తూ మానవుడు వంద సంవత్సరాలు మనుటకు ఆసపడాలి. సరియైన దృష్టితో, వివేకంతో పరికి స్తే జీవితం ఒక బంధం కాదు. సమ్యగ్‌జ్ఞాన సంపన్నుడు అన్ని ప్రాణుల్ని తన ఆత్మగ చూస్తాడు. తన ఆత్మను అన్ని ప్రాణులుగ ఆలోకిస్తాడు. ప్రతి వస్తువు అతనికి తన ఆత్మయే. అందువల్ల అతడు ఎటువంటి శోకంవల్లగాని, మోహంవల్లగాని క్లేశ పడడు.''

**ఇది ఉపనిషత్ సందేశం.**

ఈ గ్రంథాన్ని రచించడంలో నాకు బ్రహ్మలీన పూజ్య శ్రీ శ్రీ శ్రీ శివానంద సరస్వతీ స్వాములవారి Principal upanishads చాల ఉపకరించినది. భగవాన్ శ్రీ శంకరాచార్యులవారి భాష్యమును గూడ అనుసరించాను.

ఈశావాస్యోపనిషత్తునకు టీక, భావము, వివరణము విపులంగా, సరళంగా అందరకు అర్థమయ్యేలాగున పరమే శ్వరుని కృపావిశేషంచే వ్రాయ సాహసించాను. వ్రాత ప్రతి 200 పేజీలు దాటింది. దాన్ని అచ్చొత్తించాలని ఆవేదన కల్గింది. **'Beg, borrow and publish'** అను శ్రీ శివానంద యతివరేణ్యుల ప్రబోధమును ఆధారముగ చేసుకొని గ్రంథరచనా, ముద్రణలకు పూనుకొనినాను. ఈ జ్ఞానయజ్ఞమునకు సుహృద్భావముతో నన్ను ప్రోత్సహించి,

ఏతద్ యజ్ఞము విజయవంత మగుటకు దోహదమొసగిన బ్రహ్మచారి శ్రీ సుందరరాజన్ గారికి నా మనః పూర్వక మైన కృతజ్ఞతలు. ఈ గ్రంథముద్రణకు సహాకరించిన ఉదారులకు, దాతలకు, మిత్రులకు, సుహృత్తులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. గ్రంథమును అందముగ ముద్రించుటకు తోడ్పడిన శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు వారికి నా ప్రేమపూర్వక అభివందనములు.

ఉత్తమ విజ్ఞానానికి నిధియైనట్టి ఈ అత్యద్భుత ఉపనిషద్ గ్రంథాన్ని మన బాలబాలికలు ముహుర్ముహుః పఠింతురు గాక! ఉపనిషత్తులకు జయము! ఉపనిషద్ ద్రష్టలకు జయము! ఉపనిషద్ ద్రష్టల ఆశీస్సులు మన ఎల్లరపై నుండుగాక!

ఓం తత్ సత్.





# ఈశావాస్య ఉపనిషత్తు

## లేక

# వాజసనేయి సంహితోపనిషత్తు

## శాంతి మంత్రః



ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ।

టీక: —

ఓం = ఓంకారము, పూర్ణం = పూర్ణము, అనంతము, అదః = అదంతయూ, పూర్ణం = పూర్ణము, ఇదం = ఇదంతయూ, పూర్ణాత్ = పూర్ణము నుండి, పూర్ణం = పూర్ణము, ఉదచ్యతే = ఉద్భవించెను, పూర్ణస్య = పూర్ణమునుండి, పూర్ణం = పూర్ణమును, ఆదాయ = తీసివేయగ, పూర్ణం = పూర్ణము, ఏవ = మాత్రమే, అవశిష్యతే = శేషించును.

**భావము :**

అదంతయు పూర్ణము. ఇదంతయు పూర్ణము. పూర్ణము నుండి పూర్ణము ఉదయించెను. పూర్ణము నుండి పూర్ణమును తీసివైచినచో పూర్ణమే మిగులును.

**వివరణము :**

**ఓం** : పరబ్రహ్మము అన్నింటికంటె సర్వోత్కృష్టమైనది. పరబ్రహ్మమునకు పేరు 'ఓం'. అందువల్ల 'ఓం' ఆరాధనీయము. సర్వమూ ఓంకారమే. 'ఓం' బ్రహ్మమునకు ప్రతీక. అది శక్తివచనము (Word of power). అది పవిత్రమైన ఏకాక్షరం. అది వేదాల సారం. అది సంసార సాగరాన్ని దాటడానికి సురక్షితమైన నౌక.

**ఓంకారం** సర్వమంత్రాలలో శ్రేష్ఠమైనది. అది ప్రణవం. అది ప్రత్యక్షంగా మోక్షాన్ని ప్రసాదిస్తుంది. అన్ని మంత్రాలు ఓంకారంతో మొదలిడుతాయి. ప్రతి స్తవం ఓంతో ప్రారంభమౌతుంది. ఉపనిషత్తు ఓంతో మొదలిడుతుంది. గాయత్రి ఓంతో ప్రారంభిస్తుంది. దేవతల

కల్పించే ఆహుతులన్నింటికి ముందు ఓంకారం చేర్చబడు తుంది. ఓం వైభవాన్ని ఎవరూ పర్యాప్తంగా వర్ణించలేరు.

ఎక్కడ వాక్కు అంతా ఆగిపోతుందో, ఎక్కడ అన్ని సంకల్పాలు నిలిచిపోతాయో, ఎక్కడ బుద్ధి, తదితర అంగాల పనులు నిలిచిపోతాయో ఆ నెలవే ఓం. సర్వవేదాలచే స్తుతింపబడేది, సర్వశాస్త్రాలచే చాటి చెప్పబడేది, బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించే జిజ్ఞాసువుల ఈప్సిత గమ్యం ఓం. ఓంకారం వాస్తవంలో సర్వోత్కృష్టమైనది. అది అత్యుత్తమమైన ఆలంబనము. అది పరమ సత్యము. ఓం ను తెలిసికొన్నవాడు బ్రహ్మలోకంలో ఆరాధింపబడుతాడు. తాను కోరినదెల్లా అతడు పొందుతాడు.

"ఓంకారమే ధనుస్సు. మనస్సే బాణము. బ్రహ్మమే లక్ష్యము. పరిశుద్ధమైన ఏకాగ్రతగల మనస్సుతో బ్రహ్మమును ధ్యానింపుము, ఏవిధంగా బాణము లక్ష్యంతో ఏకమౌతుందో అలాగే నీవు బ్రహ్మముతో ఏకమౌతావు."

"ఈ ఏకాక్షరాన్ని (ఓం ను) ఒక్కదాన్ని తెలుసుకో. నీవు పరమోత్కృష్టమైన జ్ఞానాన్ని పొందుతావు."

ఓంకార ఉచ్చారణ, ప్రణవ జపము, ప్రణవగానము, ప్రణవ ధ్యానము మనస్సును నిర్మలంచేసి, విక్షేపాన్ని తొలగించి, అజ్ఞానపు తెరను నాశనమొనర్చి, బ్రహ్మములో లీనమగుటకు జిజ్ఞాసువులకు తోడ్పడుతుంది. ఓం, లేక ప్రణవము, లేక ఓంకారము బ్రహ్మమునకు ఏకైక ప్రతీక.

రోగ కారణం తొలగింపబడినపుడు రోగి ఏ విధంగా మరల స్వాస్థ్యం పొందుతాడో అదే విధంగా అజ్ఞాన జనిత మిథ్యా ద్వైతము (ఆత్మజ్ఞానంవల్ల) నాశమైనపుడు జీవాత్మ తన సహజ దివ్యవైభవాన్ని, అనగా పరమాత్మతో తాదాత్మ్యాన్ని పొందుతాడు.

పవిత్రమైనట్టి ఏకాక్షరమైన ఓం ఒక్కటే పరమాత్మకు పేరు. బ్రహ్మమునకు పేరు లేదు. కానీ, ఈ వ్యావహారిక ప్రపంచంలో జిజ్ఞాసువులకు బోధ సల్పేటప్పుడు ఒక పేరు ఆవశ్యకమౌతుంది. పరబ్రహ్మముకూడ ఒక నామం ద్వారానే సాక్షాత్కారం కాబడుతుంది. వ్యక్తికిగాని, వస్తువునకుగాని నామం ఒక ప్రతీక అని చెప్పాలి. ఒక వ్యక్తియొక్క పేరుగాని, ఒక వస్తువుయొక్క పేరుగాని ఆ పేరు ఏ వ్యక్తిదో, లేక ఏ వస్తువుదో ఆ వ్యక్తిని, లేక ఆ వస్తువును సూచిస్తుంది. 'బుద్ధుడు', 'రాముడు' అనే పదాలు ఒక కాలంలో నివసించిన వ్యక్తులపేర్లు. ఈ పదాలు ఆ వ్యక్తుల ప్రతీకలు. ఒక వ్యక్తియొక్క, లేక ఒక వస్తువుయొక్క చిత్తరువుగూడ ఆ వ్యక్తిని, లేక ఆ వస్తువును సూచించు ప్రతీకయే. వ్యక్తియొక్క పేరు చాలా కాలం స్మరింపబడుతుంది. ఈ నాటికీ గూడ మనం రాముని, శంకరుని, తదితర మహనీయుల పేర్లను స్మరిస్తాంటాం, వ్యక్తి చనిపోతాడు కాని నామం చాలా కాలం ఉంటుంది. అందు

వల్ల చిత్రరుప్రకంటె నామం ఎక్కువ వ్యాపకం గలదని తెలుసుకోవాలి.

ఓంకారమును గూర్చి సరియైన అవగాహన చాల ఆవశ్యకము. ఏలనంటే పవిత్రమైన ఏకాక్షర **ఓం** సర్వగత మైన, అమృతమగు, అఖండమగు, స్వయంప్రకాశకమగు, అవిక్రయమగు పరమాత్మను సూచిస్తుంది.

గతంలో ఉండినది, ప్రస్తుతం ఉన్నది, ఇక ముందు ఉండబోయేది — ఈ సర్వం వాస్తవంలో ఓంకారమే. ప్రతి వస్తువునకు ఒక పేరుంటుంది. పేరు, మరియు దానిచే సూచితమయ్యేటువంటి వస్తువు తాదాత్మ్యమే. అన్ని వస్తువులు తమ పేర్లనుండి వేరుకావు. శబ్దానికి, అర్థానికి మధ్యయుండే సంబంధం విడదీయ వీలుకానిది. నామరూపాలు సమవాయ సంబంధం గలవి. నామం శబ్దప్రతీక. నామ రూపాలనుండి సంకల్పాలను వేరుచేయడానికి వీలులేదు. బ్రహ్మము ఇలా సంకల్పించాడు; "ఏకోఽహం, బహుస్యామి." 'నేను ఏకంగా ఉన్నాను. బహుళమయ్యెద గాక' అని బ్రహ్మము అనుకొన్నాడు. అప్పుడు స్పందనం ఏర్పడింది. వెంటనే సృష్టి ప్రారంభమైంది. ఈ ఆది స్పందనం, లేక శబ్దప్రతీకయే **ఓం.** ఈ ఓంకారం సార్వజనీనమైంది. ఇది అన్ని శబ్దాలు తనలో గల్గిన శబ్దం. అన్ని శబ్దాలకు ఓంకారం ఆధారం కాబట్టి ఏ నామం కూడ ఓం నుండి వేరు కాదు అని చెప్పాలి. అందు

వల్ల ఇదంతయూ నిజముగా 'ఓం' అని చెప్పడం సరియైనదే. ఓం బ్రహ్మమునకు సరియైన ప్రతీక. ఓం ద్వారానే మనము బ్రహ్మమును సమీపించాలి. అగ్న్యుష్ణములు, పూవుతావులు ఏ విధంగా ఎడబాటులేనివో అదే విధంగా ఓం బ్రహ్మములు ఎడబాటులేనివి. బ్రహ్మజ్ఞానానికి ఓం ఒక సాధనం. ఓం సాధన ద్వారానే ఓం చే సూచింపబడు అమృతాత్మ సాక్షాత్కార మౌతుంది. ఓం అవగతమైతే బ్రహ్మముగూడ అవగతమౌతుంది. ఓంకారాన్ని గురించి మాండుక్యోప నిషత్తులో స్పష్టంగా, వివరంగా చెప్పబడినది. శ్రీ గౌడ పాదాచార్యులవారి కారికలు చాల ప్రబోధాత్మకంగా ఉంటాయి.

**పూర్ణమదః = పూర్ణం + అదః =** అదంతయు బ్రహ్మమే. అదః = అదంతయు, అగోచరమైన సకలము పరబ్రహ్మమే. అనగా పరమేశ్వరుని పరాప్రకృతియంతయు పరబ్రహ్మమే. ఈ శ్రేష్ఠమైన ప్రకృతిచే జగత్తు ధరింపబడి యున్నది. సమస్త జగత్తుయొక్క పుట్టుకకు, నాశనమునకు సర్వజ్ఞుడైన ఈశ్వరుడు తన ప్రకృతుల ద్వారా జగత్కార ణుడై యున్నాడు. అట్లుండుటవలన ఆ పరమేశ్వరునకంటె గొప్పదగు వేరొక కారణాంతరము ఏదియు ఉండదు.

**పూర్ణమిదం = పూర్ణం + ఇదం =** ఇదంతయు పరబ్రహ్మమే. ఇదం = ఇదంతయు. ఈ సగోచర సర్వస్వము

పరబ్రహ్మమే. పరమేశ్వరుని అపర ప్రకృతి యంతయు పర బ్రహ్మమే. అష్ట విధ ప్రకృతి (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము) అంతయు పరబ్రహ్మమే.

**పూర్ణాత్ పూర్ణం ఉదచ్యతే**= పూర్ణమునుండి పూర్ణము పుట్టెను. అనగా పరబ్రహ్మమునుండి కార్యబ్రహ్మము ఉదయించెను.

ఈశ్వరుడు కారణ బ్రహ్మము. హిరణ్యగర్భుడు కార్యబ్రహ్మము. ఈశ్వరునినుండి కార్యబ్రహ్మము ఉదయించెను. హిరణ్యగర్భుడు పూలమాలలోని దారము వలె భూతకోటిని వ్యాపించియుండును గాన అతడు 'సూత్రాత్మ' యనియు పిలువబడుచున్నాడు.

కార్యము దాని కారణాన్నుండి వేరుగా ఉండజాలదు, ఘటము దాని ఉపాదాన కారణమైన మృత్తికనుండి వేరుగా వుండజాలదు. అదే విధంగా ఈ విశ్వం, దాని ఉపాదాన కారణమైన బ్రహ్మమునుండి వేరుగా ఉండజాలదు. విశ్వానికి స్వతంత్రమైన ఉనుకువ లేదు. అది బ్రహ్మముతో ఒకటి ఔతుంది. ఉండేది బ్రహ్మమొక్కటే. ఈ ప్రపంచం కేవలం ఒక దృశ్యం. ఆత్మజ్ఞానం కలిగినప్పుడు ఈ ప్రపంచం అదృశ్యమౌతుంది. దీపం తీసుకవచ్చి నిజమైన త్రాటిని చూచి

నప్పుడు సర్పం అదృశమౌతుంది గదా! అలాగే, ఆత్మ జ్ఞానోదయంతో ప్రపంచం మాయ మౌతుంది.

ఈ శాంతిమంత్రంలో విశ్వము, బ్రహ్మము — వీని ఏకత్వం సుమంజులంగా వర్ణింపబడింది.

**పూర్ణస్య పూర్ణం ఆదాయ పూర్ణం ఏవ అవశిష్యతే –** పూర్ణమునుండి పూర్ణమును తీసివైచినచో పూర్ణమే మిగులును. అనగా పరబ్రహ్మమునందు విశ్వము లీనమైనపుడు పరబ్రహ్మమే శేషించును.

ఈ ప్రపంచం అజ్ఞాన జనితం. అది కేవల భ్రాంతి. అది కల్పిత దృశ్యం. పరబ్రహ్మమే ఏకైక సత్యం. పరబ్రహ్మమే (పూర్ణమే) ఈ దృశ్యముల కన్నిటికీ ఆధారం, అధిష్ఠానం.

ఈ శాంతి మంత్రములో బ్రహ్మము, విశ్వముల తాదాత్మ్యము అద్భుతంగా వర్ణింపబడింది. ఈ శాంతిమంత్రం సర్వోపనిషత్తుల సారం.



# ఒకటవ మంత్రము



ఓం ఈశావాస్యమిదం సర్వం
యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుంజీథా
మా గృధః కస్య స్విద్ధనమ్॥

టీక:—

ఓం = ఓంకారము, ప్రణవము; ఈశా = భగవంతునిచే; వాస్యం = కప్పబడియున్నది, వాసితమైయున్నది; ఇదం = ఇది; సర్వం = అంతయు; యత్కించ = ఏదియైనను; జగత్యాం = ఈ ప్రపంచమున; జగత్ = కదలుచున్నట్టి; తేన త్యక్తేన = అటువంటి త్యాగముచే; భుంజీథా = అనుభవింపుము; మా గృధః = లోభపడకుము; కస్య = ఎవనియొక్క, స్విత్ ధనం = ధనమును.

**భావము:—**

ఇదంతయు (జంగమ స్థావరాత్మకమైన సకల భూత ప్రపంచము) పరమేశ్వరునిచే పరివ్యాప్తమై యున్నది. అద్దానిని (నామ రూపములను) త్యజించి (బ్రహ్మానందమును) అనుభవింపుము. ఎవని ధనమునకై లోభపడకుము.

**వివరణము :**

ఈశావాస్యమిదం సర్వం:- ఈ సమస్తము ఈశ్వరునిచే పరివ్యాప్తమై యున్నది. 'ఈష్టే' (అనగా పరిపాలించు) అను ధాతువునుండి

'ఈశ' శబ్దం వచ్చింది, ఈశ్వరుడు సర్వ జగత్తును పాలిస్తాడు, అతడు పరమేశ్వరుడు. అతడు సర్వలోక పాలకుడు, అతడు సర్వోత్కృష్టమైన జగతీపతి.

వాస్యం = వసింపబడు, ఇదం సర్వం = ఇదంతయు, ఈ సమస్తము. ఈ సచరాచర ప్రపంచమంతయు, సకల లోకములు పరాత్పరునిచే పరివ్యాప్తమై యున్నవి. పరమేశ్వరుడు సర్వగతుడు. అతడు లేని చోటు లేదు. "ఉండేది నేను ఒకడనే. ఇదంతయు సర్వుల అంతరాత్మ" అను భావనతో బ్రహ్మమును సాక్షాత్కరించుకొని ఈ మిథ్యాప్రపంచ భావనను తొలగించుకొనవలయునని శ్రీ శంకరులవారు వివరిస్తారు.

"Isavasya upanishad is a beautiful upanishad. The very first line of the first mantra 'ఈశావాస్య మిదం సర్వం'. "This whole world is covered by the Lord"! induces a thrilling inspiration in the minds of the readers. Meditation on this one idea alone will lead one to the attainment of knowledge of the Self. He, who contemplates on the significance of the first line will become a Seer of one ness, a knower of the Self. He will have a direct vision of the Reality and inner illumination. The upanishad, though apparently simple and intelligible, is in reality one of the most difficult to understand properly."

— *Swami Sivananda.*

"ఈశావాస్య ఉపనిషత్తు ఒక అందమైన ఉపనిషత్తు. మొదటి మంత్రముయొక్క మొదటిపాదం. 'ఈశావాస్య మిదం సర్వం'

'ఈ యావత్ప్రపంచము పరమేశ్వరునిచే ఆవృతమైయున్నది' ''పరిశీల మనస్సులలో పులకాంకితమైన ఈశ్వర ప్రేరిత జ్ఞానాన్ని కలుగజేస్తుంది. ఈ ఒక్క అభిప్రాయాన్ని ధ్యానించుట మాత్రం చేతనే ఆత్మజ్ఞాన ప్రాప్తికి దారి చూపబడుతాడు, మొదటి పాద మంత్రార్థాన్ని ధ్యానించు నతడు ఏకత్వ ద్రష్ట, ఆత్మవిదుడు ఔతాడు. అతనికి ప్రత్యక్షమైన సత్యసందర్శనము. అంతర్జ్ఞానము గలుగుతుంది. ఈశోపనిషత్తు సరళమైనదిగ, సులభగ్రాహ్యముగ పైకి కనబడినప్పటికి, వాస్తవములో దానిని సరిగా అర్థము చేసుకొనుట చాల కష్టము అనుటలో సందియము లేదు.''

— స్వామి శివానంద.

యత్కించ జగత్యాం జగత్ = ఈ విశ్వమున కదలుచున్నది ఏదైనను, జంగము పదార్థములన్నిటియందు భగవానుడున్నాడు. ఆలాగే స్థావరపదార్థము లన్నిటిలో భగవానుడున్నాడు. ఈ ప్రపంచం నామ, రూప. క్రియ, గుణములతో కూడినది. అజ్ఞానంవల్ల, అవిద్యవల్ల ఈ ప్రపంచాన్ని ఈశ్వరునిపై ఆరోపించాము. విశ్వాన్ని విశ్వేశునిపై పరమాత్మపై అధ్యారోపించాము. అందువల్ల ద్వైత భావన కలిగింది. అందువల్ల కర్తభోక్తలు, జ్ఞాతజ్ఞేయములు. ద్రష్టదృశ్యాలు, కర్త కర్మలు ఇత్యాదులు ఏర్పడ్డాయి. ఆత్మను పరమాత్మగ. పరబ్రహ్మముగ ధ్యానించువాడు తప్పక ఏషణత్రయాన్ని పరిత్యజిస్తాడు. పుత్రేషణ, విత్తేషణ, లోకైషణ — వీటిని విడిచిపెడ్తాడు. ఏషణత్రయ త్యాగంచేసి, అతడు బ్రహ్మానందాన్ని అనుభవింప గలుగుతాడు.

ఈశోపనిషత్తు రెండు మార్గములను సూచిస్తుంది. అది సన్న్యాసులకు త్యాగపథాన్ని, లేక జ్ఞానయోగాన్ని సూచిస్తుంది. ఈ ప్రపంచాన్ని వదలిపెట్టలేనివారికి అది కర్మమార్గాన్ని. లేక కర్మయోగాన్ని సూచిస్తుంది, మొదటి మంత్రంలో జ్ఞాన నిష్ఠ తెలుపబడింది, బ్రహ్మజ్ఞాన ప్రాప్తికోసం యత్నించే

వారికోసం ఇది చెప్పబడింది. ఇది సంన్యాసులయొక్క నివృత్తి మార్గము, లేక సంన్యాస పథము.

**తేన త్యక్తేన భుంజీథా** = అటువంటి త్యాగము వలన అనుభవింపుము. 'త్యక్తేన' అనే దాన్ని శ్రీ శంకరులవారు నామవాచకంగా తీసుకొంటారు. **తేన త్యక్తేన త్యాగేనేత్యర్థః.** 'త్యక్తేన' అనగా త్యాగము.

**'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైక అమృతత్వ మానశుః'** ఆత్మ సాక్షాత్కారము కర్మలవలనను. సంతానమువలనను, సౌభాగ్యమువలనను లభ్యము కాదు. త్యాగమొక్కటియే దానికి మార్గము. ఈశోపనిషత్తుయొక్క ప్రథమ మంత్రం నివృత్తి మార్గావలంబకులకు జ్ఞాన మార్గాన్ని ఉపదేశిస్తుంది. అది వారికిలా సందేశానిస్తుంది; "జ్ఞాన యోగ అన్వేషీ, ఇహలోక వాంఛలను త్యజించు. పరలోక వాంఛలను విడిచిపెట్టు. అహంకారాన్ని. స్వార్థాన్ని. దేహాధ్యాసను విసర్జించు. మోక్షవాంఛను కూడ వదలిపెట్టు. త్యాగాభిమానాన్ని కూడ సంన్యసించు. అప్పుడు నీవు 'అది' అవుతావు. నీవు ఆత్మ ఔతావు. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి.' బ్రహ్మమును తెలిసికొన్నవాడు బ్రహ్మము అవుతాడు. మోక్ష వాంఛ ఇహలోక వాంఛల నన్నింటిని నిర్మూలిస్తుంది. నీవు మోక్షవాంఛను కూడ త్యజించాలి. ఎందువల్లనంటే ఆత్మసాక్షాత్కారం త్యాగంవల్ల మాత్రమే పొందబడుతుంది.

భుంజీథా = అనుభవింపుము. ఇటువంటి మహత్తరత్యాగము వల్ల అనుభవించుము, బ్రహ్మానందాన్ని అనుభవించు. బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొంది, జీవిత గమ్యాన్ని సాధించు."

**మా గృధః కస్య స్విత్ ధనం** = ఎవ్వని ధనంకోసం లోభపడకు. పరుల ఆస్తుల కోసం ప్రాకులాడకు. ఈ ప్రపంచం మిథ్య. అందలి వస్తువులు పనికిమాలినవి. కాబట్టి ఇతరుల ధనం కోసం అక్రమంగా ఆశ

నడడంవల్ల ఏమి ప్రయోజనం? ధనంచేత అమృతత్వం పొందలేము. 'త్యాగేనైక అమృతత్వమానశుః'. త్యాగమువలననే అమృతత్వము పొందబడును.

అమృతత్వస్య నాశాఽస్తి
విత్తేనేత్యేవ హి శ్రుతిః
బ్రవీతి కర్మణో ముక్తేః
అహేతుత్వం స్ఫుటం యతః.

'విత్తముచే అమృతత్వము లభించునను ఆశకూడ లేదు' అని శ్రుతి వాక్యము, ముక్తికి కర్మ హేతువు గాదని స్పష్టముగ చెప్పుచున్నది. అందువల్ల ధనంవల్ల అమృతత్వపు ఆశ లేదు. కాబట్టి పరుల ధనం కోసం లోభం మాను. ఆత్మ సాక్షాత్కారం వల్ల పరమోత్కృష్టమైన, అవ్యయమైన, ఆత్మధనం ప్రాప్తిస్తుంది.

'స్విత్' Is a particle which has no meaning. స్విదిత్యనర్థకో నిపాతః. 'స్విత్' అనే నిపాతమునకు అర్థం లేదు.

ఆత్మైవేదం సర్వమితీశ్వరభావనయా సర్వం త్యక్తమత ఆత్మన ఏవేదం సర్వమాత్మైవ చ సర్వమతో మిథ్యావిషయాం గృధిం మా కార్షీరిత్యర్థః.

ఇదంతయు వాస్తవములో ఆత్మయే. ఈ ప్రకారమగు ఈశ్వరభావనతో ఈ యావత్తును పరిత్యక్తము చేయనగును. ఏలన: ఈ సమస్తము ఆత్మనుండియే ఉత్పన్నమైనది. మరియు, సర్వము ఆత్మరూపమే యగు కారణము వలనను మిథ్యాపదార్థ విషయకమగు ఆకాంక్షను మానవలెనని అర్థము.

'వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః'
ఈ సర్వము అందర హృదయాంతర్వాసియైన వాసుదేవుడని ప్రజ్ఞాపూర్వకముగ తెలిసిన మహాత్ములు కడు దుర్లభులు. 'ఈశావాస్యమిదం సర్వం' ఈ సర్వం ఈశునిచే ఆచ్ఛాదన మొనర్పబడియున్నది అని ప్రత్యక్షానుభవం గల వాని స్థితిని పొందడం చాల దుష్కరమైన విషయం. భగవానుడు గీతలో ఇలా అంటారు.

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః.

అనేక జన్మల అనంతరము జ్ఞానవంతుడు, ఇదంతయు వాసుదేవుడు (అంతరాత్మ) అని తెలిసికొని. నాకడకు అరుదెంచును. ఇటువంటి మహాత్ముడు దొరకుట కడుదుర్లభము,

వాసుదేవుడు సర్వగత బ్రహ్మము. జిజ్ఞాసువు అనేక జన్మలలో తాను గావించిన యోగాభ్యాసములు. స్వార్థ రహిత సేవ, భక్తి, నిరంతర ధ్యానముల ద్వారా క్రమేణ అభ్యుదయమునొంది, కట్టకడపట సర్వభూతాంతరాత్మను పడయును. అతడు సర్వము వాసుదేవుడని తెలిసికొనును. సిద్ధిని పడసినటువంటి మహాత్ముని కనుగొనుట కడు దుర్లభము. ఆతనితో ఎవ్వరు సాటిరారు. అక్కారణముచేతనే భగవంతు డిట్లు నుడివెను:

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్ యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

జన్మాంతర పుణ్య విశేషముచే వేలాది మనుజులలో ఎవడో ఒకడు తత్త్వసిద్ధికై యత్నించును. ఇట్లు ప్రయత్నించి సిద్ధులైన వారియందు నన్ను (పరమేశ్వరుని) యథార్థముగ తెలిసికొనువాడెవడో ఒకడుండును.

కావున బ్రహ్మజ్ఞానమును పడయుట ఎంతకష్టమో తెలియనగును. కాని గుణశీలుడు. శ్రద్ధాళువు. దృఢనిశ్చయుడు. సువ్రతుడు. సాధన చతుష్టయ సంపన్నుడునైన జిజ్ఞాసువు ఆత్మజ్ఞానమును సులభముగ పడయగలడు.

యోగవాసిష్ఠంలో జీవన్ముక్తుని స్వభావం ఇలా వర్ణింపబడియున్నది: "తనపైకి విడువబడిన శర పరంపరా వర్షాన్ని జీవన్ముక్తుడు కలువ పూల వృష్టిగా భావిస్తాడు, ప్రజ్వలిస్తూండే పడక అతనికి పన్నీరు చల్లిన హంస తూలికా తల్పం లాగా కానవస్తుంది. అతని శిరస్సును ఖండించి వేస్తే అది ఆ మహాత్మునకు ఆనందమయ స్వప్నరహిత నిద్రగ తోస్తుంది. అతని ఉదరమును చీల్చివేస్తే అది అతనికి దేహాద్యంతం సుగంధాన్ని పూసినట్లుగ ఉంటుంది. వాడియైనటువంటి అనేక బల్లెములతో అతని వక్షంలో పొడిస్తే అది అతనికి దీర్ఘ గ్రీష్మంలో ఘోణాన్నుండి వెలువడిన శీతల సలిలం లాగా ఉంటుంది."

పైన పేర్కొనబడిన జీవన్ముక్తుని లక్షణాలను బట్టి చూస్తే జీవన్ముక్తుని స్థితిని పడయడం ఎంతకష్టమో తెలియగలదు. శాస్త్రజ్ఞానం, మితిలేనిధనం, వేలకొలది అనుచరులు, అనుక్షణం ఒక కృత్రిమ శీవి, కపట వినయం — ఇవి మానవుని జీవన్ముక్తుని గావింపజాలదు.

మొదటి మంత్రములో సర్వత్ర భగవద్దర్శనం కలిగియుండవలెనని ఉపదేశింపబడింది, ఆత్మనిష్ఠకు త్యాగమొక్కటియే అధికారంగా నిర్ణయింపబడింది. ఈ ప్రథమ మంత్రం సంన్యాసులకు జ్ఞానమార్గాన్ని సూచిస్తుంది, ఆత్మవిదుడు పుత్రాది ఏషణాత్రయమును విడిచిపెట్టి, జ్ఞాననిష్ఠలో నిమగ్నుడై, తన ఆత్మను రక్షించుకొననగును. ఇది వేద సమ్మతము. ఇక, ఇతరులకు. అనగా అనాత్మజ్ఞులగు పురుషులకు, ఆత్మతత్త్వమును వారు గ్రహించుటకు అసమర్థులైన కారణమున, రెండవ మంత్రమున ఉపదేశము సలుపబడినది.



# రెండవ మంత్రము

కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషేచ్ఛతం సమాః।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి
న కర్మ లిప్యతే నరే॥

**టీక :—**

కుర్వన్నేవ = తప్పక చేయుచు; ఇహ = ఈ ప్రపంచమున; కర్మాణి = వేదోక్తమైన అగ్నిహోత్రాది కర్మలను; జిజీవిషేత్ = జీవించుటకై కోరుకొనవలెను; శతం సమాః = వంద ఏండ్లు; ఏవం = ఈ విధముగ; త్వయి = నీలో, నీవుండగా; న = కాదు; అన్యథా = మరొక విధముగ; ఇతః = పైగా; అస్తి = ఉన్నది; న = లేదు; కర్మ = పని; లిప్యతే = మరకపరచు, నరే = నరునిలో.

**భావము:—**

మానవుడు ఈ ప్రపంచమున కర్మలను ఆచరించుచు నూరు సంవత్సరములు మనుటకు ఆసపడవలెను. ఈ విధముగ కోరుకొనుట నీకు సముచితము గాని, అన్యథా గాదు. (నిష్కామ్యబుద్ధితో కర్మ లొనరించిన) ఆ నరుని కర్మలు బంధింపవు.

**వివరణము:—**

ప్రథమ మంత్రము జ్ఞాన యోగ అభ్యాసమునకు నియమము ప్రతిపాదించినది. ఈ మంత్రమున కర్మయోగ అభ్యాస నియమము తెలుపబడింది. ప్రాపంచిక కర్మలనుండి విముక్తులు కాజాలని వారికి ఈ మంత్రం ఉపదేశాన్నిస్తుంది. సంన్యాసం తీసుకోలేని మానవులకు కర్మ నిష్ఠ నిర్దేశింపబడింది.

సంన్యాసము (కర్మత్యాగము), కర్మయోగము (కర్మాచరణ) — ఈ రెండు పరమానంద ప్రాప్తికి, లేక మోక్షానికి దారి చూపుతాయి. ఈ రెండు కూడ మోక్షానికి గొంపోవునట్టివే అయినప్పటికీ, మోక్ష సాధన ముంగు ఈ రెంటిలో ఆత్మజ్ఞాన విరహితమైన కేవల కర్మ సన్యాసాని కంటె కర్మయోగమే శ్రేష్ఠతరమైయున్నది. కాని, ఆత్మజ్ఞానముతో గూడిన కర్మ సంన్యాసము నిశ్చయముగ కర్మయోగము కంటె గొప్పదే. కర్మయోగము సులభమైనది, ఆ కారణంచేత అందరకు సరిపోతుంది.

సోమరితనం వల్లనో, అజ్ఞానం చేతనో, కుటుంబ కలహ కారణంగానో, విపత్తు నిమిత్తంగానో, లేక నిరుద్యోగ సమస్య వలననో ఊరక కర్మలను వదలిపెట్టడం మూలంగా మానవుడు సంన్యాసి కాడు. నిజమైన సంన్యాసి పిరికిపంద, కపటాచారి కాడు. కేవల కాషాయపురంగు వస్త్రధారణ చేత మానవుడు సన్యాసి కాజాలడు. వాంఛనీయం ఏంటంటే విశుద్ధ హృదయం. నిజమైన అహంకార త్యాగం, సంకల్ప సంన్యాసం. వస్తువులయొక్క భౌతిక త్యాగం నిజమైన సంన్యాసం కాదు,

నిజమైన కర్మయోగి దుఃఖాన్నిగాని దుఃఖాన్ని యిచ్చే వస్తువులనుగాని ద్వేషించడు, అతడు సుఖాన్నిగాని, సుఖాన్ని యిచ్చే వస్తువులనుగాని ఆశించడు. ఏ ఇంద్రియ విషయముల పట్ల అతనికి రాగం గాని, ద్వేషంగాని లేదు, అతడు శీతోష్ణాలను, సుఖ దుఃఖాలను, జయాపజయాలను, గెలుపు ఓటములను, లాభనష్టాలను, నిందాస్తుతులను, మానావమానములను సరకు గొనడు, అతడు ఎల్లవేళల కర్మలో నిమగ్నుడై యున్నప్పటికి అతనిని నిత్య సంన్యాసి (**Perpetual Sannyasin**) అనిపిలవాలి,

భగవద్గీత యొక్క కేంద్ర బోధన ఏమటి ? ప్రపంచంలో, ప్రపంచం ద్వారా ఆత్మసాక్షాత్కారాన్ని పడయడమే శ్రీమద్భగవద్గీత యొక్క కేంద్ర బోధన. ఇదే విషయాన్ని వసిష్ఠులవారు శ్రీరామునకు ఉపదేశిస్తారు, భగ

వంతుని వ్యక్తస్వరూపమైన మానవాళిని సేవించడం, అనేక కార్యాచరణాల మధ్య ఈ ప్రపంచంలో నివసించడం — ఇవి ఏకాంతంగా ఒక గుహలో నివసించడాని కంటె ఎన్నో రెట్లు శ్రేష్ఠమైనది. ప్రపంచంలో నివసిస్తూ ప్రపంచంద్వారా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందినవాడు వాస్తవంలో నిజమైన వీరోత్తముడు.

కర్మ యోగ ఆవశ్యకత ఏంటో విచారిద్దాం. నదు లెప్పుడూ సర్వ ప్రాణికోటికి పరిశుద్ధమైన, మంచి త్రాగే నీటిని ఇస్తాయి. చెట్లు మనకు నీడను, ఫలాలను యిస్తాయి. సూర్యుడు మనకు వేడిని వెలుతురును, శక్తిని ప్రసాదిస్తాడు. భూమి మనకు కాయగూరల్ని, కాయధాన్యాలను ఇస్తుంది. పుష్పాలు సౌందర్యాన్ని ప్రసాదిస్తాయి. ఆవులు సుపోషకమైన దుగ్ధాన్ని ఇస్తాయి. మానవుడు తప్ప తక్కిన అన్ని వస్తువులు ఎంతో ఆత్మ త్యాగాన్ని చేస్తాయి. మానవుడొక్కడే అత్యంత స్వార్థపరుడు.

అన్ని దుర్గుణాలకు స్వార్థమే మూలం. స్వార్థగుణం అజ్ఞాన జనితం. స్వార్థపరుడు పరమలోభిగ ఉంటాడు. అతడు అధర్మపరుడుగా ఉంటాడు. అతడు దేవునకు చాల దూరంలో ఉంటాడు. తన లక్ష్యాలను పొందేందుకు అతడు ఏ పనినైనా చేస్తాడు. అతడు ఇతరులను హింసిస్తాడు. వారి ఆస్తులను అతడు దొంగలిస్తాడు. తన స్వార్థపరత్వాన్ని సంతృప్తిపరచే కోసం అతడు అనేక పాపకృత్యాల్ని చేస్తాడు. వానికి అంతఃకరణంగాని, సచ్ఛీలం గాని ఉండవు. మనశ్శాంతి అంటే ఏమిటో వానికి తెలియదు. డబ్బును, అధికారాన్ని, పేర్ను, ప్రఖ్యాతిని ఆర్జించే కోసం అతడు అనవరతం ఎత్తుగడలు వేస్తూ, పన్నాగాలు పన్నుతూ ఉంటాడు. అతడు ఎల్లప్పుడు ఇతరుల నుండి తాను వేరని అనుకొంటాడు. భార్య, బిడ్డల, భాగ్యముల కోసం అతనికుండే ఆసక్తికి మితం లేదు. సంగం, వేర్పాటు భావన — ఈ రెండు అతనిలో అపరిమితంగా చూడగలం. స్వార్థం యోగానికి ఒక గొప్ప ప్రతి

బంధకం. స్వార్థరహిత సేవ, ఈవి, సత్సంగం — వీటిద్వారా స్వార్థాన్ని నిర్మూలించ గలుగుతాం.

స్వార్థ బుద్ధివల్ల మనం సంకుచితమనస్కులమైనాము, మన హృదయం చిన్నదైయింది, మన హృదయం ఆకుంచనమైంది. సేవించడం వల్ల, నిస్వార్థంగా ఇతరులకు తోడ్పడడం వల్ల మన హృదయం వ్యాకోచిస్తుంది, మనం భగవంతునితో, బ్రహ్మముతో ఏకమౌతాము. అందు వల్ల మనం సేవలో ఉల్లాసాన్ని చూపాలి.

అనేకమంది చాల ఏండ్లు గంగాతీరములో తమ జీవనాన్ని గడుపు తారు, వారు జపం చేస్తారు, కీర్తన సలుపుతారు, వేదాంత గ్రంథాల్ని పఠిస్తారు, వారు తరచు 'అహం బ్రహ్మాస్మి' అంటూంటారు, కాని వారి కేమైన సాక్షాత్కారం సిద్ధించిందా? లేదు, వారు కొన్ని ఏండ్లకు ముందు ఏ స్థితిలో ఉంటూంటినారో ఇప్పుడుకూడ అదే స్థితిలో ఉన్నారు. ఎందువల్ల? వారికి విశాల హృదయం లేదు కాబట్టి, వారికి చిత్త విశాలత లేదు కాబట్టి, వారికి ఉదార హృదయం లేదు, సత్యాన్వేషకునకు ఉండాల్సిన ప్రధాన సుగుణం చిత్త విశాలత, నిర్విరామమైన స్వార్థరహితసేవ, దాన కృత్యాలు, మానవ సేవ, అయత్నకృత నిర్నిరోధ దానశీలము త్వరలో చిత్తవిశాలతను కలుగజేస్తాయి. మనకు సర్వాశ్లేషకరమైన ప్రేమ లేకపోతే. మనం మన కున్నవాని ఇతరులతో పంచుకోకపోతే మనకు పరమేశ్వరుని సాక్షాత్కారం ఎలా సిద్ధిస్తుంది.

మానవుడు ఈ ప్రపంచ పౌరుడే గాదు. అతనికి అనేక ప్రపం చాల పౌరసత్వం ఉంది: అతడు ఈ ప్రపంచంలోని ప్రమాదాల్ని, ప్రలోభాల్ని ఎదుర్కోవాలి, అంతేగాదు. అతడు ఇతర లోకాల్లో గూడ ప్రమాదాల్ని, ప్రలోభాల్ని ఎదుర్కోవలసి ఉంది. గంధర్వలోకం ప్రలోభాల మయమై వుంది. మూలాధార చక్రంలో నిద్రిస్తూన్న మహత్తరమైన కుండ

లిసీ శక్తిని మేల్కొల్పడానికి ప్రయత్నించేముందు జిజ్ఞాసువు తన్నుతాను శుద్ధిచేసికొని, ఇంద్రియాల్ని నిగ్రహించి. తన కోరికలను నిర్మూలించి, యమ నియమాభ్యాసంలో సుప్రతిష్ఠితుడు కావాలి. ఆసనాలు, బంధాలు, ముద్రలు, ప్రాణాయామం అభ్యసించి అంతశ్శుద్ధి పొందకుండ అశుద్ధుగాని కుండలినిని మేల్కొల్పితే అతడు ఇతర లోకాల ప్రలోభాల్ని ఎదుర్కోవలసివస్తుంది. ఈ ప్రలోభాలను నిగ్రహించే మనోబలం అతనికి ఉండదు. అతడు అధోపతనం చెందుతాడు. యోగనిశ్శ్రేణిని మరల అధిరోహించి, తాను ఎచ్చటినుండి చ్యుతుడైనాడో ఆ స్థానాన్ని చేరుకోవడం బహు కష్టమైన పని. అందువల్ల జిజ్ఞాసువు మొట్ట మొదట్లో తన్ను తాను పరిశుద్ధపరచుకోవడానికి ప్రయత్నించాలి. జపం, కీర్తన, నిర్విరామ నిష్కామ సేవ — వీటి ద్వారా చిత్త విశాలత, చిత్తశుద్ధి చేకూరిందంటే కుండలిని తనంతట తానే మేల్కొంటుంది. ఆ శక్తి సహస్రారము వైపునకు చలిస్తుంది. అచ్చట పరమశివునితో కలుస్తుంది.

జీవిత గమ్యాన్ని చేరుకోవడానికి మొదటి సోపానం నిష్కామ్య కర్మ. అనగా స్వార్థ రహితంగా చేసే స్వధర్మాచరణ. నిష్కామ్య కర్మాభ్యాసం హృదయాన్ని శుద్ధి పరస్తుంది, వేర్పాటు భావాన్ని వినాశం చేస్తుంది' చిత్తశుద్ధి కల్గిన మీదట ఉపాసనకు పూనుకొని, చిత్తాన్ని నిశ్చలపరచి, భగవదనుగ్రహం పొందాలి. అంత్యంలో వేదాంతం మనకు అజ్ఞానపు తెరను నాశమొనర్చడంలో తోడ్పడుతుంది; కైవల్య మోక్ష ప్రాప్తికి సహాయపడుతుంది.

సేవ చేయడంలో ఉద్దేశ్యమేమిటి? పేద ప్రజలను బాధిత మానవకోటిని మనం ఎందుకు సేవిస్తాం? సంఘాన్ని దేశాన్ని మనం ఎందుకు సేవిస్తాం? సేవ చేయడం వల్ల మనం మన హృదయాన్ని శుద్ధి చేసుకొంటాం. అహంకారం, ద్వేషం, మాత్సర్యం. ఉత్కృష్టతా భావన —

ఇవి అదృశ్యమౌతాయి. వినయం శుద్ధమైన ప్రేమ, అనుకంప, సహనం, కరుణ — ఇవి వృద్ధినొందుతాయి. వేర్పాటుభావన నాశమౌతుంది, స్వార్థపరత్వం విధ్వంసమౌతుంది. మనకు విశాల దృక్పథం ఏర్పడు తుంది. జీవన ఏకత్వ భావన పొందడం ప్రారంభమౌతుంది, మనకు ఉదార ఆశయాలతోగూడ విశాల హృదయం ఏర్పడుతుంది, క్రమేణ మనకు ఆత్మజ్ఞానం కలుగుతుంది, అన్నిటిలోని ఏకత్వాన్ని, ఏకత్వంలో ఉండే అన్నిటిని మనం తెలుసుకొంటాం, మనకు అపరిమితానందం కలుగు తుంది. సంఘం అంటే ఏమిటి? వ్యక్తుల కలయిక. ఈ ప్రపంచం పర మేశ్వరుని వ్యక్తస్వరూపం, మానవ సేవ మాధవ సేవయే, నర సేవ హరి సేవయే. సేవయే ఆరాధనము. మనం ఈ భావంతో సేవ చేయాలి, అప్పుడు మనకు సత్వర సాక్షాత్కారం, హృదయనైర్మల్యం కలుగుతుంది.

హృదయ పారిశుద్ధ్యం, చిత్తశుద్ధి లేనివాడు బ్రహ్మాండమైన వేద పండితుడైనప్పటికి ఈ ప్రపంచానికి ఆలంబనమైనట్టి, సర్వగతుడైనట్టి, స్వయంప్రకాశకుడైనట్టి సర్వ హృదయాంతర్వ్యాపియైనట్టి పరమాత్మను అవగతము చేసుకోజాలడు.

కర్మయోగంలో రకాలను పరిశీలిద్దాం, తాను నారాయణుని, అవగా స్వాత్మను సేవిస్తున్నాను అనలు కర్మయోగి భావాన్ని అలవరచుకొన్నట్లైతే వెద్యుడు సులువుగ భగవత్సాక్షాత్కారాన్ని పడయగలడు.

సరియైన మనోభావంతో దానం చేసి, అదానకృత్యాల ద్వారా భగ వత్సాక్షాత్కారం పడయవచ్చు. పేదలకు, రోగులకు, నిస్సహాయులకు, దిక్కు మాలినవారికి దానం చేయాలి. అనాథలకు, వికలాంగులకు, గ్రుడ్డివారికి, నిస్సహాయులకు, వితంతువులకు దానం చేయాలి, సాధువులకు, సన్న్యాసులకు మతసంస్థలకు, సాంఘికసంస్థలకు దానంచేయాలి. సేవించడానికి, దానం చేసేటందుకు అవకాశమిచ్చిన మానవునకు మనం కృతజ్ఞతాభివందనాలు తెలు పాలి. సరియైన భావంతో దానం చేసే మహనీయులకు జోహార్లు.

అర్థం చేసుకోగలిగిన హృదయాన్ని (Understading heart) అలవరచుకోవాలి. ఆధ్యాత్మిక మార్గంలో మనచిట్టి తమ్ముళ్ళకు మనంసాయ పడాలి. వారి మార్గంలో వెలుగును వెదజల్లి వారిని ఉద్ధరించాలి. వాళ్ళనుంచి మనం సిద్ధిని ఎదురుచూడకూడదు. వారియెడ దయగలిగి యుండాలి. వారికి మనం సాయపడడం వల్ల మనం వృద్ధికి వస్తాం.

యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మ శుద్ధయే' హృదయ పారిశుద్ధ్యం కోసం, దివ్యజ్యోతిని పడయుట కోసం యోగులు సంగాన్ని విడనాడి, కర్మలుచేస్తారు. గీతా బోధనల ప్రకారం కర్మలను ఆచ రించే యోగులు వాస్తవంలో అరుదైన ఆధ్యాత్మిక కుసుమాలు.

ఆధ్యాత్మిక రంగంలో సంఖ్య ప్రధానమైనదిగాదు. శంకరుడు ఒక్కడు. అతడు అద్వైతవేదాంతాన్ని స్థాపించాడు. ఈ ప్రపంచములో పిశాచనాథునకు (Satan) అనుచరులు అధిక సంఖ్యాకులు. అందువల్ల పిశాచాగ్రణి యొక్కమతం శ్రేష్ఠమైనదని అనుమానింపగలమా? ఆర్జవమతు లైన కొలదిమంది కర్మయోగులు చాలును. వారొక స్వామ్యము (Asset) వారి సహాయముతో గొప్ప అద్భుత కార్యములను చేయవచ్చు. అందువల్ల సంఖ్య తక్కువను నెపము పనికిరాదు. ప్రేమతో, సేవద్వారా అందరి హృద యాల్లలోకి చొచ్చుకొని పోయేది నేర్చుకోవాలి. ఇది గొప్పయోగం.

ఇకకర్మయోగాభ్యాసాన్ని గురించి సంగ్రహంగా తెలుసుకొందాం.

సేవయే ఆరాధనము. కర్మయే నారాయణ పూజనము, కర్మయేధ్యానం ఈ విషయాన్నిమరువరాదు, సేవ ధ్యానముల సమన్వయ అభ్యాసంద్వారా మనం ఆధ్యాత్మికాభ్యుదయం పొందాలి. సరియైన భావంతో సేవచేయబడి నప్పుడు పాకీపనిగూడ యోగమే ఔతుంది, ఈప్రపంచం అంతా ఒక కుటుం బంగా (వసుధైక కుటుంబకం) భావించాలి. అప్పుడు మనం కనులుమూసు కొని, గదిలో ఒక మూలకూర్చుండ నవసరములేదు,

సాక్షిభావంతో, అకర్తృత్వభావంతో, ఫలాపేక్షరహితముగ చేయబడిన కర్మలు అసలుకర్మయేగాదు. అది జ్ఞానాగ్నిలో దగ్ధమైంది. అదిమానవుని సంసారానికి బంధింపజాలదు, శ్రీశంకరులవారు సకామ కర్మలను చేయరాదని నొక్కిచెప్పారు. కాని ఈనాటి చాలామంది శిష్టాచార మాయావాదులు శ్రీశంకరులవారిని అపార్థం చేసుకొన్నారు.

స్వార్థరహిత సేవయే విత్తనము. నారాయణభావమే మూలము,(సర్వ ప్రాణులు పరమేశ్వరుని వ్యక్తస్వరూపములు. నేను సకలజీవులందలి పరమేశ్వరుని సేవించుచున్నాను. ఇదియే నారాయణ భావము,) ఉత్సాహమే వర్షధార, చిత్తవిశాలతయే పుష్పము. హృదయ పారిశుద్ధ్యమే ఫలము. ఇది కర్మయోగ పథము.

మానవ హస్తాలతో నిర్మితమైన దేవళాలల్లో దేవుడు నివసింపడు, కాని, ప్రేమభావముగల నరుని హృదయంలో, నారీ హృదంతరాళంలో భగవంతుడు నివసిస్తాడు. మానవహృదయమే పరమేశ్వరుని ప్రశస్తాలయము.

అహంకారపూరితమైనటువంటి మన స్వల్పవ్యక్తిత్వాన్ని మరచిపోవాలి. మన స్వకీయ అభిరుచులను, వాంఛలను, కోర్కెలను మరచి, జీవితానంతటిని ఆశ్లేషించాలి. ఇతరులకోసం పనిచేయాలి, అన్నివిధముల్తైన అల్పబుద్ధిని వదలి పెట్టాలి. ఉదారులం కావాలి. అప్పుడే మనం మెల్లమెల్లగా మన ఆత్మ తత్త్వాన్ని తెలిసికోగల్గుతాం.

కేవలం శుద్ధమైనబంగారంతో మనం ఆభరణాలు చేయలేం. మూడు శాతం రాగిని కలిపితే మనం ఆభరణాలు చేయవచ్చు. అలాగే ఈశ్వరుడు మూడుశాతం రజస్సుతో వ్యక్తమై, ఈ విశ్వంలో పనిచేస్తాడు. అందువల్ల అతనిలో మార్పుఉండదు. ప్రజల్లో తొంబై ఏడు శాతము రజస్సు, మూడు శాతము సత్త్వము ఉండి, వారు ప్రపంచములో కర్మలొనరించినచో వారు కలుషితులౌతారు. లోక సంక్షేమం కోసం పనిచేయదలచిన వారు అధికమైన

సత్త్వసంపన్నులుగ ఉండాలి. అప్పుడే వారు ప్రపంచసంపర్కంతో కలుషితులుకారు. అప్పుడు వారు ప్రజలను ఉద్ధరించగలుగుతారు.

ఆసక్తిలేకుండ కర్మలొనరించాలి. కర్తృత్వభావం లేకుండ కర్మలు చేయాలి. భగవంతుని కోసం కర్మలుచేయాలి. 'నేను చేసేపనుల వల్ల దేవుడు సంప్రీతుడు కావాలి' అనే భావాన్నికూడ వదలి పెట్టాలి. ఎప్పుడైనా సరే, ఆ కర్మఎంత మనకు ఇష్టమైనదైనప్పటికీ, ఆ పని మనకు ఎంతఉత్సాహకరంగా ఉన్నప్పటికి దాన్ని వదలిపెట్టడానికి ఎప్పుడూ సంసిద్ధులమైయుండాలి. అంతర్వాణి మనల్ని కర్మలను త్యజించవలసినదిగా ఆజ్ఞాపించినప్పుడు దాన్ని మనం వెంటనే నిశ్చింతగా వదలి పెట్టాలి, ఏ కర్మకు గాని సంగం ఉండరాదు. సంగం మనల్ని కర్మకు బంధిస్తుంది, కర్మయోగానికి సంబంధించిన ఈ సూక్ష్మ రహస్యములన్నింటిని బాగా తెలుసుకోవాలి. పిమ్మట కర్మమార్గంలో ధైర్యంగా పురోగమించవచ్చు.

మనం మనపై ఆధారపడాలి. దేన్నంటే దాన్ని నమ్మకూడదు, పిడివాదంలో నమ్మకం ఉంచకూడదు. శుద్ధ అంతఃకరణవాణిని ఆలకించాలి. మన స్వాతంత్ర్యాన్ని అమ్ముకోకూడదు. మనం అమృతాత్మ. నికృష్టతాభావాన్ని నిర్మూలించాలి. అంతరంగాన్నుండి శక్తి, ధైర్యం, బలం పొందాలి. ముక్తులం కావాలి. గ్రుడ్డి నమ్మకం వదలాలి, దేన్నికూడ కార్యకారణ సంబంధం చూచిన మీదటనే స్వీకరించాలి. ఏదో గ్రుడ్డిఉద్వేగాలతో ఉప్పొంగిపోయి మోసపోరాదు. వాటిని నిగ్రహించాలి. వ్యాకోచించాలి. మనలో అనంతమైన శక్తి, జ్ఞానం ఉన్నాయి, దాన్ని వెలిగించాలి. అప్పుడు మనకు ఆత్మరహస్యం బాగా ప్రదర్శమౌతుంది. ఆత్మజ్ఞానదీపంతో అజ్ఞాన తిమిరం తొలగిపోతుంది. జ్ఞానకవాటాలను తెరవడానికి అద్భుతమైన కీలకం నిరంతరధ్యానం, ఇదికర్మ యోగ సారం, వేదాంత సారం, అమృత మధువును గ్రోలి, అమృతత్వాన్ని, నిత్యానందాన్ని, శాశ్వతసుఖాన్ని పొందు

ఒమే జీవితగమ్యం, ఇది జీవితపరమార్థం, ధ్యేయం, కర్మయోగం, ఉపాసన. ఇవి ఈ పరమగమ్యాన్ని పొందడానికి మనల్ని ఆయత్తులను చేస్తాయి.

జిజీవిషేత్ శతం సమాః: 'సమాః' అనగా సంవత్సరములు 'శతం సమాః' అనగా నూరుఏండ్లు. 'జిజీవిషేత్' అనగా జీవింప కోరుకొన వలెను. కలియుగములో మానవుని దీర్ఘాయువు నూరేండ్లు. అతడు నూరేండ్లు ఎడతెగక కర్మలు ఆచరిస్తూ జీవించడానికి కోరికపడాలి. మరొకరీతిగా బ్రతి కేందుకు కోరుకోరాదు.

ఏవం త్వయి న అన్యథా ఇతః అస్తిః మరొకరీతిగా జీవించు టకు ఆసపడరాదు. అనగా మానవుడు కర్మలనువిడనాడి, సోమరిబ్రతుకుకు అలవాటుపడరాదు. ప్రతి దినము వేదోక్తకర్మలను, క్రతువులను ఆచరింప వలెను. పైగా, అతడు ఆత్మభావముతో మానవకోటికి నిర్విరామముగ నిస్స్వార్థ ముగ నిష్కామసేవచేయాలి. అటువంటి స్వార్థరహిత సేవవలన అతనికి హృదయశుద్ధి కలుగుతుంది. 'యోగులు ఆత్మశుద్ధి కొఱకు సంగమును వదలి కర్మలొనరింతురు' చిత్తశుద్ధి కలిగిన పిదపనే అతనికి ఆత్మజ్ఞానము కలుగును.

న కర్మ లిప్యతే నరే: అనరుని కర్మఅంటజాలదు. ఫలాపేక్ష రహితముగ కర్మల నిష్కామ్యబుద్ధితో ఆచరించుటవలన ఆ కర్మలు అతనిని బంధింపజాలవు. "యోగః కర్మసు కౌశలం" కర్మలొనరించుటయందు కౌశలమును యోగమందురు. (Yoga is skill in action) ఇది కర్మ యోగము, ఇది ప్రవృత్తి మార్గము.

ఈ ప్రపంచంలో సంగంలేకుండ జీవించాలి. ఉపమాతను (Ayah) దృష్టాంతంగా తీసుకొందాం. దాది శిశువుకు శుశ్రూష చేస్తుంది, దాన్ని లాలి స్తుంది, బిడ్డతోనే ఇరువది నాలుగు గంటలు గడుపుతుంది. కాని ఎడబాటు సమయం వచ్చినపుడు, ఉద్యోగాన్ని విడిచివేయవలసి వచ్చినపుడు ఆమె ఎడ బాటు వలన ఏవిధమైన మనోవికారాన్ని పొందదు. అలాగే గోపాలుడు ప్రతి దినం ఆవులను మేపే పొలానికి తీసుక వెడుతాడు. సాయంకాలం ఆ ఆవుల్ని

యజమానికి అప్పజెప్పుతాడు. ఇంతకంటే ఏమీలేదు. నోటి రోగంతో, కాలి వ్యాధితో పది ఆవులు చచ్చిపోయినప్పటికి అతనిలో ఏ మనోవికారం కలుగదు.

ఆవు పొలంలో మేసేటప్పుడు ఎల్లప్పుడూ తన దూడనే అనుకొంటూంటుంది. అలాగే మనం ఈ ప్రపంచంలో పనిచేయాలి. వివిధ రకాల జీవిత విధ్యుక్త ధర్మాలను నెరవేరుస్తూ అదే సమయంలో ఈశ్వరుని కూడ స్మరిస్తూండాలి. మనస్సును మాధవునకు, కరములను కర్మకు ఇవ్వాలి. అప్పుడు మనం ముక్తులం కాగలం. జనన మరణ విమోచనం పొంది, పరమానందాన్ని పొందుతాం. దీనికి సందేహములేదు.

మొదటి మంత్రంలో సంన్యాసులకు జ్ఞాననిష్ఠ చెప్పబడింది. రెండవ మంత్రంలో జ్ఞాననిష్ఠకు అశక్తులైనవారికి కర్మనిష్ఠ చెప్పబడింది. శ్రీ శంకరులవారు జ్ఞాన కర్మ సముచ్చయాన్ని ఖండిస్తారు.

మొదటి మంత్రంలో 'ఈశావాస్య మిదం సర్వం' 'తేన త్యక్తేన భుంజీథాః' 'మా గృధః కస్య స్విద్ధనం' — ఈ విధంగా సంన్యాసులకు ఉపదేశం చేయబడింది.

రెండవ మంత్రంలో 'యో హి జిజీవిషేత్ స కర్మ కుర్వన్' అని కర్మిష్ఠులకు ఉపదేశం చేయబడింది. రెండు యోగములయొక్క ఫల భేదములు తెలుపబడినవి. ఈ రెండు మార్గములు సృష్టి ఆరంభమునుండి పరంపరా గతముగ వచ్చుచున్నవి. మొదటిది ప్రవృత్తి మార్గము. రెండవది నివృత్తి పథము. నివృత్తి మార్గంలో ఏషణాత్రయాన్ని త్యాగం చేయాలి. ఈ రెండు మార్గాలలో సంన్యాస పథమే అతిశయించునని తైత్తరీయ శ్రుతిలో ప్రవచితమైనది. 'న్యాస ఏవాత్య రేచయత్' మరియు వ్యాసభగవానుడు తన పుత్రున కిట్లు ఉపదేశించును.

> ద్వావిమావథ పంథానౌ
> యత్ర వేదాః ప్రతిష్ఠితాః
> ప్రవృత్తిలక్షణో ధర్మో
> నివృత్తిశ్చ విభావితః



# మూడవ మంత్రము

అసుర్యా నామ తే లోకా
అంధేన తమసాఽఽవృతాః
తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి
యే కే చ ఆత్మహనో జనాః

**టీక :—**

అసుర్యా = దేవతారహితమైన, అసూర్య = సూర్యుడులేని, నామ = నామములో, తే = ఆ, లోకాః = ప్రపంచములు, అంధేన = గ్రుడ్డి, తమసా = తిమిరముచే, ఆవృతాః = కప్పబడియున్నవి, తాన్ = ఈ లోకములకు, తే = వారు, ప్రేత్య = దేహమునువీడి, అభిగచ్ఛంతి = పోవుదురు, పొందుదురు, యేకేచ = ఎవరైతే, ఆత్మహనః = ఆత్మఘాతకులు, జనాః = ప్రజలు.

**భావము :—**

అజ్ఞానాంధకారముతో ఆచ్ఛాదితమైన ఆ లోకములు సూర్యుడు లేనివి. ఆత్మఘాతకులు తమ దేహములను వదలిన యనంతరము ఈ దేవతారహిత లోకములకు పోయెదరు.

**వివరణము :—**

యం యం వాపి స్మరన్ భావం
త్యజత్యంతే కలేబరం
తం తమేవైతి కౌంతేయ
సదా తద్భావభావితః ॥గీతా

ఓం కౌంతేయ, ఎవడెవడు దేనిని తలచుచు, అంతమున దేహమును వీడునో, అతడు ఆ విషయము యొక్క నిరంతర భావనవలన, ఆ విషయమునే చేరుకొనును.

కడపటి సంకల్పములు తరువాతి జన్మను నిర్ధారణచేయును. మరణ సమయమున జీవితములోని ప్రధాన సంకల్పము మనస్సును ఆక్రమిస్తుంది. మరణసమయము నందలి ప్రధాన సంకల్పం, సాధారణ జీవితం మానవుని ప్రముఖ సంకల్పం ఒకటే ఔతుంది. కడపటి తలపు రాబోయే, లేక మరుసటి జన్మలోని దేహస్వభావాన్ని నిర్ణయిస్తుంది. 'యత్ భావం తద్ భవతి'. మానవుడు ఏవిధంగా భావిస్తాడో ఆవిధంగా ఔతాడు.

ఆత్మహానులు ఎవరు? తమ ఆత్మను చంపుకొనువారు ఆత్మహానులు. వీరిని గురించి కొంచెం తెలుసుకోవడం మంచిది, వారు గీతను దూషిస్తారు. ఉపనిషత్తులను చులకనగ చూస్తారు. శ్రీహరిని నిందిస్తారు. సాధువులను, సన్న్యాసులను ఎందుకు సేవించాలని ప్రశ్నిస్తారు. సమదృష్టిగాని, తుల్యమానసంగ గాని వారికి ఉండదు. వారికి ఆత్మదృష్టి గాని, బ్రహ్మజ్ఞానం గాని ఉండదు. వారికి విశాల హృదయం లేదు. దానం చెయ్యరు. ఆత్మఅనేది లేదంటారు. వారికి దేహమే ఆత్మ. వారి ఆత్మకు మరణం ఉంది. వారి బ్రతుకుకు ఒక ఉద్దేశ్యం లేదు. పరమార్థ దివ్య స్వభావాన్ని వారు విస్మరిస్తారు. తినడం, త్రాగడం, తందనాలాడడం — ఇవే వారి జీవిత గమ్యం. వారు జూదమాడుతారు. పేకాటలో అంతా కాలాన్ని గడిపేస్తారు. విడువకుండ నవలలు చదువుతారు. వారు తప్పత్రాగుతారు. వారు పేరు ప్రతిష్ఠలు కోల్పోవుతారు. వారు గొలుసు పొగ పీల్చడంలో సిద్ధహస్తులు. ముచ్చటలాడడం, ఇతరులలో లేనిపోని తప్పులు పట్టడం వారి సహజ స్వభావం. వారు పరులను నిందిస్తారు. గోడ చాటున ఇతరులను వారు దూషిస్తారు. మంచివారి పేరును చెరుస్తారు. కొండెములాడుతారు. ఇతరులను గురించి

ఎంతసేపైనా చెడు మాటాడుతారు. వారు వంచకులు, బూటకము చేయడంలో బహునిపుణులు. వారు అన్యాయంగా ధనాన్ని ఆర్జిస్తారు. పరస్త్రీలను మానభంగం చేయడం అంటే వారికి చాలాసంతోషం. వారు హింసాత్మకులు. ఇంద్రియ సుఖనిరత జీవితం గడుపుతారు. వీర్యాన్ని దుర్వ్యయం చేస్తారు. బ్రహ్మచర్యం అంటే వారికి గర్భశత్రువు. వారి దృష్టి కామపూరితం. వారు ఎటువంటి సాధన చేయరు. సాధకులను నిందిస్తారు. వేదనింద చేస్తారు. రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలను తృణీకరిస్తారు. వారు ఆత్మను విస్మరించి, ఆత్మవైభవాన్ని మరచి, దేహాన్ని ఆత్మఅనుకొని, దేహాన్ని ఆరాధిస్తారు. వీరికి భగవానుడు పదునారవ అధ్యాయం ప్రత్యేకంగా కేటాయించాడు.

అసుర స్వభావం గల వారికి విశ్వాసం ఉండదు. వారి ప్రతిసిద్ధాంతాన్ని ఆక్షేపిస్తారు. వారు భగవంతుణ్ణి లేదంటారు. వారు సంసారచక్రాన్ని, వేదాల్ని నీతి సూత్రాల్ని లేదంటారు. ఇంద్రియ భోగలాలసత్వమే వారి గమ్యం. వారు ప్రజల ఆస్తులను కొల్లగొట్టి, పొరుగువారి భార్యలను ఎత్తుకొని పోతారు. వారు ప్రజల్ని నిర్దాక్షిణ్యంగా చంపివేస్తారు. వారికి పరలోకంలో గాని, పునర్జన్మ సిద్ధాంతంలో గాని నమ్మకం లేదు. వారికి సదాచారమంటే, శుచిత్వం అంటే, ఆత్మ సంయమం అంటే ఏంటో తెలియదు. ఈ కలియుగంలో అసురులు కోకొల్లలుగా ఉంటూన్నారు. అశుభ వాసనలతో కూడియుంటే, వారు విశ్వ విద్యాలయార్హతలు, బిరుదము లున్నప్పటికీ, వారు అసురులే.

ఆసుర గుణాల్ని మనం అర్థం చేసుకొంటే మనం వాటిని మాన వచ్చు. అసురులు అసత్యమాడుతారు, వారు అధర్మపరులు, వారు అశుచి మంతులు. జీవిత గమ్యాన్ని పడయడానికి ఏ కర్మలు ఆచరించాలో వారికి తెలియదు. అశుభాన్నుండి ముక్తిపొందేందుకు ఏ పనులనుండి దూరం కావాలో కూడ వారికి తెలియదు. ఈ ప్రపంచానికి ఎటువంటి ఆలంబనం

గాని, అధిష్ఠానం గాని లేదని వారంటారు. వారిని చార్వాకానుచరులు అన వచ్చు. ఈ ప్రపంచానికి ఆధారమైన బ్రహ్మములో వారికి విశ్వాసం లేదు. ఈ ప్రపంచంలో ఈశ్వరుడున్నాడని కూడ వారు ఒప్పుకోరు. వారు ఇలా అంటారు. "మనం అసత్యం, అందువల్ల ఈ ప్రపంచం కూడ అసత్యమే. సత్యాన్ని ప్రబోధించే శాస్త్రాలు కూడ అబద్ధమే. ఈ విశ్వానికి కామం తప్ప మరొకటి ఏది కారణమై యుండగలదు? సర్వజీవరాశులకు ఏకైక కారణం లైంగిక కామమే. కర్మ సిద్ధాంతం అనేటటువంటిది లేదు. కామ ప్రేరణా ప్రాబల్యం వల్ల స్త్రీ పురుష పరస్పర సంయోగం వల్లనే ఈ మొత్తం ప్రపంచం జనించింది. పుణ్యమనేది లేదు, పాప మనేదిలేదు, పుణ్యపాపాల ననుసరించి జీవుల కర్మఫలాలను పంచిపెట్టే ఈశ్వరుడు లేనే లేడు. ఈ ప్రపంచానికి మూలం, ఆధారం ధర్మధర్మాలు కావు. ఈ విశ్వానికి మూలా ధారం లైంగిక వాంఛయే ఈ ప్రపంచం ఒక అదృష్టలోకం.''

ఈ వ్యక్తులకు అంతరాలోకనా సామర్థ్యంలేదు. వారికి ప్రకృతిని గురించి గాని, పురుషోత్తముని గూర్చిగాని తెలియదు. వారు ఇతరులను దోచు కొంటారు, ఇతరులను నాశం చేసి ధనం ఆర్జిస్తారు. తమ దుష్కృత్యాలను గురించి గర్వంగా చెప్పుకొంటారు. వారు స్వల్పమైన ఇంద్రియ భోగాలను (తినడం, త్రాగడం, తందనాలాడడం) గురించి ఆలోచిస్తూంటారు, డబ్బును స్త్రీలను పొందడం కోసం వారు ఎటువంటి నీచమైన పనినైనా చేస్తారు వారు గందరగోళం చేసి, ప్రపంచశాంతిని, సౌహార్ద్రాన్ని భంగపరుస్తారు. వారు జగత్ శత్రువులు. ఈ ఆత్మహనులు క్రూరమైన పాపపు పనులు చేస్తారు. వారు దర్పపూరితులు, మదించినవారు, గర్విష్టులు. వారు తమ పనులను బడాయికొట్టుకొంటారు. ఇతరులను అసూయతో చూస్తారు. వారు తమ దేహాలను ఆరాధిస్తారు. వారు మూఢులు, అవివేకులు, మొండిపట్టుగల వారు. అందువల్ల వారికి స్థిరమైన నిశ్చయ బుద్ధి ఉండదు. వారు అశుచి

ప్రతులు. 'నేను ఫలానా మంత్రాన్ని జపించి ఫలానా మనిషిని చంపేస్తాను. నేను ఫలానా మంత్రాన్ని జపించి ఫలానా స్త్రీని పట్టుకొంటాను.' ఇలాంటి అశుభ నిశ్చయాలు చేస్తారు వారు. అసంఖ్యేయములైన ఇంద్రియ విషయాల్ని ఆర్జించి, వానిని క్షుద్రపరముకానే యత్నంలో వారి మనస్సులు ఎల్లప్పుడూ నిమగ్నమైయుంటాయి. ఇంద్రియ భోగమే సర్వస్వమని వారి దృఢ నమ్మకం. ఇంద్రియ భోగం వారికి పొంద దగిన ఉత్తమోత్తమ విషయం. వారు ఇంద్రియ భోగాల కోసం ధనాన్ని కూడబెట్టుతారు. ఏవో ధర్మకార్యాలు చేయడాని కోసం డబ్బును కూడబెట్టరు. వారికి కావలసినంత డబ్బు ఉన్నప్పటికి వారి కోరికలు తృప్తిచెందవు. ఆ కోరికలు పెరుగుతూనే ఉంటాయి. ఈ జనులు లోభానికి ఎఱ ఔతారు. వారి తలలు గర్వంతో వాచి యుంటాయి. ప్రపంచంలోని ఆస్తినంతా నేను సంపాదించ గలుగుతాను. నేను అప్పుడు కుబేరుణ్ణి ఔతాను. ఈ భూతలంలో నాసాటి వారు ఎవరుండ గలరు?' అని విర్రవీగుతారు. నన్ను సేవించని వారిని చంపేస్తాను. ఈ సృష్టికి నేనే ప్రభువును, నేను పట్టిందల్లా బంగారం, నాకు కావలసినంత భూస్థితి, పశు సంపద, ధనం ఉంది. నాకు కావలసినంతమంది పిల్లలు, పౌత్రులు ఉన్నారు. ఇంద్రుడు కూడ నాకు సాటి కాడు. నేను సామాన్యుణ్ణి కాను. నేను ఏవిధంగా చూచినా శక్తిమంతుణ్ణి, బలవంతుణ్ణి, ఆరోగ్యవంతుణ్ణి సుఖవంతుణ్ణి, అని ప్రగల్భాలు పలుకుతారు. 'కుబేరుడికి డబ్బుఉండవచ్చు కానీ అతన్ని నాతో పోల్చేందుకు వీల్లేదు. విష్ణువుకు కూడ నాకున్నంత శ్రీ లేదు, బ్రహ్మకూడ నావంశముతో పోలిస్తే హీన కులజుడే. ఈ ప్రపంచంలో నాతో సాటివాడు ఎవరు లేరు.' అని దర్పవచనాలు పలుకుతారు.

జ్వరం ఎక్కువైనపుడు రోగి కలవరింతల్లో ఏవేవో అసంబద్ధ వచనాలు పలికినట్లు ఈ అసురులు తమ కోరికలను గురించి, ఇంద్రియభోగాల్ని గురించి వదురుతారు. వారు అనేకపాపాలు చేసి, వైతరణివంటి ఘోర

నరకంలో పడుతారు. వారు మోహ పరివశులై, అనేక దుష్ట సంకల్పాలను పెట్టుకొని దిగ్భ్రమ నొందుతారు.

తామే గొప్పవారమని, ఇతరులు అల్పులని వారుభావిస్తారు. వారు యజ్ఞాలు చేసినట్లు నటిస్తారు. వారు ఏ శాస్త్ర నియమాలను పాటించరు, ధనం, విద్వత్తు వారి తలలను త్రిప్పివేస్తాయి. వారి దేహము వారికి అన్నింటికంటె ప్రియతరమైనది. కేవలం ఆ దేహం కోసమే వారు జీవిస్తారు. సత్యసంధులను, దానశీలురను. భగవద్భక్తులను వారు నిందిస్తారు, నీచంగా చూస్తారు. తమ ఆర్థిక ఆధిక్యతతో ఇతరులను కించపరచ యత్నిస్తారు. వారు దౌర్జన్య ప్రకృతిని చూపుతారు. వారు పొగరుతో ఎవరిని లెక్కచేయరు. వారు పెద్దల్నిగురువుల్ని మర్యాదతో చూడరు. దర్పపూరితులై వారు ధర్మపథానుండి వైదొలగుతారు, వారు భగవంతుని ద్వేషిస్తారు. వారు భగవంతునిఆజ్ఞలను ఉల్లంఘిస్తారు. వారు ఇతరులలో మంచి గుణాల్ని చూస్తే వారి హృదయాలు మండుతాయి. వారు మత్సరపూరితులు. వారు అసూయాపరులు. వారుఈర్ష్యాళువులు. భగవంతుడు వారిని మానవస్థితినుండి నికృష్టమైన జంతుస్థితికి తగ్గిస్తాడు. వారిని అసుర యోనులలోనికి పారవేస్తాడు, వారు పులులుగ. సింహాలుగ, తేళ్ళుగ, పాములుగ జన్మిస్తారు. వారు నికృష్టతమయోనుల బొందుతారు, ఆత్మను లెక్కచేయని వాడు, కామక్రోధలోభములకు బాగా వశపడినవాడు ఆత్మద్రోహి. వాడు ఆత్మహానుడు.

శుక్లమార్గం, కృష్ణమార్గం ప్రపంచంలో శాశ్వతమని భావింపబడు తూంది. ప్రకాశ పథంద్వారా పయనించినవాడు మరల తిరిగి రాడు, కృష్ణ మార్గం ద్వారా వెళ్ళిన యతడు తిరిగివస్తాడు. శుక్లమార్గము దేవయాన మార్గము, దీన్ని భక్తులు అనుసరిస్తారు, కృష్ణమార్గం పితృదేవతల మార్గం. ఫలాపేక్షతో యజ్ఞాలు, దానాలు చేసేవారు ఈ మార్గాన్ని అనుసరిస్తారు. ఈ

రెండూ ప్రపంచానికంతటికి వర్తించదు. ప్రకాశమార్గం భక్తులకుతెరచి యుంచ బడుతుంది. ఈమార్గాలు సంసారమెంత నిత్యమోఅంత నిత్యమైనవి, యోగులు ఈ రెండు మార్గాలను తెలుసుకొని (క్రమంగా) మోక్షానికిదారిచూపే దేవయాన మార్గంలో పయనిస్తారు.అతడు మోహితుడు కాడు. ఆత్మహనులు అంధకారంలో పడుతారు,

అసుర్యా నామ తే లోకాః = అవి వాస్తవముగ అసుర లోకములు 'అసూర్యా నామ తే లోకాః' అని పాఠ్యాంతరము గలదు. అనగా ఆ లోకములు సూర్యుడు లేని లోకములు. పరబ్రహ్మము స్థితి వర్ణనాతీతము. ఆత్మ తేజస్సు ఎదుట సూర్యుడు తిమిరముతో సమానమే. 'న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః' అచ్చట సూర్యుడు భాసింపడు. చంద్రుడు, నక్షత్రములు వెలుగొందవు. ఇక అగ్ని విషయము చెప్ప నేల? పరమాత్మతో పోల్చబడినపుడు దివ్య వైభవోపేతములైన దేవతా లోకాలు సైతము తిమర లోకములే యగును.

సకల ప్రాణులలో నరజన్మ మిక్కిలి దుర్లభము. దేవానుగ్రహము లేకుండ మనుష్యత్వము, మోక్షేచ్ఛ, మహాపురుషుల సాంగత్యము లభింప నేరవు. కష్ట సాధ్యమైన నరజన్మమును పొంది, ఎవడు తన మోక్షము కోసము యత్నింపడో అతడు మూఢబుద్ధి, ఆత్మఘాతకుడు, తుచ్ఛమును పరిగ్రహించి తనను తానే చంపుకొనుచున్నాడు. బహు కష్ట సాధ్యమగు మనుష్య దేహమును పడసి బంధ విమోచనమను స్వప్రయోజనార్థమై ఎవడు ప్రమత్తుడై యుండునో అతనికంటె మూఢుడెవడు? ఆత్మను సాక్షాత్కరించుకొనకుండ మరణించువాడు బహు దుర దృష్టవంతుడు. ఆత్మహనులు అను లోకములు గ్రుడ్డి చీకట్లచే కప్పబడియున్నవి.

అంధేన తమసాఽఽవృతాః = అజ్ఞాన అంధకారముచే కప్ప బడినవి. 'అంధేన తమసా', అనగా గ్రుడ్డి చీకటిచే, సూర్యుడు లేని ఆలోక ములు గ్రుడ్డి చీకట్లచే కప్పబడియున్నవి. గ్రుడ్డి చీకటి యనగా అజ్ఞానము ఆత్మ ప్రత్యక్షీకరణ మార్గమందు అజ్ఞానము అవరోధముగ నిలబడును.

అవిద్యలో రజస్సు, తమస్సులు అధికంగా ఉంటూన్నాయి. కాబట్టి దాన్ని మలిన సత్త్వం అంటారు, అవిద్య జీవుని పరావర్తన పరుస్తుంది. మాయ ఈశ్వరుని పరావర్తన పరుస్తుంది. మాయలో సత్త్వం అధికంగా ఉంటుంది కాబట్టి దాన్ని శుద్ధ సత్త్వం అంటారు. అవిద్యా ప్రాబల్యం వల్లనే మనకు ఈ అనుభవ ప్రపంచం కనబడుతూంది. ఈ అవిద్యా ప్రాబల్యం వల్లనే మనం సంసార మహోదధిలో మునిగియున్నాము. ఈ అవిద్యాశక్తి వల్లనే మనం మన దివ్య స్వభావాన్ని విస్మరిస్తూన్నాం, అవిద్య మనస్సు ద్వారా పనిచేస్తుంది. మనస్సు దేశ, కారణాల ద్వారా పనిచేస్తుంది. అవిద్య యనే మిథ్యాశక్తి కారణంగా భగవంతుడు లక్షల అంశాలుగా కనబడుతాడు, అవిద్య అజ్ఞానానికి, పాపానికి, దుఃఖానికి మూలకారణం. సుఖం, దుఃఖం, కోర్కె, కర్మ, రాగం, ద్వేషం, మోహం, మదం, కామం. క్రోధం, మాత్సర్యం, అహంకారం, త్రిశరీరాలు, పంచకోశాలు — ఇవన్నీ అవిద్యా ఫలితాలే. ఆ విద్యకు ఆదిలేదు. కానీ దానికి అంతం ఉంది. అది అనాది, సాంతం,

జ్ఞానం కలుగగానే అవిద్య అంతమొందుతుంది, చీకటిలో త్రాడు పాముగ కనబడిన చందమున, అవిద్య వలన బ్రహ్మము ప్రపంచంగా కన బడుతుంది. దీపం తెస్తే, పాము అదృశ్యమౌతుంది కాని త్రాడు అలాగే ఉంటుంది, అలాగే మనకు బ్రహ్మజ్ఞానోదయం అయినపుడు ప్రపంచం కన బడదం మాయమౌతుంది. అవిద్యయనేది మిథ్యాజ్ఞానం, అది అజ్ఞానం అజ్ఞానం కారణ శరీర నిర్మితం. కారణశరీరంలో నుంచే స్థూల,సూక్ష్మ శరీరాలువస్తాయి.

అవిద్యా స్వభావాన్ని ఎవరూ నిర్వచించలేరు. అది అనిర్వచనీయం. అది నిజంకాదు. ఎందువల్లనంటే ఆత్మజ్ఞానోదయం కాగానే అది అదృశ్య మౌతుంది.అది అసత్యంకాదు. ఎందువల్లనంటే మనం దాన్ని అనుభవిస్తున్నాం అది అభావం కాదు. ఎందువల్లనంటే అది ఆత్మజ్ఞానంచే నాశనం చెందుతుంది 'నేను బ్రాహ్మణుణ్ణి, నేను పండితుణ్ణి, నేనుగేస్తును, నేను అందగాడను, నేను చాల సన్నం, నేను వైద్యుణ్ణి,' అని ఇలా చెప్పేటట్టుచేసేది అవిద్యయే ఈ అవిద్య ఎలాగో వచ్చింది. దీని ఉద్గమ స్థానం, వివరణ మన అందు బాటులోలేవు. అవిద్య మనస్సు ద్వారా పనిచేయడం మనకు బాగా గోచరమే అవిద్య బ్రహ్మమునకు చెందినది కాదు, ఎందువల్లనంటే బ్రహ్మము శుద్ధ జ్ఞానస్వరూపం, సూర్యునిలో తిమిరం ఎలా ఉండగలదు? అవిద్య ఆత్మ ధర్మమే అయిఉంటే దాన్ని మనం ఎన్నటికీ తొలగించుకోలేము,

'కిం భ్రాంతి జ్ఞానం? యది భ్రాంతి కస్య? ఈ అవిద్య ఎక్కడ నుంచి వచ్చింది? ఎవరిది ఈ అవిద్య? అవిద్య ఎందుకు ఉండాలి? ఇటువంటి ప్రశ్నలతో మన గోర్థకాన్ని బ్రద్దలు చేసుకోవడం అనవసరం. ఈ సంసారాగ్నిని, ఈ తిమిర సాగరాన్ని తొలగించు కోవడానికి యత్నిం చాలి. ఇదే మన కర్తవ్యం. ఆత్మ జ్ఞానోదయం అయిన తరువాతనే ఈ భయంకరమైన అవిద్యను గూర్చి అవగతం కాగలదు. అమితమైన కడుపు నొప్పితో నీవు బాధపడుతూంటే నీ స్నేహితుడు మందుతీసుకొని వస్తే, 'నీవు ఈ మందు ఎక్కడనుంచి తెచ్చావు? దానిలో ఏయే మందు వస్తువు లున్నాయి? దాని వెల ఎంత? దాన్నిఎవరిచ్చారు? అని విచారిస్తావా?వెంటనే మందు పుచ్చుకొంటావా?

అజ్ఞానం (అవిద్య) తమోజనితం, అవిద్యతెరలాగా పనిచేస్తుంది. అది తన పరమార్థ సచ్చిదానంద బ్రహస్వరూపాన్ని తెలుసుకోకుండచేస్తుంది.

అవిద్య సందేహాల్ని కలుగజేస్తుంది. సత్యానికి పరస్పర విరుద్ధ విషయాన్ని సందర్శింపజేస్తుంది. మనస్సు అవిద్యోత్పత్తి. ఆత్మజ్ఞానం కలుగగానే త్రివిధ ములైన అవిద్య అదృశ్యమౌతుంది.

మనోనాశనమైతే అవిద్య యుండదు. అప్పుడు రాగద్వేషాల అట యుండదు. మిథ్యా సందర్శనం, అజ్ఞానం, సుఖం. దుఃఖం సంశయం. బంధం, మోహం, చింత ఇత్యాదులు ఆత్మయొక్క యథార్థ ధర్మాలైతే (వేడి అగ్నియొక్క ముఖ్య ధర్మమైనట్లుగ) వాటిని మనం ఎప్పటికి తొల గించుకోలేము, అసాధారణమైన ఇంద్రియాతీత దివ్యజ్ఞాన శోభితులైనవారు; మిథ్యా సందర్శనం సంశయం, భయం, మోహం, చింత మొదలగునవి లేనటువంటి శంకరుడు, దత్తాత్రేయుడు, జడభరతుడు, యాజ్ఞవల్క్యుడు మొదలగు జీవన్ముక్తులు ఉన్నారు. వారికి సంసార ప్రజ్ఞయే లేదు. వారెల్ల ప్పుడు బ్రహ్మ ప్రజ్ఞలోనే ఉండేవారు, అందువల్ల మనం ఆత్మ ముక్తమని, పరిపూర్ణమని, నిత్యమని నిర్ధారణ చేయవచ్చును, అవిధ్య మనస్సులో ఉంటుంది, అది ఆత్మలో లేదు,

మానవుని దుఃఖానికి మూలకారణం అవిద్య, అవిద్య యంటే అజ్ఞానం, అవిద్యవల్ల మనం ఆత్మను దేహంతో, భార్యాబిడ్డలతో, ఇంటితో. ఆస్తిపాస్తులతో తాదాత్మ్య పరచుకొంటాం. అవిద్యలోనుంచి అహంకారం వస్తుంది. అహంకారాన్ని అస్మితం అని కూడ అంటారు. అవిద్య అహం కారాలవల్ల మనం మన పరమార్థ స్వరూపాన్ని మరచాము.

తాగ్ంస్తే ప్రేత్య అభిగచ్ఛంతి = వారు దేహములను వీడి ఈ లోకములను పొందుదురు. వారు ఆత్మసంహారకులు. వారు మరణించిన పిదప తిమిర లోకములకు జనెదరు. రజోగుణము అభివృద్ధియైనపుడు మరణించినచో కర్మయందు ఆసక్తిగల మనుష్యులందు పుట్టును, అదేవిధంగా

తమస్సు అభివృద్ధియైనపుడు చనిపోయినవాడు మూఢ యోనులందు, పశ్వాది యోనులందు పుట్టును.

యే కే చ అత్మహనః జనాః = ఆత్మఘాతకులైనట్టి వారు, 'ఆత్మానం ఘ్నంతీత్యాత్మ హనః'. ఆత్మ సంహారకులు ఆత్మను దర్శింపజాలరు. అజ్ఞానపు తెరను లాగికొని, ఆత్మను మరుగు చేసుకొనుటచే వారు ఆత్మను దర్శింపజాలరు. వారు ఈ ప్రపంచమున మోహపరవశులై సంచరించుచు, నశ్వరమైన ఇంద్రియ వస్తువుల వెంట పరుగిడెదరు. కామ క్రోధ లోభములనెడి వలలో పడి వారు చేయని దుష్కృత్యము ఉండదు. వారి మానసములు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, అహం కార, అజ్ఞాన పూరితములు. జనన మరణము లనెడి సంసార చక్రమున వారు మాటిమాటికి తగుల్కొనుచుందురు. వారు దేహమును ఆత్మగ భావి స్తారు. వారు నశ్వరమైన దేహమును పూజిస్తారు. వారు దేహారాధకులు, అసురులు, వారు నిత్య శుద్ధ బుద్ధ ముక్త అమృత సచ్చిదానంద ఆత్మయొక్క దివ్యవైభవాన్ని బొత్తిగ విస్మరిస్తారు. కావున వారిని ఆత్మహనులు అంటూ న్నాము.

'యస్య ఆత్మనో హననాత్ అవిద్వాంసః సంసరంతి తద్విపర్యయేణ విద్వాంసో జనా ముచ్యంతే తే నాత్మహనః తత్ కీదృశం ఆత్మతత్త్వం ఇతి ఉచ్యతే.' ఆత్మను చంపుకొనేటటు వంటి అజ్ఞానులు జన్మమరణరూపమగు సంసారాన్ని పొందుతారు. ఆత్మను ధ్యానించే జ్ఞానులు, ఆత్మఘాతకులు కారు కాబట్టి, ముక్తులౌతారు. ఆ ఆత్మ తత్త్వ ఏలాంటిదో, ఆత్మ స్వభావం ఎటువంటిదో నాలుగవ మంత్రంలో తెలుపబడ్తుంది.



# నాలుగవ మంత్రము



**అనేజదేకం మనసో జవీయో**
**నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్శత్**
**తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్**
**తస్మిన్నపో మాతరిశ్వా దధాతి.**

**టీక :—**

**అనేజత్** (న+ఏజత్) = నిశ్చలమైన, **ఏకం** = ఏకము, ఒకటి, **మనసః** = మనస్సుకంటె, **జవీయః** = వేగతరము, **న** = లేదు, **ఏనత్** = ఇది, **దేవాః** = ఇంద్రియములు, **ఆప్నువన్** = చేరెను, **పూర్వం** = మునుపు ముందు, **అర్శత్** = పరుగెత్తెను, **తత్** = అది **ధావతః** = పరుగిడుచు, **అన్యాన్** = ఇతరములు, **అత్యేతి** = ముందుపోవును, **తిష్ఠత్** = ఉండుచు **తస్మిన్** = దానిలో, **అపః** = నీరములు. **మాతరిశ్వా** = వాయువు, **దధాతి** = ఉంచును.

**భావము :—**

ఆత్మ అచలము, అది ఏకము అది మనస్సుకంటె వేగముగలది. దేవతలు (ఇంద్రియములు) తమకు ముందు పరుగిడు దానిని పట్టుకొన లేక పోయిరి: అది కూర్చుండియు కూడ తన వెంబడి పరుగిడు వారికంటె వేగముగ పోవును. దాని వలన మాతరిశ్వుడు సకల ప్రాణుల యొక్క క్రియాకారితకు ఆలంబనమై యున్నాడు.

**వివరణము :—**

ఈ మంత్రములో ఆత్మ స్వభావం వర్ణితమైంది. న+ఏజత్ =

అనేజత్. 'ఏజృ' అను ధాతువునకు కంపించుట, కదలించుట, చలించుట, అని అర్థము, 'అనేజత్' అనగా ఆకులము చెందని. నిశ్చలమైన.

> అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయం
> అక్లేద్యోఽశోష్య ఏవ చ
> నిత్యః సర్వగతః స్థాణుః
> అచలోఽయం సనాతనః ॥గీతా॥

ఈ ఆత్మ ఛేదింపబడజాలదు, దహింపబడజాలదు, తడుపబడజాలదు శోషింపబడజాలదు, అది నిత్యమైనది, సర్వవ్యాపకమైనది, స్థిరమైనది, అచలమైనది, పూరాతనమైనది.

ఆత్మ అతి సూక్ష్మమైనది. అది వాక్కునకు, మనస్సునకు, అందుబాటులో లేదు, ఈ సూక్ష్మమగు ఆత్మను అర్థముచేసుకొనుట గహనమైన విషయం. అందువల్ల శ్రీకృష్ణభగవానుడు గీతలో అమృతాత్మ స్వభావాన్ని గురించి వివిధరీతుల్లో, అనేక దృష్టాంతాలతో, పెక్కు ఉదాహరణలతో వివరిస్తాడు, అలా చేయడంలో స్వామి ఉద్దేశ్యం ఏంటి: ప్రజలందరు ఆత్మ తత్త్వాన్ని గ్రహింతురు గాక యని.

ఆత్మను కత్తులు కటారులు ఖండింపజాలవు. అగ్ని దాన్ని కాల్పజాలదు ద్రవం దాన్ని తడుపజాలదు. వాయువు దాన్ని ఎండింపజాలదు. అందువల్ల ఆత్మ నిత్యమైనది. అది నిత్యం కాబట్టి సర్వగతమైనది. అది సర్వగతమైనది కాబట్టి విగ్రహంలాగా స్థిరమైనది. అది స్థిరమైనది కాబట్టి అచలమైనది, అది శాశ్వతమైనది, అందుచేత ఆత్మ ఏ కారణాన్నుండి కూడ ఉత్పత్తికాలేదు, అది క్రొత్తకాదు. అది పురాతనమైనది.

ఆత్మ అఖండమైనది దానికి అవయవముల్లు, భాగములేవు, అది అత్యంత సూక్ష్మమైనది. అది అనంతం. ఆ కారణంచేత ఖడ్గాలు దాన్ని ఖండింపలేవు. అనలం దాన్ని దహింపజాలదు. జలల దాన్ని తడుపజాలదు. వాయువు దాన్ని ఎండింపజాలదు.

ఆత్మను భౌతిక చక్షువులతో చూడలేము. ఆత్మ దృశ్యవస్తువుకాదు. అందువల్ల ఆత్మ అవ్యక్తమైనది. కన్నులతో చూడబడిన వస్తువు ఆలోచింపదగిన వస్తువు అవుతుంది. ఆత్మను కన్నులతో దర్శింపలేము కాబట్టి అది అచింత్యమైనది. పాలను మజ్జిగతో కలిపినపుడు పాల రూపం మారుతుంది. పాలవలె ఆత్మ తన రూపాన్ని మార్పజాలదు. అందువల్ల ఆత్మ మార్పులేనిది నిర్వికారమైనది. అది 'అనేజత్' అది ఏచలనము లేనిది.

'ఏజృ' కంపనే. కంపనం చలనం స్వావస్థా ప్రచ్యుతిః తద్వర్జితం సర్వదా ఏకరూపం ఇత్యర్థః. ఈ ప్రకారము ఈ ఆత్మ తత్త్వము కంపనము. చలనము లేనిది కావున అనగా తన దివ్యవైభవోపేతమైన స్థితి నుండి చ్యుతములేనిది కావున అది సదా ఏకరూపమైయున్నది.

ఏకం = ఏకము, ఒకటి, ఆత్మ.

ఈ విశ్వంలో 'ప్రోటోప్లాసం' (Protoplasm) మాత్రమే ఉన్నదని, మరేమి లేదని ఊహించుకోవచ్చు. అప్పుడు అన్నిరూపాలు అదృశ్యమౌతాయి, అన్నిరూపాలు ఒక రకమైన జీవపదార్థంనుండి మాత్రమే నిర్మితమైనాయి. చెట్టు, మనిషి. కుక్క, నక్క, నల్లి లేక దోమ ఒకే రకమైన పదార్థంతో, అనగా ప్రోటోప్లాసంతో చేయబడింది. ప్రోటోప్లాసం అనే పదార్థంలో ప్రాణం ఉంచబడింది. అన్ని రూపాలను సంబంధపరచేటటువంటి సూత్ర పదార్థం ఒకటే అవుతుంది.

ఈ విశ్వంలో ఉండేది శక్తి (Energy), లేక మనస్సు మాత్రమే అని ఊహించుకోవచ్చు. జ్ఞాన యోగ విద్యార్థి శుద్ధచైతన్యం మాత్రమే ఉన్నదని భావిస్తాడు. శ్రీ కృష్ణభగవానుడు అర్జునునితో ఇట్లా అంటాడు.

మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ

సూత్రమునందు కూర్చబడిన మణులవలె ఈ సర్వము నాయందున్నది.

ఈ నామరూపముల వెనుక విశ్వప్రాణం. లేక గుప్తమైన బ్రహ్మము లేక సర్వగతుడైన ఈశ్వరుడున్నాడు. ఈ రూపాల మాటున ఉండేసత్యాన్ని అనుభవించడానికి యత్నించాలి. అల్ప ప్రాణుల్ని, లేక అభివృద్ధినొందని జీవుల్ని తృణీకరించరాదు. మనలో ఏ ప్రాణం స్పదిస్తూందో అదేప్రాణం చీమల్లో, కుక్కల్లో, ఏనుగుల్లో, సర్వప్రాణుల్లో స్పందిస్తూ ఉన్నది. ప్రదర్శనంలో తరతమ భేదాలు అంతే. సర్వరూపాలు ఈశ్వరునకు, సగుణ బ్రహ్మమునకు చెందుతాయి.

దేహాలల్లో, మనస్సుల్లో పైకి కనబడే విభేదం రంగులల్లో, అభిప్రాయలల్లో భేదం ఉంది. ఆత్మసర్వాలలో ఒక్కటే. చోరుడు, జారుడు, పాకీపనివాడు, మహాప్రభువు, దుర్మార్గుడు, మహర్షి, కుక్క, పిల్లి, ఎలుక — అన్నింటికి ఉన్న ఆత్మ ఒక్కటే. మిథ్యాదృశ్యాన్ని, విభేదాన్ని వదలిపెట్టాలి తత్త్వాన్ని. యాథార్థ్యాన్ని స్వీకరించాలి.

ఒక సూర్యుడు అనేక దర్పణాలల్లో వివిధ సూర్యులుగ కనబడినట్లు ఒకే ఆత్మ బహుళంగా కనబడుతుంది. అనేక సూర్యులు అసత్యం. అవన్నీ పరావర్తనాలే. అలాగే అనేక జీవులు మిథ్య. ఒక సూర్యుడు మాత్రమే నిజం. అలాగే ఒక బ్రహ్మము మాత్రమే సత్యం.

మొదట్లో మన కుటుంబ సభ్యులతో మనం ఏకత్వాన్ని అనుభవించాలి తరువాత మన కులసభ్యులతో ఏకత్వాన్ని మనం సాధించాలి. తరువాత మన రాష్ట్రప్రజలతో మనం ఏకత్వాన్ని పడయాలి. తరువాత మన దేశం మొత్తంతో ఏకత్వాన్ని పడయాలి. తరువాత మనం సర్వప్రపంచ ప్రజలతో ఏకత్వాన్ని భావించాలి, ఈ ప్రయత్నంలో మనం విజయులమైతే అప్పుడు మాత్రమే మనం భగవంతునితో ఐక్యాన్ని పడయగలం.

ఎవడు వైవిధ్యంలో ఏకత్వాన్ని దర్శిస్తాడో అతడు సత్యమతస్థుడు, ద్వైతం ఉన్నచోట ఒకడు మరొకణ్ణి చూస్తాడు. కాని. ఈ సర్వము ఆత్మ

మైనపుడు ఒకడు వేరొకణ్ణి ఏలా చూస్తాడు? ద్వైతంలో భయమంది ద్వైతంలో జగడాలు, యుద్ధాలు ఉంటాయి. ద్వైతం అజ్ఞానం. ద్వైతం, దుఃఖాన్ని, శోకాన్ని, రోగాల్ని, మరణాన్ని తెచ్చిపెడ్తుంది. ద్వైతాన్నిదాటాలి ఈ తెరను ఛేదించాలి, ఈ కోశాల్ని చీల్చివేయాలి. తదుపరి అద్వైతంలో విశ్రమించాలి. ఈ సర్వమూ ఆత్మయే. సర్వమూ ఒక్కటే. ఈ ప్రపంచ మంతయూ మన శరీరం. దాన్ని భావించాలి. సర్వప్రాణంతో మన ఏక త్వాన్ని అనుభవించాలి.

సారాంశం ఏంటంటే : జగత్తు అనేదిలేదు. మనం దేహం కాదు, మనం సర్వగత ఆత్మ. మనం అకర్త. మనం సాక్షి ఇంద్రియాలు వాటి ధర్మాలు చేస్తాయి, సర్వత్ర ఆత్మ ఉంది ఈ అంతర్వాసి (Indweller) ని భావించాలి. మనం ఒక పండును చూచినపుడు ఇలా చెప్పాలి; "ఇది అద్వైత ఆత్మ" అన్నిరూపాలల్లో సారాన్ని దర్శించాలి. బాహ్యకోశాలను నిరాక రించాలి. మిథ్యా దృశ్యాలను కాదనాలి. ఈ సాధన బహిర్ నిర్వకల్పసమాధికి దారి చూపిస్తుంది. కనులు మూసుకొని కూర్చుండ నవసరములేదు. ఈ రక మైన సాధనకు ఆసనంగాని, ప్రత్యేకమైన గదిగాని అవుసరంలేదు. ఈ సాధన తెలివిగల ప్రాపంచికులకు అనుకూలంగా ఉంటుంది. ఇది కర్మజ్ఞానముల సమన్వయం. పరబ్రహ్మము యొక్క స్వయం జ్యోతి మనస్సుగా, విశ్వంగా మనకు కనబడుతుంది. ఈ ప్రపంచం ఏంటి? ప్రపంచం కేవలం మనస్సే. ఈ జగత్తు ఒక సుదీర్ఘ నిద్ర. ఇదే జ్ఞాన యోగ, లేక వేదాంత సారాంశం. దీన్ని మనం జీర్ణించుకోవాలి. దాన్ని ఒంటబట్టేటట్టు చేసుకోవాలి, దాన్ని సర్వత్ర ధైర్యంగా చాటి చెప్పాలి. ధీరులం కావాలి, అంతస్థమైయున్న సచ్చిదానందబ్రహ్మములో సర్వదా తోషితుల మయ్యెదము గాక!

**తచ్చైకం సర్వభూతేషు మన సః సంకల్పాది లక్షణాద్ జవీయో జవవ త్తరమ్.** అది అన్ని ప్రాణులలో ఒకటిగా ఉంటూవున్నది.

మరియు సంకల్పాది రూపమగు మనస్సుకంటె కూడ జవీయమైనది. అధిక వేగము గలది.

మనసః జవీయః = మనస్సునకంటె వేగముగలది. 'ఆత్మ అచల మైనది. కాని మనస్సున కంటె వేగముగలది' కదలని పదార్థము కదిలెడు వస్తువుకంటె వేగముగ ఎట్లు పోగలదు? ఇది అసంభవముగ తోచవచ్చును. ఇది అయుక్తాభ్యాసమనిపించును. ఆలోచించినచో అది అట్లుగాదు. ఏలన ఆత్మ సర్వవ్యాపకమైనది. పరిపూర్ణమైనది. కావున ఆత్మ మనస్సున కంటె వేగము కలదిగ చెప్పబడింది. మనస్సు ఒక ప్రదేశమును చేరక మునుపే ఆత్మ (సర్వవ్యాపియగుట వలన) అచ్చట ఉండును. అందువల్ల మనస్సు ఎప్పటికిని దానికంటె ముందుగ ఉండజాలదు,

మనస్సును గురించి కొంచెం తెలుసుకొందాం. మనస్సంటె ఏమిటి? మనకు భగవంతునకు మధ్యఉండే గోడే మనస్సు. ఓం చింతనచే గాని, భక్తిచే గాని ఈ గోడను కూలద్రోయాలి. అప్పుడు భగవంతునితో మనం ముఖాముఖిగ వస్తాము, మనల్ని భగవంతుణ్ణుంచి వేరు చేసేదే మనస్సు, మనస్సును గురించి, దాని పనులను గురించి చాలమందికి తెలియదు. చదువుకొన్నవారికి గూడ మనస్సును గురించి సరియైన అవగాహనలేదు. వైద్యులు సైతం తిమిరంలో తడవులాడుతూన్నారు, వారి ప్రకారం, మనస్సు అనేది ఒక గోర్ధకస్రావం. కాలేయంనుండి వచ్చే పైత్యరసం లాగా.

మనస్సు అనేది ఆత్మశక్తి, మెదడుకు విశ్రాంతి (నిద్ర) అవసరం, మనస్సుకు విశ్రాంతి అవసరం లేదు. మనస్సును నిగ్రహించిన యోగిఎన్నడు నిద్రపోడు, ఆతడు ధ్యానంనుండే పరిపూర్ణ విశ్రాంతిని పొందుతాడు.

అష్టప్రకృతులలో మనస్సు ఒకటి అని గీతలో చెప్పబడింది.

భూమిరాపోऽనలో వాయుః
ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతి రష్టధా. ॥గీతా॥

పృథివి, ఆపస్సు, అగ్ని, వాయువు. ఆకసము, మనస్సు, బుద్ధి, అహంకారము అనెడి ఎనిమిది విధముల నా ప్రకృతి విభజింపబడియున్నది.

సాంఖ్య వేదాంతం ప్రకారం మహత్తు నుండి సాత్త్విక అహంకారము, రాజసిక అహంకారము, తామసిక అహంకారము వచ్చాయి. సాత్త్విక అహంకారం నుండి మనస్సు, రాజసిక అహంకారాన్నుండి ప్రాణం తామసిక అహంకారాన్నుండి తన్మాత్రలు వచ్చాయి. తన్మాత్రల నుండి స్థూలభూతాలు వచ్చాయి స్థూలభూతాల నుంచి స్థూలజగత్తు వచ్చింది. మనస్సు అనేది అహంకారమే. 'నేను' అనే భావమే. 'అహం' భావాన్ని లేకుండ చేయడం బహుకష్టమైనపని, మనస్సు ఎప్పుడూ తన్నుతాను ఏదోఒక స్థూల వస్తువుతో సంబంధపరచుకొంటుంది. తనంతట అదినిలువజాలదు. ఈదేహంలో 'నేను' గా వచించేది ఈ మనస్సే. మనోవృక్షానికి 'అహం' భావం బీజం. ఈ అహంకార బీజానుండి మొట్టమొదట ఉత్పత్తి అయ్యే అంకురం బుద్ధి. ఈ అంకురాన్నుండి సంకల్పము అనబడే శాఖోపశాఖలు ప్రభవిస్తాయి.

[సాంఖ్య వేదాంతం ప్రకారం

మహత్తు



'మనో హి వాసనా పుంజం బ్రువోతి తత్త్వవేదినః'
మనస్సు అనేది వాసనల సమూహమని తత్త్వవిదులు చెబుతారు. వాసనలు రెండు రకాలు. శుభవాసనలు, అశుభవాసనలు. సినిమాకు వెళ్ళాలి అని ఒక కోర్కె మనస్సులో కలిగితే అది అశుభ వాసన. 'గీతను చదవాలి జపం చేయాలి, ఒక మహాత్ముని సందర్శించాలి' అని కోరిక ఉదయిస్తే అది శుభ వాసన, శుభవాసనలు మోక్ష ప్రాప్తికి తోడ్పడుతాయి.

ఈ వాసనల్ని మూడు రకాలుగ విభజిస్తారు. దేహవాసన, శాస్త్ర వాసన, లోకవాసన. "నేను బలిష్ఠుణ్ణి కావాలి, లావుకావాలి, ఆరోగ్యవంతుణ్ణి కావాలి. అందగాడు కావాలి" — ఇది దేహవాసన, 'నేను మంచి పండితుణ్ణి కావాలి.' — ఇది శాస్త్రవాసన. 'నేను మంచిపేరు, ప్రఖ్యాతి, అధికారం గడించాలి,' — ఇది లోక వాసన. ఈ వాసనలు జ్ఞానార్జన మార్గంలో అవరోధాలుగ నిలబడుతాయి, ఈ వాసనలు నిర్మూలంకావడానికి మార్గం వైరాగ్యం, బ్రహ్మచింతనలే.

మనం ప్రాపంచిక వస్తువులల్లో మిథ్యా బుద్ధిని పెంపొందించుకొంటే మనస్సులో వాసనలు తలెత్తవు. బంధానికి కారణం వాసనలే, అశుభ వాసనల్ని శుభ వాసనల్లోకి మార్చాలి. శుభవాసనల్ని అలవరచుకొంటే అశుభ వాసనలు అవే మడుస్తాయి, సర్వవాసనల నిర్మూలన వలననే జీవన్ముక్తి పొందబడుతుంది.

'పెండ్లాము, బిడ్డ, డబ్బు ఉండాలి' అనేకోర్కె నిరుపయోగమైన, లేక మిథ్యాకాంక్ష. 'భగవంతుని సాక్షాత్కరించుకోవాలి' అనే కోర్కె సత్యమైన ఈప్సితం.

మనస్సును వశపరచుకొనేందుకు రెండు మార్గాలు ఉన్నాయి, ఒకటి చిత్తవృత్తి నిరోధము ద్వారా యోగాన్ని అభ్యసించడం,

రెండవది బ్రహ్మ విచారంద్వారా జ్ఞానయోగాన్ని అభ్యసించడం. కొందరకు యోగం అనుకూలంగా ఉంటుంది. మరి కొందరకు జ్ఞానం అనుకూలంగా ఉంటుంది. అదంతా అభిరుచి, మనఃప్రవృత్తి, సాధన చేసేటందుకు శక్తి సామర్థ్యం — వీటిపై ఆధారపడుతుంది. అది ఆర్థిక విషయాల మీద కూడ ఆధారపడియుంటుంది. స్థిర నివాసం, ఆహారసదుపాయం, ఇతర యోగావసరాలు ఉన్నటువంటి వ్యక్తి యోగాన్ని అభ్యసింపవచ్చు. విరక్తుడైన వాడు, సంచార జీవనం చేసేవాడు విచారపద్ధతిని అభ్యసింపవచ్చు.

**నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్శత్** = దేవతలు తమకు ముందు పరుగిడు దానిని పట్టుకొనలేకపోయిరి. దేవతలు అనగా ఇంద్రియములు, చెవులు, కన్నులు, నోరు, ముక్కు, చర్మము, వాక్కు, పాణి, పాదము, గుదము, ఉపస్థ — ఇవి ఇంద్రియములు. 'దివ్' అనుధాతువునకు 'ప్రకాశింపజేయు' అని అర్థము. ఇంద్రియములు కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు అని రెండురకాలు. ఇంద్రియములతో తెలిసికొనదగిన విషయాలు మనస్సుతో గూడ తెలుసుకొనవచ్చును. మహారాష్ట్రలో ఒక మహాత్ముడు ఉండేవాడు. అతడు గ్రుడ్డివాడు. అతడు ఏ పుస్తకాన్నైన తీసుకొని ఏ తడబాటు లేకుండ చక్కగా చదివేవాడు. ఇది ఆశ్చర్యకరవిషయం కదా! అతడు అంతర మానసిక దృష్టిని అభివృద్ధి పరచుకొన్నాడు. అతడు నేరుగా మనస్సుద్వారా చూచేవాడు, (దూరదృష్టి) ఆతనికి భౌతిక చక్షువులతో అవసరం ఉండేదికాదు. మనం కూడా అభ్యాసంతో సాధింపవచ్చు. మనస్సు ఏఇంద్రియములసాయంలేకుండ అదే చూడగలదు, వినగలదు. రుచిచూడగలదు, వాసన చూడగలదు, స్పృశించగలదు. మనస్సులో అన్ని ఇంద్రియాలు కలిసియున్నాయి.

శ్రోత్రాది ఇంద్రియాలు ఆత్మను అవగతము చేసుకోలేవు. అవి ఆత్మకంటె ముందు పోలేవు, అవి ఒక ప్రదేశమును చేరక మునుపే సర్వవ్యాపి

యగు ఆత్మ అచ్చట ఉండును. అందువల్ల ఇంద్రియాలు దానికంటె ఎన్నడు ముందుగ ఉండజాలవు.

శ్రుతుల్లో ఒక చోట బ్రహ్మము 'అవాఙ్మనోగోచర' అని కావ వస్తుంది. అనగా బ్రహ్మము వాక్కునకు, మనస్సునకు అందదు. శ్రుతుల్లోనే మరియొక చోట 'మనసైవ ద్రష్టవ్యం' అని చూస్తూంటాం. అనగా బ్రహ్మము మనస్సుచేతనే చూడబడవలెను. ఇవి పరస్పర విరుద్ధాలు కావు. ఇవి అసంగతం కూడ కావు. అయితే దాని అర్థం ఏంటి? అర్థం ఇది. అహంకారం, మోహం, కామక్రోధాదుల నుండి ముక్తమైనటువంటి విశుద్ధ మైన, సూక్ష్మమైన, కుశాగ్రమైన, సాధన చతుష్టయ సంపత్తితో కూడిన మనస్సుతో బ్రహ్మమును తెలుసుకోవాలి, సాక్షాత్కరించుకోవాలి. విశుద్ధ మనస్సు సాక్షాత్ బ్రహ్మమే.

తత్ ధావతః అన్యాన్ అత్యేతి తిష్ఠత్ = అదికూర్చుండియు కూడ దాని వెంబడి పరుగిడు వారికంటె వేగముగ పోవును. 'తిష్ఠత్' అనగా కూర్చుండుట ఆత్మ ఊరక యుండును. అనగా ఆత్మ నిష్క్రియము, ఆత్మ నిరవయవము కాన అది అక్రియము. ఆత్మ అకర్త నిరవయ ఆత్మకు మనం కర్తృత్వాన్ని ఎలా ఆరోపించగలం? ఆత్మ సర్వవ్యాపి. పరిపూర్ణం కాబట్టి మనస్సుగాని, ఇంద్రియములుగాని, బుద్ధిగాని దానికంటె ముందు పోజాలవు. అనగా ఆత్మ ఇంద్రియములకు, మనస్సునకు, బుద్ధికి అతీతం.

ఇంద్రియాణి పరాణ్యాహుః
ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిః
యో బుద్ధేః పరతస్తు సః ॥గీతా॥

ఇంద్రియాలు (దేహానికంటె) మేలని చెప్పుదురు. మనస్సు ఇంద్రియాలకంటె గొప్పది. బుద్ధి మనస్సుకంటె మిన్నయైనది. ఆ బుద్ధికంటె కూడ శ్రేష్ఠమైనవాడు అతడు (ఆత్మ)

భౌతిక దేహం స్థూలమైనది, బాహ్యమైనది, పరిచ్ఛిన్నమైనది, ఇంద్రియాలను దేహంతో పోలిస్తే అవి సూక్ష్మమైనవి, అంతరమైనవి, ఎక్కువ వ్యాపకం కలవి. అందువల్ల ఇంద్రియాలు దేహానికంటె ఉత్కృష్ట మైనవని తత్వజ్ఞులు చెప్పుతారు. మనస్సు తోడ్పాటు లేకుండ ఇంద్రియాలు స్వతంత్రించి ఏ పని చేయలేవు కాబట్టి మనస్సు ఇంద్రియాలకంటె గొప్పది. మనస్సు పంచేంద్రియాలపనులను నిర్వర్తించ గలదు. బుద్ధికి నిశ్చయాత్మక శక్తి ఉంది. మనస్సు సందిగ్ధావస్థ పడ్డప్పుడు బుద్ధి దాని ఆదుకొంటుంది. అందువల్ల బుద్ధి మనస్సుకంటె పెద్దది. బుద్ధి తన కాంతిని ఆత్మనుండి గ్రై కొంటుంది అందువల్ల సాక్షిభూతుడైన ఆత్మ బుద్ధికంటె పరమైనది.

తస్మిన్నపో మాతరిశ్వా దధాతి = దానివలన మాతరిశ్వుడు సకల ప్రాణుల యొక్క క్రియకు ఆధార భూతుడుగ ఉన్నాడు. 'మాతరిశ్వ' శబ్దానికి శ్రీ శంకరులవారు ఇలా అర్థం చెబుతారు. 'మాతరి అంతరిక్షే శ్వయతి గచ్ఛతీతి వాయుః' తల్లియందు తిరిగెడు యావత్ ప్రపంచాన్ని ఉద్ధరించే వాయువే, అనగా హిరణ్యగర్భుడే, సూత్రాత్మయే, కార్య బ్రహ్మమే మాతరిశ్వుడు, అతడు సర్వప్రాణులలోని దివ్య జీవన శక్తి (Divine life power), అతడు పవన దేవత. అతడు అంతరిక్ష పాలకుడు అతడు విశ్వాత్మ అగ్ని, సూర్యుడు, వరుణుడు మున్నగు దేవతలకు ఆధారుడు మాతరిశ్వుడే, ఆత్మ ప్రభావము వలననే మాతరిశ్వుడు (హిరణ్య గర్భుడు, కార్యబ్రహ్మము, సూత్రాత్మ) సకల ప్రాణులయొక్క క్రియకు ఆధారభూతుడుగ ఉన్నాడు.

అపస్ = నీరము. 'అపః' అనగా సర్వ కర్మలు. యజ్ఞ యాగాది కర్మలు నీరు (అపః) ఉపయోగించే చేస్తాము. అందువల్ల 'అపః' అంటే ఇచట సకల ప్రాణులు చేష్టలు.

అపః కర్మాణి ప్రాణినాం చేష్టాలక్షణాని,
అగ్న్యాదిత్య పర్జన్యాదీనాం జ్వలనదహన
ప్రకాశాభి వర్షణాదిలక్షణాని దధాతి విభజతి
ఇత్యర్థః. ఆ మాతరిశ్వుడు 'అప్'ను, అనగా ప్రాణుల యొక్క చేష్టారూప కర్మలను ప్రవర్తిలజేయును. అగ్ని, సూర్యుడు, వరుణుడు మొదలగు దేవతలకు జ్వలనదహనాలను, ప్రకాశాన్ని, వర్షాన్ని యిచ్చుట మొదలగు కర్మలను విభజిస్తాడు. ఇది భావార్థము.

అహంకారంచే మానవుడు ప్రతిదాన్ని 'నేను చేస్తూన్నాను' అని అంటాడు. కావున అతడు బద్ధుడౌతూన్నాడు. అతడు కర్మబంధనాలనుండి అహంకార పాశాన్నుండి ముక్తుడై, శాంతిని పొంది పరమేశ్వరునిలో ఐక్యం అయ్యేదానికి మార్గాన్ని సూచిస్తుంది ఈ మంత్రం. మానవుడు (సాధకుడు) ఇలా అనుకోవాలి, భావించాలి; "నేను పరమేశ్వరుని హస్తంలోని ఆయుధాన్ని, భగవంతుడు నా చేతులగుండ పనిచేస్తూన్నాడు. అతడు నా కనుల గుండ చూస్తూన్నాడు, అతడు నా చెవులగుండ వింటూన్నాడు, అతడు నా నాసికగుండ ఘ్రాణిస్తూన్నాడు," ఇది కర్మయోగ, భక్తియోగ రహస్యం.



# ఐదవ మంత్రము

తదేజతి తన్నైజతి
తద్దూరే తద్వంతికే
తదంతరస్య సర్వస్య
తదు సర్వస్యాస్య బాహ్యతః.

**టీక :—**

తదేజతి = తత్, ఏజతి = అది కదలును, తన్నైజతి = తత్ + న + ఏజతి = అది కదలదు, తద్దూరే = తత్ + దూరే = అది చాల దూరము. తద్వంతికే = తత్ + ఉ + అంతికే = అది చాల సమీపము. తదంత రస్య = తత్ + అంతః + అస్య = అది దీని అంతర్భాగమున గలదు. సర్వస్య = అంతయు, తదు = తత్ + ఉ = అది వాస్తవములో. సర్వ స్యాస్య = సర్వస్య + అస్య = వీ నన్నింటియొక్క: బాహ్యతః = వెలుపల.

**భావము :—**

అది (ఆత్మ) చలించును. అది చలింపదు. అది దూర మున ఉన్నది. అది దగ్గరలో ఉన్నది. అది దీనియంతటిలో గలదు. అది దీనియంతటికి బాహ్యమున కూడ గలదు.

**వివరణము :—**

ఈ మంత్రమున నాలుగవ మంత్రములోని భావములు పునర్వచింప బడినవి.

తత్ = అది. తత్ అనగా ఆత్మ. ఒక జిజ్ఞాసువు ఒక ఋషీశ్వరుని దగ్గరకు వెళ్ళి, అతని తనకు ఆత్మ స్వభావాన్ని గురించి వివరించవలసి వదిగ కోరాడు. ఆ ఋషిపుంగవుడు ఊరకుండినాడు, అతడు మౌనం దాల్చియుండినాడు. ఆ జిజ్ఞాసువు మరల మునిపుంగవుని కడకు వెళ్ళాడు. అతడు యోగీశ్వరుని అదే ప్రశ్న అడిగాడు. ఆ జ్ఞాని మరల మౌనంగా ఉండినాడు. విద్యార్థి గురువుగారి దగ్గరకు మూడవసారి వెళ్ళాడు, అప్పుడు ఆ మహాత్ముడు ఇలా అన్నాడు; "నేను నీ కెప్పుడో జవాబు ఇచ్చేశాను." 'అయం ఆత్మ శాంతో' — ఈ ఆత్మ శాంతి స్వరూపము, లేక మౌన స్వరూపము. ఈ ఆత్మను తీవ్రమైన, సంతత. ప్రగాఢమైన, మౌన ధ్యానం (నిధిధ్యాసనము) ద్వారా సమీపించాలి. ఈ ఆత్మ సకల జీవులలో దాగియుంది, సూక్ష్మమైన కుశాగ్రబుద్ధిగల మనుజుడు ఈ ఆత్మను సాక్షాత్కరించుకోగలడు.

ఏజతి = కదలును. 'తదేజతి' అనగా అది కదలును (కదలించును). అది అనగా ఆత్మ. అది దేనిని కదలించును ? అది ప్రకృతిని కదలించును, ఆత్మ నిష్క్రియము, ఐనప్పటికి తన కేవల సమ్ముఖ ప్రభావం వల్ల. తన వీక్షణ వల్ల ప్రకృతిని కదలిస్తుంది. అది ప్రకృతిని నెట్టుతుంది, ఇక ప్రకృతి చలిస్తుంది. అందువల్ల 'తదేజతి' అని చెప్పబడింది.

ప్రకృతి అంటే ఏమిటో సంగ్రహంగా తెలుసుకొంటాం. విద్య, పరాశక్తి. ప్రకృతి, మూలప్రకృతి. అవ్యక్తం, ఆదిశక్తి ఆదిమాయ — ఇవన్నీ మాయకు పర్యాయపదములు. విష్ణుశక్తి (లక్ష్మి), శివశక్తి(పార్వతి) బ్రహ్మశక్తి (సరస్వతి) — ఇవన్నీ ఒకే పరాశక్తి (ఆదిమాయ) యొక్క వికారములు. అవి మాయా జనితములు. సృష్టి సమయంలో మూల ప్రకృతి స్పందింపబడినప్పుడు సత్త్వము, రజస్సు, తమస్సు అనే త్రిగుణాలు వ్యక్తమౌతాయి. సత్త్వాధిక్యతగల మాయ చైతన్యంతో సంయుతమైనపుడు దాన్ని

విష్ణుశక్తి, లేక రక్షించేటటువంటి పరబ్రహ్మాంశమైన విష్ణుభగవానుడు అంటాము. అలాగే రజస్సు ఆధిక్యతగల మాయ చైతన్యంతో చేరియున్నప్పుడు దాన్ని బ్రహ్మశక్తి, లేక సృష్టించేటటువంటి పరబ్రహ్మాంశమైన బ్రహ్మదేవుడు అని అంటాము. తమస్సు ఆధిక్యతగల మాయ చైతన్యంతో కలసినప్పుడు దాన్ని శివశక్తి, లేక విధ్వంసం చేసేటటువంటి పరబ్రహ్మాంశమైన మహాశివుడు అని అంటాము,

మూల ప్రకృతికి రెండు అవస్థలు ఉన్నాయి. 1. గుణసామ్య అవస్థ, 2. వైషమ్య అవస్థ, మొదటిదానిలో సత్త్వరజస్తమో గుణములు నిశ్చలస్థితిలో ఉంటాయి. విశ్వ ప్రళయంలో ఈ స్థితి సంభవిస్తుంది. అసంఖ్యేయులైన జీవులు తమ సంస్కారాలతో, అదృష్టం (కానరాని కర్మఫల శక్తి)తో సూక్ష్మస్థితిలో ఉంటారు, ప్రళయ వేళ అయిపోగానే ప్రకృతి సామ్యావస్థలో స్పందనం కలుగుతుంది. ఎందువల్లనంటే దాగియున్న జీవులు తమ కర్మఫలాలను అనుభవింప గోరుతారు. ఈ స్థితిని వైషమ్య అవస్థ అని అంటారు.

'మాయ' అంటే 'అదికాదు' అని అర్థము, ఈ గోచర విశ్వానికి, అన్నివస్తువులకు, సర్వ మనస్సులకు అధిష్ఠానంగా ఉండేటటువంటిది కాదు అని అర్థము, మాయ బ్రహ్మము యొక్క మిథ్యాశక్తి 'సదసత్ విలక్షణ అనాది భావరూప అనిర్వచనీయం' అయినది మాయ, అది బ్రహ్మము లాగా సత్తుగాదు. కుందేటి కొమ్ములలాగా అసత్తుగాదు. ఎందువల్లనంటే వస్తువులను చూడగలం కాని సదసత్‌ను చూడలేము. అది అనిర్వచనీయము. దానికి రెండు శక్తులున్నాయి. 1. ఆవరణశక్తి, 2. విక్షేపశక్తి. మన దివ్యమైన సచ్చిదానంద స్వరూపాన్ని సాక్షాత్కరించుకోవడానికి అనుమతించనిది ఆవరణశక్తి. ఈ విశ్వాన్ని, దేహాన్ని సృజించి అభిమానాన్ని కలుగజేసేది విక్షేపశక్తి. అగ్నినుండి వేడి, హిమాన్నుండి శీతలము ఎలా ఎడబాటు లేవివో

అలాగే బ్రహ్మమునుండి మాయ ఎడబాటు లేనిది. అది ఆత్మాశ్రయము (బ్రహ్మముపై ఆధారపడియుండును).

ఈ విశ్వానికి మాయ ఉపాదాన కారణము. ఈశ్వరుడు మాయా విశిష్ట చైతన్యము. మాయలో శుద్ధ చైతన్య ప్రతిభాసమే ఈశ్వరుడు. మాయావృతుడైన బ్రహ్మము యొక్క అంశమునే సగుణ బ్రహ్మము, లేక ఈశ్వరుడు అంటారు. ప్రళయ కాలంలో మాయలో ఈ జగత్తు యావత్తు బీజరూపంలో ఉంటుంది. మాయపై ఈశ్వరునకు పూర్తివశీకరణ యుంటుంది. జీవునకు అవిద్య ఎలా కారణ శరీరమో, అలాగే ఈశ్వరునకు కారణ శరీరం మాయ. ఈ ప్రపంచం మాయ యొక్క కార్యం. పంచ భూతాలు మాయ యొక్క కార్యాలే.

బ్రహ్మము సచ్చిదానందము. మాయ అసత్తు, జడము, దుఃఖము. "'మాయ' అనేది ఎందుకుంది?" అనే విషయాన్ని మనం ఎంత తలబ్రద్దలు చేసుకొన్నా తేలదు. ఏ శాస్త్రంలో కూడ ఈ 'ఎందుకు'కు సమాధానం కానరాదు. బుద్ధి పనిచేసే ప్రాపంచిక విషయాలల్లో 'ఎందుకు' అనేది ఉండవచ్చు కాలదేశాదులచే పరిచ్ఛిన్నమైన బుద్ధి (స్థూలబుద్ధి, సాంతబుద్ధి) భావాతీత విషయాన్ని అందుకోలేని కారణంచే అటువంటి ప్రశ్నలలో 'ఎందుకు' అనేది యుండేందుకు వీల్లేదు. భగవానుడు గీతలో ఇలా అంటాడు.

దైవ హ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే
మాయామేతాం తరంతి తే. ॥గీతా॥

త్రిగుణమయమైన నా యీ దివ్యమగు మాయను దాటుట చాలకష్టము. ఎవరు నన్నే భజింతురో, శరణు బొందుదురో వారు ఈ మాయను దాటుదురు.

తన్నైజతి - తత్ + న + ఏజతి = అదికదలదు. ఆత్మ పరిపూర్ణము, సర్వగతము కాబట్టి అది ఎచ్చటకు కదలగలదు ? అందువల్ల తన్నైజతి అనడం సమంజసం. బాహ్యానికి ఈ మంత్రం నమ్మరాని, అసంగతమైనటువంటి విరుద్ధ విషయాలతో ఉన్నట్లు కనబడుతుంది. కాని ఆలోచిస్తే అది అలాకాదు. అర్థం మిక్కిలి స్పష్టం, ఆత్మ చలసమూలం (Frimum Mobile). అది ప్రకృతివి తోస్తుంది. అప్పుడు ప్రకృతి చలిస్తుంది. ఆత్మకు చలనం లేదు కాని అది ఊరకనే ప్రకృతిని వీక్షించడంతో, దాని కేవల సమ్ముఖ ప్రభావంతో అది ప్రకృతిని కదిలేటట్లుచేస్తుంది, అందువల్ల 'తదేజతి'. అది కదలించును (కదలును) అని చెప్పబడింది. ఆత్మ సర్వవ్యాపకము' సర్వ — పూర్ణము అయినప్పుడు అది ఎచ్చటకు కదలగలదు ? అందువల్లనే దానికి చలనము లేదు, తన్నైజతి అని చెప్పబడింది.

తదాత్మతత్త్వం యత్ప్రకృతం తదేజతి చలతి తదేవ చ నైజతి స్వతో నైవ చలతి స్వతోఽచలమేవ సత్ చలతీవేత్యర్థః.

ఆ ఆత్మ తత్త్వము ఏ ప్రకారముగ చలనము కల్గియున్నదో అట్లే అది చలనము లేక యున్నది. అది స్వతఃగ చలించదు. అనగా అది స్వయముగ అచలమైనదైనను కదలుచున్నది అని అర్థము

తద్దూరే - అది దూరంలో ఉంది. కించ తద్ దూరే వర్షకోటి శతైరపి అవిదుషాం అప్రాప్యత్వాద్ దూర ఇవ. మఱియు అది దూరంగా ఉంది. అది శతకోటి సంవత్సరములలో నైన అజ్ఞానులకు అందుబాటులో లేవి కారణమున దూరమని చెప్పబడింది. ఆత్మ అజ్ఞానులకు చాల దూరంలో ఉంటుంది. ప్రాపంచిక విషయాలల్లో నిమగ్నులైన వారికి సంసారంలో సమ్యక్ ప్రవిష్టులైనవారికి, ఆత్మ చాల దూరంలో ఉంటుంది.

స్వార్థపరులకు, గర్విష్ఠులకు, అహంకార పూరితులకు, క్రోధమూర్తులకు. కామాతురులకు ఆత్మ చాల చాల దూరంలో ఉంటుంది. అందువల్ల అజ్ఞానులకు ఆత్మ 'తద్దూరే' అని చెప్పబడింది.

తద్వంతికే . తత్ + ఉ + అంతికే — అది చాలాసమీపం.
తద్వంతికే సమీపేఽత్యంతమేవ విదుషాం
ఆత్మత్వాత్ న కేవలం దూరే అంతికే చ.

అది అత్యంత సమీపములో గలదు. అనగా కేవలము దూరములో లేకుండుట మే గాదు, విద్వాంసుల యొక్క ఆత్మయైన కారణమున అది సమీపములో నున్నట్లు చెప్పబడినది.

విచారవంతునకు, మననశీలునకు ఆత్మ దగ్గరలో ఉంటుంది. అది వారి అంతరాత్మగ ఉండటం వల్ల చిత్తశుద్ధి గలవారికి, సాధన చతుష్టయ సంపన్ను లకు, గురుభక్తి తత్పరులకు, శ్రవణ — మనన — నిధిధ్యాసనాభ్యాస కులకు, భగవంతునిలో అచంచల విశ్వాసం గలవారికి, సుకర్ములకు. భక్తులకు జ్ఞానులకు ఆత్మచాల, చాల సమీపంలో ఉంటుంది. అందువల్ల జ్ఞానులకు ఆత్మ 'తద్వంతికే' అని చెప్పబడింది.

తదంతరస్య సర్వస్య = అది అన్ని వస్తువుల అంతర్భాగంలో ఉంటుంది. ఆత్మ అతి సూక్ష్మమైనది. అది ఆకాశాదికంటె సూక్ష్మతరం, అది ప్రతి వస్తువును నింపుతుంది, ఆవృత్తంచేస్తుంది. అది పరిపూర్ణం కాబట్టి ప్రపంచంలో ఉండే సర్వ వస్తువుల్లో, వాటి అంతర్భాగంలో ఉంటుంది,

సర్వస్య అనగా ఈ ప్రపంచం యావత్తులోని అన్ని వస్తువులయొక్క, అనగా బ్రహ్మము సర్వ ప్రాణులకు, వస్తువులకు అధిష్ఠానము.

తదు సర్వస్యాస్య బాహ్యతః - అది వీనన్నింటి వెలుపల ఉంటుంది.

> తదంతరభ్యంతరేఽస్య సర్వస్య
> "య ఆత్మా సర్వాంతరః" ఇతి శ్రుతేః.
> అస్య సర్వస్య జగతో నామరూప క్రియాత్మకస్య
> తదు అపి సర్వస్య అస్య బాహ్యతో వ్యాప-
> కత్వాత్ ఆకాశవత్ నిరతిశయ సూక్ష్మత్వాద్
> అంతః. "ప్రజ్ఞానఘన ఏవ" ఇతి చ
> శాసనాన్నిరంతరం చ.

అది అన్నింటికి లోపల, వెలుపల గలదు. "ఆత్మ సర్వాంతరమైనది" అని శ్రుతి ప్రసిద్ధము. ఆకాశముతో సమానముగ వ్యాపించియున్న కారణముగ అది ఈ నామరూప క్రియాత్మకమగు యావత్ప్రపంచమునకు బాహ్యమునను, మరియు అది సూక్ష్మమైనదగుటవలన ఈ విశ్వమునకు అంతరమునను గూడ గలదు. మఱియు శ్రుతిలో అది ప్రజ్ఞాన ఘన మని కూడ వర్ణితమైనది. అందువల్ల అది నిరంతరమైనది. అనగా బాహ్యాభ్యంతర భేదములు లేక సర్వత్ర వెలుగొందుచున్నది.

ఆత్మ అతి సూక్ష్మమైంది, పరిపూర్ణమైంది, అన్నిటికి అధిష్ఠానమైంది. కాబట్టి అది సర్వవస్తువులకు ఆలంబనమై, వాటన్నింటి అంతర్భాగములో ఉండి, వాటిని పరివ్యాప్తంజేస్తుంది; అది బాహ్యాభ్యంతరములలో ఉంటుంది. కాబట్టి 'తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః' అని చెప్పబడింది.



# ఆరవ మంత్రము

యస్తు సర్వాణి భూతాని
ఆత్మన్యేవాను పశ్యతి
సర్వ భూతేషు చాత్మానం
తతో న విజుగుప్సతే.

టీక :

యః = ఎవడు, తు = నిజముగ, సర్వాణి = అన్ని, భూతాని = ప్రాణులను, ఆత్మని = ఆత్మయందు, ఏవ = మాత్రమే, అనుపశ్యతి = చూచునో, సర్వభూతేషు = అన్నిప్రాణులలో, చ = మరియు, ఆత్మానం = ఆత్మను, తతః = పిమ్మట, న = లేదు, విజుగుప్సతే = ముకుళిత మగును.

**భావము :**

ఎవడు ఆత్మయందు సర్వ ప్రాణులను, సర్వప్రాణుల యందు ఆత్మను చూచునో అతడు దేనిని ద్వేషింపడు.

**వివరణము :**

ఈ మంత్రములోని భావాలు భగవద్గీత ఆరవ అధ్యాయమునందలి 29, 30 శ్లోకాలలో కానవగును.

సర్వభూతస్థమాత్మానం
సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః. ॥గీతా॥

యోగముచే కూడిన మనస్సుగల ఆతడు అన్ని ప్రాణులందు ఆత్మను, ఆత్మయందు సమస్తప్రాణులను అవలోకించును, అతడు ఎల్లెడల సమమునే (ఆత్మనే) దర్శించును.

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి.

ఎవడు నన్ను అంతట జూచునో, మఱియు నాయందే సర్వస్వమును చూచునో అతడెన్నటికిని నా నుండి వేఱుగాడు, మఱియు నేనెన్నటికిని వానినుండి వేఱుగాను,

యోగి జ్ఞానచక్షువుతో, దివ్యనేత్రముతో ఎల్లెడల ఏకత్వమును, ఆత్మైక్యమును దర్శించును. ఇది వాస్తవములో మనోజ్ఞమైన, మహత్తరమైన దర్శనము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని అతడు భావించును. "ఇదంతయు వాస్తవములో బ్రహ్మము" అని తలపోయును. సకల జీవులు బ్రహ్మముతో తాదాత్మ్యముగ నతడు జూచును. బ్రహ్మ, ఆత్మ తాదాత్మమని అతడు దర్శించును. ఎవడు సర్వుల ఆత్మయగు వాసుదేవుని సకల జీవులందును, సకల జీవులను (సృష్టికర్తయగు బ్రహ్మమొదలుకొని గడ్డిపరక వఱకు) పరమేశ్వరునియందును చూచునో అతడు పరమేశ్వరుని నష్టపోడు, పరమేశ్వరుడతనిని నష్టపోడు, పరమేశ్వరుడు, ఆత్మైక్యమును దర్శించి యోగి ఒకటి అగుదురు, తాదాత్మ్యమును పొందుదురు. పరమేశ్వరుడు అతని సమ్ముఖమును వీడడు. అతడు పరమేశ్వరుని సమ్ముఖమును వీడడు. పరమేశ్వరుడు అతనిని పట్టువిడువడు, అతడు పరమేశ్వరుని పట్టువిడువడు. పరమేశ్వరుడు అతనిలోనివసించును. ఆతడు పరమేశ్వరునిలో నివసించును. ఈశోపనిషత్తునందలి ఆరు, ఏడు మంత్రములు పరపూర్ణమైన ఆత్మ సాక్షాత్కారము పొందిన పరమజ్ఞానియొక్క స్థితిని వర్ణించును,

యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి=యః తు సర్వాణి భూతాని ఆత్మని ఏవ అనుపశ్యతి = ఎవడు సకల ప్రాణులను ఆత్మయందే చూచునో 'సర్వాణి భూతాని' అనగా సర్వప్రాణులను. ఇది సాధారణ అర్థము. శబ్దార్థమేమన; 'అయిన అన్నివస్తువులను; అనగా అవ్యక్తమునుండి అచలవస్తువుల పర్యంతము'. సంపూర్ణ ఆత్మసాక్షాత్కారము నొందిన మహాపురుషుడు ఆత్మయందు సర్వప్రాణులను దర్శించును. అతడు ఆత్మను సర్వగతముగ, సర్వవ్యాపిగచూచును. శంకరాయణుల శ్రుతియందు ఇట్లు కానవచ్చును:

"ఎవడు సకలము పరమాత్మచే పరివ్యాప్తమైనట్లును, ప్రతి వస్తువును పరమాత్మయందును చూచునో అతడు తన్ను తాను రక్షించుకొనుటకై ఇచ్ఛగింపడు, ఏలన అతనికి దేని వలన ఎవనివలన భయమేమియులేదు. అతడు నిర్భయుడు కావున అతడు తన అల్పఆత్మను కాపాడుకొనుటకై ఎన్నడును ఆరాటపడడు."

సర్వభూతేషు చ ఆత్మానం = మఱియు సర్వప్రాణులందు ఆత్మను.

తన ఆత్మను (పరబ్రహ్మమును) దర్శించినటువంటి మహాత్ముడు అన్నివస్తువులు, అన్నిభూతములు తన ఆత్మనుండి వేరుకావనియు, మఱియు తనయాత్మ సర్వుల ఆత్మయనియు దర్శించును. ఆత్మ అన్ని జీవరాసుల సామాన్య చైతన్యము (Common Consciousness). రాజులో, రైతులో ఆత్మ ఒక్కటియే. సాధువునియందు, దుష్టునియందు ఆత్మ ఒక్కటియే. చండాలునిలో, క్షౌరికునిలో ఆత్మ ఒక్కటియే. చీమలో, ఏనుగులో ఆత్మ ఒక్కటియే. చెట్టులో, శిలలో ఆత్మ ఒక్కటియే.

పరివ్రాడ్ ముముక్షుః సర్వాణి భూతాని అవ్యక్తాదీని స్థావరాంతాని ఆత్మని ఏవ అనుపశ్యతి ఆత్మవ్యతిరిక్తాని న పశ్యతి ఇత్యర్థః. పరివ్రాజకుడగు మోక్షాన్వేషి అవ్యక్తమునుండి స్థావర పర్యంతము గల సకలభూతములను ఆత్మయందే చూచును, అట్లాగా వాటిని ఆత్మనుండి వేరుగ దర్శించడు.

తతః న విజుగుప్సతే - అటుపై అతడు దేనిని ద్వేషింపడు.

తన ఆత్మయందు, సర్వోత్కృష్టమగు విశ్వప్రజ్ఞా సమేతుడై విశ్రమించుచున్న ఆ మహాపురుషుడు ఏ వస్తువునుగాని, ఏ ప్రాణినిగాని చూచినపుడు వికర్షణ భావనతో ఏల ముకుళితుడగును? అతడు దేనినిగాని ఎట్లు ద్వేషింపగలడు? అతడు ఎవనిని గాని ఎట్లు ద్వేషింపగలడు? ఇది కొత్తగ అసంభవము.

ఆత్మ సాక్షాత్కారము నొందిన మహనీయుడు దేనికిని దూషియడు. అతని దివ్యప్రజ్ఞానుభవము వర్ణనాతీతము.

ఇమం ఏవ అర్థం అన్యోఽపి మంత్ర ఆహ.

ఇదే భావము ఏడవ మంత్రమున చెప్పబడుచున్నది.

# ఏడవ మంత్రము

యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవా భూద్విజానతః
తత్ర కో మోహః కః శోకః
ఏకత్వ మనుపశ్యతిః

టీక :—

యస్మిన్ = ఎవనిలో; సర్వాణి = అన్ని; భూతాని = ప్రాణులను; ఆత్మా=ఆత్మను, ఏవ=మాత్రమే; అభూత్ =అయ్యెనో; విజానతః=తెలిసి కొని, తత్ర=అచ్చట; కః=ఏమి? మోహః=మోహము; భ్రాంతి, కః = ఏమి?, శోకః=శోకము దుఃఖము; ఏకత్వం = ఏకత్వము; ఐక్యము; అనుపశ్యతః = చూచునో.

భావము :—

జ్ఞాతకు అన్ని ప్రాణులు తన ఆత్మతో ఒకటియైనపుడు అతడెట్లు మోహితుడు కాగలడు? అతడు ఎల్లచోట్ల ఏకత్వమునే చూచుచుండగ శోక మేమి యుండును?

వివరణము :—

ఈ మంత్రము సైతము ఆరవ మంత్రమువందలి భావమునే తెలియ జేయుచున్నది. ఆరవమంత్రమునందలి 'అనుపశ్యతి,' ఏడవ మంత్రము నందలి 'విజానతః' — ఈ రెండు పదాలు ఒకే అభిప్రాయాన్నే సూచిస్తున్నాయి.

యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవాభూ - ద్విజానతః =
యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మా ఏవ అభూత్ విజానతః -

జ్ఞాతకు సర్వభూతములు తన ఆత్మతో ఏకమైనపుడు, ఒకేఒక ఆత్మ అన్ని ప్రాణులలో ఉంటూన్నది అని మేధతో గ్రహిస్తే చాలదు. ప్రత్యక్షమైన ఆత్మ సందర్శనం అవసరం. అసలు (True) ఆత్మ సాక్షాత్కారం మిక్కిలి ఆవశ్యకము. అనగా అపరోక్షానుభూతిని పడయాలి.

ఆరవ శ్లోకమున బ్రహ్మమును తెలిసికొనినవాడు భయరహితుడగు నని చెప్పబడినది. ఇచ్చట ఆ బ్రహ్మవిదుడే శోకమోహములను దాటునని నుడువబడినది. ఇవి బ్రహ్మజ్ఞానము ప్రాప్తించుటవలన కలుగు ఫలములు. "నేను అన్నింటిని త్యజించి ఇపుడేలా, నాకు ఎవ్వరు ఆధారం లేకుండ, వినసింపగలను? అనేటటువంటి భయావస్థనుండి ముక్తుడు కావటమే నిర్భయత్వం. సన్న్యాసి తాను సంన్యాసం తీసుకొనేటప్పుడు 'నేను ఏ ప్రాణిలో భయోత్పాతం కలుగజేయను.' అని ప్రమాణం చేస్తాడు. ఈ ప్రమాణాన్ని నిలబెట్టుకొనేదాన్ని అభయదానం అంటారు. మనోవాక్కర్మలలో ఈ అభయ దానం చేయడమే నిర్భయత్వం, ఆత్మయొక్క అమృత స్వరూపాన్ని, పూర్ణానంద స్వభావాన్ని నిరంతరం ధ్యానించడం మూలాన్నే భయాన్ని తొలగించుకోగలం. సత్యమైన ఆర్జవమైన జీవితాన్ని గడిపితే, ఏ సంశయ భావనలేకుండ శాస్త్రములలోని ఉపదేశాలను శ్రద్ధతో ఆచరిస్తే, సదాచార జీవనాన్ని గడిపితే, ఎల్లవేళల భగవంతుని స్మరిస్తే వ్యక్తి నిర్భయుడౌతాడు. యోగి సర్వత్ర ఆత్మనే చూచినపుడు, ద్వైతభావన అతనిలో నశించినపుడు, అతనిలో అద్వైత భావన ఉదయించినపుడు అతడు దేనిని గూర్చిగాని ఎలా భయపడగలుగుతాడు? అతనిలో భయభావన ఎలా ఉదయించగలదు? మోక్ష ప్రాప్తికి నిర్భయత్వం (Fearlessness) అతిముఖ్యం. నిర్భయత్వం జీవన్ముక్తునికి ముఖ్య లక్షణం. జీవన్ముక్తు డొక్కడే పూర్తిగ నిర్భయుడు కాగలడు.

'తరతి శోకం ఆత్మవిత్'. 'ఆత్మను తెలిసికొనినవాడు దుఃఖ సముద్రమును దాటును,' అని శ్రుతులు ఘోషించుచున్నవి. ఆత్మజ్ఞానము లేనివాడు అవిద్య (అజ్ఞానము), కామము (కోరిక), కర్మ (పని) అను మూడుముడులచే బంధితుడై, శోక మోహ మహోదధియందు మునుంగును. బ్రహ్మవిదుడు సర్వభూతములు తనఆత్మతో తాదాత్మ్యమని ప్రత్యక్షానుభవము పడయుటచే, అద్వైత సాక్షాత్కారము నొందుటచే ఈమూడు ముడులు మాయ మగుటవలన, హృదయగ్రంథి ఛేదింపబడుటవలన అతనిలో శోకమోహము లెట్లుండగలవు? అది యెమ్మాటికి అసంభవము. అతడు సర్వత్ర సదా బ్రహ్మానందమున నోలలాడుచుండును. అతనిని బ్రహ్మాండమైన దుఃఖము పై తము అణుమాత్రము కదలింపజాలదు. గీతలో నిట్లు కాననగును:

యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః
యస్మిన్‌స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే. ॥గీతా॥

దేనిని (ఆత్మను) పొంది, ఇక దానికంటె పొందదగిన ఘనతర లాభములేదని అతడు భావించునో, దేనియందు (ఆత్మలో) ప్రస్థిరుడై అతడు బ్రహ్మాండమైన దుఃఖముచే కొంచెముగూడ చలింపడో.

తత్రకో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః = తత్ర కః మోహః కః శోకః ఏకత్వం అనుపశ్యతః= అతడు ఏకత్వము (బ్రహ్మము) నే చూచుచుండగ అతనికి మోహ మెట్లుండును, శోక మెట్లుండును?

దుఃఖము (శోకము) వలదనుకొంటే మనము దేహాన్ని ధరించరాదు. మనం దేహాన్ని వద్దనుకొంటే కర్మ చేయరాదు. కర్మ చేయకుండా ఉండా

లనుకొంటే రాగద్వేషాలను వదలాలి. రాగద్వేషాలను వదలివేయ దలిస్తే అభిమానాన్ని (అహంకారాన్ని) త్యజించాలి. అభిమానం లేకుండ చేసుకోవాలంటే అవివేకాన్ని వదలాలి. అవివేకాన్ని వదలాలంటే అవిద్యను విడిచిపెట్టాలి. ఈ అవిద్యను వద్దనుకొంటే బ్రహ్మ-జ్ఞానం పొందాలి.

ఒరను తొలగిస్తే ఖడ్గం కనబడుతుంది. బూడిదను తొలగిస్తే నిప్పు కనబడుతుంది. మేఘములు ఛిద్రమైతే సూర్యుడు కనబడుతాడు. అలాగే ఆత్మను మరుగుపరచే అజ్ఞానాన్ని తొలగిస్తే స్వయంజ్యోతియగు ఆత్మను ప్రత్యక్షంగా చూడవచ్చు.

అద్దాన్ని అంటియున్న దుమ్ము పొరవల్ల అద్దం సరిగా కనబడదు. ఆలాగే జ్ఞానం అజ్ఞానంచేత ఆవృతమైయుంది. ఆ కారణంచేత ప్రజలు మోహితులౌతారు. అజ్ఞానేన ఆవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. "గీతా" వారు దేహాన్ని విశుద్ధ ఆత్మగా భావించి, యీ మిథ్యా ప్రపంచానికి అంటియుంటారు, నామరూపములతో గూడిన ఈ మిథ్యా ప్రపంచాన్ని వారు ఘన సత్యంగా భావిస్తారు. తీవ్రమైన దేహాభిమానం గలవాడు ఆత్మజ్ఞానం పొందడం అసంభవం.

జ్ఞాని తన్ను తాను తన దేహంతో, భార్యతో, కుమారునితో, ఆస్తి పాస్తులతో తాదాత్మ్యము చేసికోడు. తన యోగక్షేమాలను గూర్చిన ఆలోచనల నన్నింటిని వదలిపెట్టుతాడు. దేనినికూడ 'ఇది నాది' అని ఎన్నడు అనుకోడు. "బ్రహ్మము ఒక్కటే ఉండేది. అదే భాసిస్తుంది. నేను బ్రహ్మమును." అనే ఒక్కతలంపుతో ఆతడు ఉంటాడు. అతడు జీవన్ముక్తుడై జీవితగమ్యమైన ఆద్వైతికి, బ్రహ్మానందమును అనుభవిస్తాడు.

పరబ్రహ్మమును తెలిసినవాడు అమృతత్వాన్ని పొంది, నిత్యానందాన్ని అనుభవిస్తాడు. ఆతడు శోకాల్ని దాటి, శుభాశుభాల్ని అతిక్రమిస్తాడు.

ఆతనికి సంశయాలు, మోహం, బంధం లేవు. ఆతడు అవిద్య, కామ, కర్మలనేటి హృదయగ్రంథులనుండి ముక్తుడు. ఆతని స్థితి వర్ణనాతీతము.

ఆతడు ఆనందఘనుడై సహజావస్థను (natural continuous super conscious state) ను పొంది ఇలా ఆనందగీతాన్ని గానం చేస్తాడు:

ఆనందోహం ఆనందోహం
ఆనందం బ్రహ్మానందం.
సచరాచర పరిపూర్ణ శివోహం,
సహజానంద స్వరూప శివోహం.
వ్యాపక చేతన ఆత్మ శివోహం,
వ్యక్తావ్యక్త స్వరూప శివోహం.
నిత్య శుద్ధ నిరామయ సోహం,
నిత్యానంద నిరంజన సోహం.
అఖండైకరస చిన్మాత్రోహం,
భూమానంద స్వరూప శివోహం.
అసంగోహం అద్వైతోహం,
విజ్ఞానఘన చైతన్యోహం.
నిరాకార నిర్గుణ చిన్మయోహం,
శుద్ధ సచ్చిదానంద స్వరూపోహం.
అసంగ స్వప్రకాశ నిర్మలోహం,
నిర్విశేష చిన్మాత్ర కేవలోహం.
సాక్షి చేతన కూటస్థోహం,
నిత్య ముక్త స్వరూప శివోహం.

ఆనందోహం ఆనందోహం
ఆనందం బ్రహ్మానందం.
ఆనందోహం ఆనందోహం
ఆనందం బ్రహ్మానందం.

సంచిత కర్మలు అవిద్యమీద ఆధార పడుతాయి. (అవిద్యాశ్రయము). క్రియమాణ కర్మలు అహంకారం మీద ఆధార పడుతాయి (అహంకారాశ్రయము). ప్రారబ్ధ కర్మలు స్థూలదేహం మీద ఆధార పడుతాయి (దేహాశ్రయము) జీవన్ముక్తునిలో జ్ఞానోదయంవల్ల అజ్ఞానం నాశమౌతుంది. అందువల్ల సంచితకర్మలు నశిస్తాయి. అతనికి అహంకారం లేదు. అందువల్ల క్రియమాణకర్మలు నాశమొందుతాయి. అతడు తన్ను తాను సర్వగత ఆత్మతో తాదాత్మ్య మొనర్చుకొనునందువల్ల అతడు దేహము లేనివాడే. ఆకారణంచేత ఆత్మజ్ఞానం కలిగితే త్రివిధములైన కర్మలు (సంచిత, క్రియమాణ, ప్రారబ్ధ కర్మలు) నశిస్తాయి.

---

# ఎనిమిదవ మంత్రము

స పర్యగాత్ శుక్రమకాయమవ్రణం
అస్నావిరం శుద్ధమపాపవిద్ధం
కవిర్మనీషీ పరిభూః స్వయంభూః
యాథాతథ్యతః అర్థాన్ వ్యదధాత్
శాశ్వతీభ్యః సమాభ్యః.

**టీక :**

సః=పరమాత్మ, పర్యగాత్=చుట్టువడలెను సర్వగతము, శుక్రమ్=తేజోవంతమైన, అకాయమ్=దేహరహితమైన, అవ్రణమ్ = హానిలేని, అస్నావిరం = కండరములులేని, శుద్ధమ్ = నిర్మలమైన, అపాపవిద్ధమ్ = పాపముచే నిర్లిప్తమైన, కవిః=ద్రష్ట; మనీషీ=సర్వజ్ఞమైన, పరిభూః = అత్యుత్తమమైన, స్వయంభూః=ఆత్మభవమైన, యాథాతథ్యతః=వరుసగా క్రమముగా. అర్థాన్=విధులను, పనులను, వ్యదధాత్ = నిర్ణయించెను, కేటాయించెను, శాశ్వతీభ్యః=శాశ్వతమైన, సమాభ్యః=సంవత్సరములకు, ప్రజాపతులకు.

**భావము :**

అతడు (పరబ్రహ్మము) సర్వవ్యాపి, తేజోమయుడు, అతనుడు, హానిలేనివాడు, స్నాయురహితుడు, పరిశుద్ధుడు, పాపవిరహితుడు, కవి (ద్రష్ట), సర్వజ్ఞుడు, సర్వోత్కృష్టుడు, ఆత్మభవుడు. అతడు వేర్వేరు ప్రజాపతులకు వారివారికి సముచితములైన విధులను కేటాయించెను.

**వివరణము :**

సః = అతడు. 'సః' అనగా పైన వర్ణింపబడిన పరబ్రహ్మము. అతడు అనగా సర్వజ్ఞుడైన నిత్యముక్తుడగు ఈశ్వరుడు.

పర్యగాత్ = విదేశము వెడలెను, చుట్టూ వెళ్ళెను, అనగా పరబ్రహ్మము సర్వవ్యాపి, సర్వగతుడు. అమృతమగు ఆత్మకు ఆది యంత ముండదు. అందువలన బ్రహ్మము, లేక సత్యము అనాది. సాధారణముగ బ్రహ్మమును ఆకాశముతో పోల్చెదరు. శ్రుతులిట్లు ప్రకటించుచున్నవి;

'ఆకాశవత్ సర్వగత నిత్య' 'ఆకాశమువలె సర్వవ్యాపి, నిత్యుడు.' ఈ భౌతిక తలములో ఆకాశము, మహాసముద్రము — ఇవి మాత్రమే బ్రహ్మముయొక్క అనంత స్వభావమును సూచించును. ఈభౌతిక తలములో అనంతమైన ఆత్మకు అవి రెండు ప్రతినిధులు. సువిశాలమైన ఆకాశమును శ్రీ శివానంద యతీంద్రులు అలసటనొందక చూచుచుందురు. ఆకసముగూడ ఏకము, సమరసము, నిరాకారము.

శుక్రమ్ = తేజోమయమైన, పరిశుద్ధమైన, బ్రహ్మము వెలుగులకు వెలుగు, 'జ్యోతిషామపితజ్జ్యోతిః', అతడు పరంజ్యోతి. అతడు అనంతజ్యోతి. అతడు జ్యోతిర్మయుడు, అతడు జ్యోతిః స్వరూపుడు; జ్యోతిర్ ధ్యానము చేయువారు భగవంతుని ప్రకాశముగ ధ్యానింతురు,

అకాయం = దేహములేని. ఆత్మకు లింగశరీరములేదు.

లింగశరీరానికి 17 తత్త్వాలు ఉంటాయి. అవేవన: 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, 5 ప్రాణాలు, మనస్సు మరియు బుద్ధి.

చెవి, చర్మము కన్ను, ముక్కు, నాలుక — ఈ ఐదింటిని జ్ఞానేంద్రియాలు అంటారు, వాక్కు, చేతులు, కాళ్ళు, జననేంద్రియము,

గుదము—ఈఐదింటిని కర్మేంద్రియాలు అంటారు. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము—ఈ ఐదింటిని పంచప్రాణము లంటారు. ఈ సూక్ష్మశరీరం (లింగశరీరం) భౌతిక కాయాన్నుండి వేరైతే దాన్ని మనం మరణం అంటాం. ఈ లింగశరీరం అపంచీకృత భూతములతో నిర్మింప బడుతుంది. మనస్సు లింగశరీరంలో బహువేగంగా అన్ని పనులుచేస్తూ, ఇటుఅటు పోతుంది. కాని స్థూలదేహానికేమీ తెలియదు. అది జడం. స్వప్నావస్థలో పనిచేసేది లింగశరీరమే.

ప్రాణమయకోశం. విజ్ఞానమయకోశం ఈ సూక్ష్మశరీరానికి చెంది నట్టివే. జ్ఞానేంద్రియములైన చెవులు. చర్మము. కన్నులు, నాలుక, నాసిక - వీనితో శబ్ద, స్పర్శ, రూప, రస. గంధములను అనుభవిస్తాము. శ్రవణానికి అధిష్ఠానదేవత దిక్కు, అలాగే స్పర్శకువాయువు; దృష్టికి సూర్యుడు; రుచికి వరుణుడు; వాసనకు అశ్వినీ కుమారులు అధిష్ఠాన దేవతలు,

లింగశరీరాన్ని అగ్ని దహింపజాలదు. సూక్ష్మదేహం రాతి పొరల గుండకూడ సులభంగా చొచ్చుకో పోగలదు. అది గాలిలో ఎగురగలదు. అది అగ్గిలోకి దుముకగలదు, లేక సముద్రాంతర్భాగంలోకి పోగలదు. అది విద్యుత్ వేగంతోపోగలదు. అది కొలంబోనుండి లండన్‌కు ఒక్క క్షణంలో పయనించగలదు. అది పర్వత శిఖరాగ్రాన్నుండి క్రిందపడినా దానికి దెబ్బ తగలదు.

వెన్న, నెయ్యి, కాడ్‌లివర్ ఆయిల్ మన భౌతికకాయాన్ని (స్థూల దేహాన్ని) బలిసేటట్లు చేస్తాయి. అలాగే భావోద్రేకాలు, పశుత్వకాముకతలు లింగశరీరాన్ని బలిష్ఠం చేస్తాయి. భావోద్రేకాలను కాముకతలను నాశనం చేస్తే సూక్ష్మదేహం నాశనమౌతుంది. లింగశరీరానికి 'మగ, ఆడ. కాల్పనిక' అని లింగభేదాలుఉన్నాయి. స్వర్గంలో మైథునంఉందిగాని గర్భధారణంలేదు. స్వర్గంలో భోగంకోసం లింగశరీరానికి ఒక తేజోమయ దేహం అమర్చ

బడుతుంది. యోగులు ఈ లింగశరీరాన్ని స్థూలదేహాన్నుండి వేరుచేసి. ఈసూక్ష్మదేహంతో వేర్వేరు ప్రదేశాలలో సంచరిస్తారు.

అవ్రణం-హానిలేని

అస్నావిరం-కండరములులేని,

ఆత్మ హానిలేనిది, కండరములులేనిది. ఆత్మకు స్థూలదేహము లేదని సూచితమగుచున్నది.

ఈ భౌతిక కాయం వస్తుంది, ఉంటుంది, పోతుంది. స్థూలదేహం పంచభూతాల కలయిక అది జడం. దానికి ఆది, అంతం ఉన్నాయి. ఆత్మ రాదు, పోదు. ఈ దేహం మోటారుకారు వంటిది. దానికి చేతనం లేదు. ఈ దేహస్యందనానికి సారథి ఆత్మ, సర్వజ్ఞమైన ఆత్మ ఈ దేహంలో నివసిస్తుంది. అందువల్ల ఈ దేహం ఈ ఆత్మచే సచేతనమైంది. ఆత్మ దేహాన్నుండి నిర్గమించగానే స్థూలదేహం కొయ్యదుంగలా ఉండిపోతుంది. అది కుళ్ళిపోతుంది. ఆత్మ దేహమంతా వ్యాపించియున్నప్పటికి అది ప్రత్యేకంగా దేహమునుండి వేరుగా ఉండగలదు. అది సజీవ సత్యం (Living Truth) అది శుద్ధచైతన్యం (Pure Consciousness).

శుద్ధం=నిర్మలమైన, ఆత్మ అజ్ఞాన మలినమునుండి ముక్తము. ఆత్మకు కారణ శరీరములేదని సూచితమగుచున్నది. ఆదిలేని అజ్ఞానాన్ని (అనాది అవిద్యను) కారణశరీరం అంటారు. మానవునకు మాయ మూడు ఆచ్ఛాదనాలను తయారుచేసింది. అవి ఏవంటే కారణశరీరం, సూక్ష్మశరీరం. స్థూలశరీరం. మానవుడు ధరించే బనియన్ కారణశరీరం. అతడు ధరించే షర్టు లింగశరీరం. అతడు ధరించే కోటు స్థూలశరీరం, మానవుడు మాయా నిర్మితమైన త్రిశరీరాలను ధరించగానే తన పారమార్థిక దివ్యస్వభావాన్ని విస్మరిస్తాడు.

కార్మిక ప్రేరణ ఫలితమే కారణ శరీరం. అది సహజంగా కర్మ యొక్క శిశువు, అది కర్మలోజీవిస్తూ, కర్మతో పెరుగుతూ ఉంటుంది. కర్మ ప్రభావం తొలగగనే అది మాయమౌతుంది.

కారణ శరీరం చిన్న విత్తనం లాంటిది, విత్తనం తనలో చెట్టు నంతటిని ఉంచుకొంటుంది, కారణశరీరాన్ని బీజదేహమని కూడ పిలుస్తారు. స్థూలదేహం, మనస్సు, ప్రాణం, ఇంద్రియాలు- ఈ యావత్తు ఈ బీజ దేహం నుండి వస్తాయి. గొప్పగొప్ప భావాలు, ఉత్తమ ఆశయాలు మానవుని కారణశరీరంలో మాసిపోకుండా బాగా ముద్రణమౌతాయి.

శుద్ధ సత్త్వమగు మాయ ఈశ్వరుని యొక్క కారణశరీరం. మలిన సత్త్వం (రజస్సు) అయిన అవిద్య జీవుని యొక్క కారణశరీరం. మాయ ఈశ్వరుని వశంలో ఉంటుంది. జీవుడు అవిద్యచే పాలింపబడుతాడు.

అందువల్ల ఆత్మకు కారణశరీరం గాని, సూక్ష్మశరీరం గాని, స్థూల శరీరం గాని లేదు. ఆత్మ (బ్రహ్మము) ఈ మూడు దేహాలను అతిక్రమిస్తుంది. అది పంచకోశములనుండి వ్యతిరిక్తము.

అపాపవిద్ధం= పాపముచే విర్లప్తమైనది. ఆత్మ మంచి పనులచే గాని, చెడ్డ పనులచేగాని ఎట్టి వికారమును పొందదు.

ఆత్మ ధర్మాధర్మాది పాపవర్జితం. ఆత్మ ధర్మ అధర్మ రూప పాపములనుండి ముక్తము. అదివిర్లప్తము,అసంగము, అసక్తము.

కవిః= ద్రష్ట, ఋషి. ప్రత్యక్ష సందర్శనము, అపరోక్షానుభవము గలవాడు ఋషి, కవి అనగా సర్వజ్ఞుడు.

కవిః క్రాంతదర్శీ సర్వదృక్. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాదిశ్రుతేః.

కవి క్రాంతదర్శి. అతడు అతీత ద్రష్ట. అతడు సర్వద్రష్ట. "ఇతనికి అన్యముగ మరొక ద్రష్టలేడు" అని శ్రుతులు వచించుచున్నవి. ఆత్మ దేశకాల నిమిత్తములకు అతీతము. అది పురాణమైనది. అది అపరిమేయము. అది శాంతము. అది శుద్ధచైతన్యము, అది అజము, అజరము, అమృతము, అభయము. అది నిత్యము, నిర్వికారము. అది ప్రజ్ఞానఘనము, చిద్ఘనము, విజ్ఞానఘనము. అది అక్షరము అది స్వయం జ్యోతి. అది పరమవస్తువు.

మనీషీ = మనస్సునకు ప్రభువు. మనస్సును ప్రోత్సహించువాడు. అతడు సర్వజ్ఞుడైన ఈశ్వరుడు. మనీషీ మనస ఈషితా సర్వజ్ఞ ఈశ్వర ఇత్యర్థః. 'కేనేషితం పతతి ప్రేషితం మనః?= ఎవని ప్రేరణచే మనస్సు విషయములవైపు పోవును? మనస్సునకు మూలము ఆత్మ. ఇంద్రియముల సారము మనస్సు. మనస్సుయొక్క సారం బుద్ధి. బుద్ధియొక్క సారం అహంకారం. అహంకారంయొక్క సారం జీవాత్మ. సర్వానికి అధిష్ఠానం, యోని ఏంబంటే బ్రహ్మము, శుద్ధ చైతన్యము.

పరిభూః = అన్నిటికంటె పైన యుండు. ఆత్మ అన్నిటిలో అత్యుత్తమమైనది, పరిభూః సర్వేషాం పర్యుపరి భవతీతి పరిభూః.

**భగవంతునికుండే ఎనిమిది గుణాలు :**

1. సర్వజ్ఞత్వము
2. సర్వేశ్వరత్వము
3. సర్వాంతర్యామిత్వము
4. సర్వకారణత్వము
5. సర్వనియంతృత్వము
6. సర్వకర్తృత్వము

7. సర్వశక్తిమత్త్వము
8. సర్వతంత్రత్వము.

అన్నిటిని తెలుసుకోవడం, అన్నిలోకాలను గురించి, వాటి జీవులను, వారి కర్మలను గురించి తెలిసియుండడాన్ని సర్వజ్ఞత్వమంటారు. అన్నిటిని పాలించడం, జీవుల కర్మఫలాలనుపంచే శక్తియుండడాన్ని సర్వేశ్వరత్వం అంటారు. సర్వనామరూపాలను, ఇంద్రియమనస్సులను అంతర్వశీకరణ చేసికొని యుండడాన్ని సర్వాంతర్యామిత్వము అంటారు. సృష్టి, స్థితి, సంహారాలకు కారణం కావడాన్ని సర్వకారణత్వము అంటారు. నియమో ల్లంఘనలేకుండ అన్నింటిని చేయడాన్ని సర్వనియంతృత్వము అంటారు. సర్వకర్మలను ఆచరించడాన్ని సర్వకర్తృత్వము అంటారు. అనంత శక్తిని కల్గియుండడం సర్వశక్తిమత్త్వం. పరిపూర్ణ స్వాతంత్ర్యం ఉండడం సర్వ తంత్రత్వం.

స్వయంభూః = ఆత్మభవము.

స్వయంభూః స్వయమేవ భవతీతి.

యేషాముపరి భవతి యశ్చోపరి భవతి

స సర్వః స్వయమేవ భవతీతి స్వయంభూః.

తనకు తానుగ ఉన్నవాడు కావున స్వయంభువు. అతడు అన్నిటికిపైన స్వయముగ నుండుటచే స్వయంభువు. ఆత్మ దేనిపై ఆధారపడదు. సర్వము నకు ఆత్మయే అధిష్ఠానము. ఆత్మ అమృతము. అమృతమైన దానికి ఆది యుండజాలదు. అది అనాది. దానికి పుట్టుకలేదు. అది అజరము. దానికి ముసలితనము లేదు. అది అచలము. దానికి కదలిక లేదు, అది అమరము, దానికి మరణము లేదు. అది అవినాశి. దానికి నాశములేదు. ఈ స్థితిని నిరంతరమైన, తీవ్రమైన నిధిధ్యాసనమువలనను, ఏకాంతవాసమువలనను

పొందవగును. దీనిని నిష్కామ్యకర్మచే నెన్నటికిని పొందజాలము. నిష్కామ్య కర్మ చిత్తశుద్ధిని మాత్రమే నొసంగగలదు.

యథాతథ్యతః అర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః-అతడు వివిధ ప్రజాపతులకు వారివారికి సముచితమైన విధులను నిర్ణయించెను. భగవంతుడు విశ్వమును సృష్టించి, దానికి భద్రతను చేకూర్చుటకై ప్రప్రథమమున మరీచ్యాది ప్రజాపతులను సృష్టించి, వారిని ప్రవృత్తిమార్గమును అనుసరించునటుల గావించెను. తరువాత అతడు సనక సనందనాదులను సృజించి, వారిని వైరాగ్య లక్షణోపేతమైన నివృత్తి ధర్మ మార్గమును అనుసరించునటు లొనరించెను. ఈప్రపంచమును సక్రమస్థితిలో నుంచుచున్నవి ఈ రెండు వేదోక్త ధర్మములే. ఈ ధర్మము ప్రత్యక్షముగ మోక్షమునకు దారిజూపును; ఐహిక అభ్యుదయమునుగూడ కలుగజేయును. శ్రేయస్సునుకోరిన వారెల్లరు, అన్ని కులములవారు, అన్ని వర్ణములవారు అనాదిగ దీనిని అనుష్ఠించుచు వచ్చిరి, అధర్మమునకు గ్లాని కలిగినపుడు పరమేశ్వరుడు ధర్మ సముద్ధరణకై అవతరించును.

యదా యదా హి ధర్మస్య
గ్లానిర్ భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య
తదాఽఽత్మానం సృజామ్యహం — గీతా.

బాహ్యానికి భగవంతుడు జన్మ వహించినను అతడెన్నటికి జనన మరణము లకు అతీతుడు. ధర్మాన్ని గట్టిగా స్థాపించుటకు బద్ధకంకణుడైనట్లు బాహ్యా నికి కనబడినను పరమేశ్వరుడెన్నటికి సర్వకర్మలకుఅతీతుడు. ఈవిషయాన్ని తెలిసిన వానికి మరెన్నటికి జన్మలేదు. అతడు ఆత్మ జ్ఞానాన్ని పొంది జీవించియుండగనే ముక్తుడౌతాడు.

పరమేశ్వరుని జన్మ ఒక భ్రాంతి. అది అప్రాకృతము, అది దివ్య మైనది, అది భగవంతునికి విశేషమైనది. పరమేశ్వరుడు మానవాకృతితో కనబడినప్పటికి, అతని దేహము చిన్మయము. పరమేశ్వరుని దేహము చైతన్యమయం (full of consciousness) పంచభూతములతో నిర్మితమైన మానవ దేహంలాంటి జడపదార్థముగాదు.

ఈశావాస్యోపనిషత్తునందు 18 మంత్రములు గలవు. మొదటి ఎనిమిది మంత్రములు ఆత్మజ్ఞానతత్త్వమును వర్ణించును. జిజ్ఞాసువులు ధ్యానసమయ మున ఈశ్లోకములను స్మరింపవచ్చును.

ఈశోపనిషత్తు మానవకోటికి ఇచ్చే సందేశమేమిటి?

"హే సౌమ్య, అమృత స్వరూపా! ధీరుడవగుము. నీ ముఖ్య స్వభావము సచ్చిదానందము. బాహ్యవేషమగు ఈ నశ్వరమైన భౌతికాచ్ఛాదనము (అన్నమయకోశము) మాయ యొక్క మిథ్యా సృష్టి. ఈ మాంస పంజరమునుండి వెలు పలకురమ్ము. నీవు లింగరహిత ఆత్మవు. నీవు హృదయాంత రాళములందున్న ఆత్మవు. అట్లు గావింపుము. అట్లు అనుభ వింపుము. నీ జన్మహక్కుకై ఇప్పుడే, ఈ క్షణమునుండియే పోరాడుము. నీవు ఆత్మవు. తత్త్వమసి. ప్రియ ఆత్మన్, భావింపుము, దృఢ నిశ్చయము జేసికొనుము, తెలిసికొనుము, సాక్షాత్కారము నొందుము."

# తొమ్మిదవ మంత్రము

**అంధం తమః ప్రవిశంతి**
**యే అవిద్యాముపాసతే**
**తతో భూయ ఇవ తే**
**తమో య ఉ విద్యాయాం రతాః**

**టీక :—**

**అంధం** = గ్రుడ్డి; **తమః** = చీకటి; **ప్రవిశంతి** = ప్రవేశింతురు; **యే** = ఎవరు; **అవిద్యాం** = అవిద్యను; **ఉపాసతే** = ఉపాసింతురో, **తతః** = దానికంటే; **భూయః** = ఘనతరమైన, **ఇవ** = వలె, **తే** = వారు; **తమః** = చీకటి, **యః** = ఎవరు; **ఉ** = నిజముగ; **విద్యాయాం** = విద్యయందు, **రతాః** = రతులైనవారు.

**భావము:—**

ఎవరు అవిద్యను మాత్రమే ఉపాసించెదరో వారు గుడ్డి చీకటిలో పడెదరు; ఎవరు విద్యను మాత్రమే ఉపాసించెదరో వారు ఘనతర తిమిరమున పడెదరు.

**వివరణము :—**

అంధం తమః= గ్రుడ్డి చీకటి, అనగా అజ్ఞానము, ప్రవిశంతి =ప్రవేశించెదరు.

మే అవిద్యాం ఉపాసతే= ఎవరు అవిద్యను ఉపదేశించెదరో వారు. ఇచ్చట అవిద్య అంటే కర్మలు. కామ్యఫలాలను నిరీక్షిస్తూ ఆచరించే అగ్నిహోత్రాది వేదోక్త క్రతువులే అవిద్య. అవంటి అనగా ఈ అవిద్యను

ఆరాదింధించే వారు గాఢాంధ కారమున ప్రవేశిస్తారు. అటువంటి కర్మలు చేసేవారు పితృలోకాన్ని పొందుతారు. పితృదేవతలను పూజించే వారు,పితృ వతలకు సంబంధించిన శ్రాద్ధము, తదితర క్రతువులను చేయువారు అగ్ని ష్వాత్తాది పితృదేవలను చేరుతరు. అనగా పితృకార్యములు చేయువరు (పితృదేవతలు) పితృలోకమును పొందెదరు. వారు చేసిన కర్మ ఫలము లను అనుభవించిన తరువాత వారు పితృలోకమునుండి మర్త్యలోకమున బడుదురు. అనగా అవిద్యను మాత్రమే ఉపాసించువారు గ్రుడ్డి చీకటిలో పడెదరు. అజ్ఞానములో పడుటచే వారికి జ్ఞాన ప్రాప్తి లేదు. జ్ఞానము లేమిచే వారికి మోక్ష ప్రాప్తి లేదు,

తతో భూయ ఇవ తే తమో య ఉవిద్యాయాం రతాః= ఎవరు' విద్య' యందు ఆసక్తులై యుందురో వారు పై వారి కంటెను గాఢ మగు అంధకారమును ప్రవేశించెదరు.

ఇచ్చట 'విద్య' అంటే ఏమిటిఃఇచ్చట అపర జ్ఞానం విద్యయని పిలు వబడింది దేవతలను గూర్చిన జ్ఞానాన్ని విద్య యన్నారు, అటువంటి జ్ఞానం వల్ల దేవలోకం పొందబడుతుంది. అనగా విద్యోపాసకులు దేవ లోక ప్రాప్తిని పొందుతరు. విద్యోపాసనా ఫలములు వ్యయమైన వెంటనే వారు కూడ దేవలోకన్నుండి సంసారానికి తిరిగి వస్తారు. కర్మలను వదిలివేసి, దేవతలను గూర్చిన జ్ఞానాన్నే అన్వేషించేటటువంటి వరు అవిద్యోపాస కులు ప్రవేశించే తిమిరానికంటె ఘనతర తిమిరంలో ప్రవేశిస్తారు.

ప్రశ్నః- అవిద్యను మాత్రం ఉపాసించే వారికంటె విద్యను మాత్రమే ఉపాసించేటటు వంటి వరు వారికంటె (అవిద్యోపాసకులకంటె) వీరు (విద్యోపాసకులు) ఘనతర తిమిరములో ఎట్లా ప్రవేశిస్తారు?

**ఉత్తరము** త్రివేదాలను (ఋక్, సామ' యజుర్వేదాలను) తెలిసినవరు, సోమ రసాన్ని పానంచేసినవారు, తద్వారా పాపవిముక్తులు

అగ్నిష్టో మాది యజ్ఞాలు గావించి, వసువులు మున్నగు దేవతల్ని పూజించి, స్వర్గాన్ని తమ యజ్ఞ ఫలంగా వాంఛించి, శతిమఖుడైన ఇంద్రుని లోకానికి జని అచ్చట అప్రాకృతములైన భోగాలను అనుభవిస్తారు. వారు విశాల మైన స్వర్గలోకంలో భోగాలను అనుభవించి, తమ పుణ్యం క్షీణించిన పిదప మర్త్యలోకాన్ని ప్రవేశిస్తారు. ఈ విధంగా వారు త్రయీ ధర్మాన్ని అనుసరిస్తూ (అనగా మూడు వేదాలలో చెప్పబడిన కేవల వైదిక కర్మలను ఆచరిస్తూ,) స్వర్గానికి ఏగుతూ, మరలా భువికి దిగి వస్తూ, ఎక్కడ. ఎప్పుడు ముక్తిని పొందజాలరు. అందువల్ల విద్యను మాత్రమే ఉపాసించేవారు (అంటే వేదోక్త కర్మలను వదలి దేవతోపాసనే చేసేటటువంటి మర్త్యులు) కేవల అవిద్యోపాసకులు ప్రవేశించే తిమిరానికంటె ఘనతర తిమిరాన ప్రవేశిస్తారని చెప్పబడింది.

కర్మను (అవిద్యను,)విద్యను ఒక్కొక్క దానిని వేర్వేరుగా ఉపాసించునపుడు కర్మ యొక రకమగు ఫలాన్ని (పితృలోక ప్రాప్తిని), విద్య మరియొక రకమగు ఫలాన్ని (దేవలోక ప్రాప్తిని) ఇస్తాయి' ఈ మంత్రంలో కర్మ విద్యల సముచ్చయ ఉపాసన సిఫారసు చేయబడింది.

కూర్మ పురాణంలో ఇలా ఉంది: "విష్ణువును తప్ప తక్కిన దేవతలను పూజించే వారు అంధ తమస్సులో ప్రవేశించడం తథ్యం కాని. అటువంటివారిని తిట్టి, దండించి, వారి దోషాలను దిద్దడానికి యత్నింపనివారు ఇంకా గ్రుడ్డి చీకటిలోకి పోవడం నిస్సంశయం".

కాబట్టి,సర్వ కిల్బిషరహితుడైన శ్రీమన్నారాయణుని సత్య స్వరూపాన్ని తెలుసుకొన్న మహనీయులు, మిథ్యా దేవతలను ఆరాధించే వారిని దండించే సత్పురుషులు వాస్తవంగా సుజనులు. అటువంటి మహాపురుషులు అజ్ఞాన

దుఃఖాలను స్వభావంగాగల అసత్యాన్ని పోషించడంవల్ల అజ్ఞానాన్ని, దుఃఖాన్ని దాటి, జ్ఞానము, ఆనందము స్వభావముగ గల సత్యాన్ని తెలుసుకొని ఆత్మ జ్ఞానాన్ని, నిత్యానందాన్ని పొందుతారు.

భగవానుడు భగవద్గీతలో ఇలా అంటారు:

యాంతి దేవవ్రతా దేవాన్
పితౄన్యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యాః
యాంతి మద్యాజినోఽపి మామ్.

దేవతోపాసనలు చేయువారు దేవతలకడకు, పితృదేవతల నుపాసించువారు పితృదేవతలకడకు, భూతవిశేషములను భజించువారు భూతములకడకు పోవుదురు. నన్ను యజించువారు నన్నే పొందుదురు,

దేవతలయందు నియమము, భక్తిగలవారు దేవతలను పొందుదురు. పితృభక్తులు అగ్నిష్వాత్తాది పితృదేవతలను పోయి చేరుదురు, భూతములను పూజించువారు వినాయక మాతృగణ చతుర్భగినీ మొదలగు వాటిని పోయి చేరుదురు. ఇటువలె మద్యాజులు నన్నే పొందుదురు. ఇట్లు ప్రయాస అన్ని పూజలకు సమానమే అయియుండినను వీరు భగవంతుని అజ్ఞానముచే భజింప కున్నారు. అందువల్ల వారు అల్ప ఫలమును పొందువారు అగుచున్నారని అర్థము. నా భక్తులకు (విష్ణుభక్తులకు) పునః అనావృత్తి, అనగా వెనుకకు మరలని అనంత ఫలమగుననుట మాత్రమేకాదు; భగవంతుని ఆరాధింపుటయు సులభము, సుసుఖము.



# పదవ మంత్రము

అన్యదేవాహుర్విద్యయా
అన్యదాహురవిద్యయా
ఇతి శుశ్రుమ ధీరాణాం
యే నః తద్విచచక్షిరే.

**టీక :**

అన్యత్ = వేరొకటి ఏవ = నిశ్చయముగ, ఆహుః = చెప్పెదరు, విద్యయా = విద్యవలన, అన్యత్ = ఇతరము, ఆహుః = చెప్పెదరు, అవిద్యయా = అవిద్యవలన, ఇతి = ఇట్లు, శుశ్రుమ = వింటిమి, ధీరాణాం = ప్రాజ్ఞులనుండి, యే = ఎవరు, నః = మనకు; తత్ = దానిని, విచచక్షిరే = వివరించిరి.

**భావము :**

విద్య (దేవతాజ్ఞానము) వలన ఒకటి లభ్యమగు ననియు. అవిద్య (కర్మక్రతువుల ఆచరణ)చే మరొకటి లభ్యమగుననియు చెప్పబడినది. మనకు ఈ రెండింటిని బోధించిన ప్రాజ్ఞులనుండి మనము ఇట్లు వింటిమి.

**వివరణము :**

అన్యత్ ఏవ ఆహుః విద్యయా - విద్యవలన ఒకటి లభ్యమగునని చెప్పబడినది. విద్యయనగా దేవతలను గూర్చిన జ్ఞానము. అది అపరజ్ఞానము, ఈ విద్యోపాసనవలన దేవలోక ప్రాప్తి కలుగును. 'విద్యయా దేవలోకః' ఇది ఆధ్యాత్మిక ఉపదేష్టల అభిప్రాయము. కర్మ జ్ఞానములను గురించి ఆధ్యాత్మిక ఆచార్యులు మనకు బోధించినది ఇది. ఈ విధముగ, శిష్యుడు గురువువలన వినెను,

అన్యత్ ఆహుః అవిద్యయా - అవిద్యచే మఱియొకటి లభ్య మగునని చెప్పబడినది. అవిద్య యనగా ఫలాపేక్షతో నొనర్పబడు అగ్నిహోత్రాది వైదిక కర్మలు, ఈ అవిద్యోపాసనవలన పితృలోక ప్రాప్తి కలుగును, 'కర్మణా పితృలోకః' ఇతి శ్రుతేః, ఇది ఆధ్యాత్మిక గురువుల మతము. తన గురువువలన చేలుడు విననిది ఇది.

ఇతి శుశ్రుమ ధీరాణాం యే నః తద్విచచక్షిరే - మనకు ఈ రెండింటిని బోధించిన ప్రాజ్ఞులనుండి మనము ఇట్లు వింటిమి, గురువులు మనకు విద్య (దేవతోపాసన) ను గూర్చియు, అవిద్య (వైదికకర్మ) ను గూర్చియు బోధించిరి. విద్యనుగూర్చి, అవిద్యనుగూర్చి మనము ఇట్లు ఆలకించితిమి, 'ఇత్యేవం శుశ్రుమ శ్రుతవంతో వయం ధీరాణా ధీమతాం వచనం.'

---

## పదునొకండవ మంత్రము

**విద్యాం చావిద్యాం చ**
**యస్తద్ వేదోభయం సహ**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా**
**విద్యయాऽమృతమశ్నుతే.**

**టీక :**

విద్యాం = విద్యను. చ = మఱియు, అవిద్యాం = అవిద్యను, చ = మఱియు, యః = ఎవరు, తత్ = దానిని; వేద = తెలిసికొందురో; ఉభయం = రెండింటిని; సహ = తోగూడ; అవిద్యయా = అవిద్యవలన; మృత్యుం = మృత్యువును; తీర్త్వా = దాటి; విద్యయా = విద్యవలన; అమృతం = అమృతమును; అశ్నుతే = పొందును.

**భావము :**

విద్యను, అవిద్యను ఒకేపరి తెలిసికొనునతడు అవిద్యచే మృత్యువును జయించి, విద్యచే అమృతత్వమును పడయును.

**వివరణము :**

విద్యాం చా విద్యాం చ = విద్యాం చ అవిద్యాం చ = విద్యను అవిద్యను. ఇచ్చట విద్యయనగా అపరజ్ఞానము. అనగా దేవతలను గూర్చిన జ్ఞానము, అవిద్య యనగా ఫలాపేక్షతో చేయబడు అగ్నిహోత్రాది వైదిక కర్మలు.

యస్తద్ వేదోభయం = యః తత్ వేద ఉభయం = ఎవడు సమకాలములో రెండింటిని తెలిసికొనునో, కర్మ (అవిద్య), విద్యలను ఒక్కొక్క దానిని వేర్వేరుగా ఆచరించినప్పుడు అవి విభిన్న ఫలాలను

ఇస్తాయి. కాబట్టి కర్మ, విద్యల సముచ్చయ ఉపాసన సూచింపబడింది. ఈ విధమైన సముచ్చయ ఉపాసన సక్రమంగా ఫలాన్నిస్తుంది.

అవిద్యయా మృత్యుం తీర్త్వా = అవిద్యచే మృత్యువును జయించి. ఇక్కడ 'మృత్యువు' అంటే చావుగాదు, మృత్యువు అంటే కర్మ, ప్రాపంచిక జ్ఞానం, 'మానవుడు అవిద్యచే మృత్యువును దాటుతాడు' అంటే అతడు అగ్నిహోత్రాది వైదిక కర్మల ఆచరణచే ప్రాపంచిక కర్మలనుండి ముక్తి పొందుతాడు.

విద్యయా అమృతమ్ అశ్నుతే = విద్యచే అమృతత్వమును పొందును, ఇక్కడ 'విద్య' యను పదమునకు 'జ్ఞానము' అని అర్థము కాదు, విద్యయనగా అపరజ్ఞానం, దేవతలను గూర్చిన జ్ఞానం, జ్ఞానం తిమిరానికి దారితీయదు గదా: (చూడుము మంత్రము 9) అలాగే 'అమృతం' అనేదానికి 'మోక్షం' అని అర్థం చెప్పలేం. ఎందువల్లనంటే మోక్షాన్ని ఇవ్వగల్గింది జ్ఞానమొక్కటే. దేవతలనుగూర్చిన అపర జ్ఞానం వల్ల మోక్షం పొందలేము, కాబట్టి అమృతమును పొందడం అంటే దేవలోకప్రాప్తిని పడయుటం అని అర్థం.

అందువల్ల ఏక కాలంలో విద్యను, అవిద్యను తెలిసికొనునతడు వైదిక కర్మలచేత ప్రాపంచిక కర్మలనుండి ముక్తుడౌతాడు, మఱియు దేవతార్చనవలన అమృతత్వమును (దేవతలతో సంసర్గాని) పొందుతాడు, దేవలోక ప్రాప్తి అనంతరం ఇష్ట సిద్ధి (మోక్షం) క్రమంగా కలుగుతుంది.

'మోక్షం' అంటే ఏమిటి? మోక్షం మన అసలు స్వభావం (our true nature). ఈ సత్యాన్ని ప్రత్యక్షమైన అంతర్జ్ఞాన అనుభవం ద్వారానే తెలిసికోవాలి. ఆత్మధ్యానంచేసి, అజ్ఞానమనే తెరను తెగకోయాలి. అప్పుడు మనం దివ్య వైభవంతో, నిర్మలత్వంతో విలసిల్లుతాము, మోక్షం ఆత్మ జ్ఞానంవల్లనే పొందబడుతుంది. అది జనన మరణాల నుండి విమోచనం. బ్రహ్మమును తెలిసికొన్నవాడు బ్రహ్మము ఔతాడు, అందువల్ల బ్రహ్మజ్ఞానమే మోక్షానికి సాధనం.

# పన్రెండవ మంత్రము

**అంధం తమః ప్రవిశంతి**
**యే ఽ సంభూతిముపాసతే**
**తతో భూయ ఇవ తే**
**తమో య ఉ సంభూత్యాం రతాః**

టీక :—

**అంధం** = గ్రుడ్డి, **తమః** = చీకటి, **ప్రవిశంతి** = ప్రవేశింతురు, **యే** = ఎవరు, (అ) సంభూతిం = అవ్యక్త ప్రకృతిని, **ఉపాసతే** = ఉపాసించు, **తతః** = దానికంటె, **భూయః** = ఘనతరమైన; **ఇవ** = వలె, **తే** = వారు, **తమః** = చీకటి, **య** = ఎవరు, **ఉ** = నిజముగ, **సంభూత్యాం** = కార్యబ్రహ్మమున, **రతాః** = రతులు.

**భావము :—**

ఎవరు అవ్యక్త ప్రకృతినే ఉపాసించెదరో వారు గ్రుడ్డి చీకటిలో పడెదరు. ఎవరు కార్యబ్రహ్మమునే ఉపాసించెదరో వారు ఇంకను ఘనతర తిమిరమున పడెదరు.

**వివరణము :**

అంధం తమః ప్రవిశంతి యే అసంభూతిమ్ ఉపాసతే- ఎవరు అసంభూతిని ఉపాసించెదరో వారు గ్రుడ్డి చీకటిలో పడెదరు. 'అసంభూతి' అనగా సంభూతి కానిది. సంభూతి అంటే పుట్టుక. అసంభూతి అనగా పుట్టుకలేని ప్రకృతి. అసంభూతి అంటే కారణరహిత ప్రకృతి. దీన్నే అవ్యక్తం అంటారు. అవ్యక్తంలో త్రిగుణాలు (సత్త్వము, రజస్సు తమస్సు) నిశ్చల స్థితిలో ఉంటాయి. దీన్ని గుణసామ్య అవస్థ అంటారు.

ఇది అన్నిటికి కారణం. విత్తనంలో చెట్టు ఉండే లాగున అవ్యక్తంలో ప్రపంచం అంతా బీజస్థితిలో ఉంటుంది. అవ్యక్త ప్రకృతిని పూజించడాన్ని అవ్యక్తోపాసన అంటారు, అవ్యక్తంకూడ అజ్ఞానమే. అవ్యక్తంలో అన్ని వాంఛలకు, కర్మలకు బీజం ఉంది. అందువల్ల ఎవరు అవ్యక్త ప్రకృతిని ఉపాసిస్తారో వారు గ్రుడ్డి చీకటిలో పడుతారు.

తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాం రతాః = ఎవరు సంభూతినే ఉపాసించెదరో వారు ఇంకను ఘనతర తిమిరమున పడెదరు.

సంభూతి అంటే హిరణ్యగర్భుడు. అతడు అవ్యక్తసంభవుడు, అతడు అవ్యక్త ప్రకృతి యొక్క కార్యం. కాబట్టి సంభూతిని ఉపాసించేవారు అవ్యక్త ప్రకృతిని ఉపాసించేవారు పడే పెనుచీకటిలో కంటె ఘనతరంలో పడుతారు.

అధునా వ్యాకృతా వ్యాకృతోపాసనయోః
సముచ్చిచీషయా ప్రత్యేకం నిందోచ్యతే.

ప్రస్తుతము వ్యక్తోపాసన, అవ్యక్తోపాసనల సముచ్చయము నాచరింపజేయు నుద్దేశ్యముతో వానిని ప్రత్యేకముగ నాచరించుట ఈ మంత్రములో నిందింపబడినది.

సంభూతి, హిరణ్యగర్భుడు, కార్యబ్రహ్మము, సూత్రాత్మ — ఇవి పర్యాయపదములు,

అసంభూతి, అవిద్య, పరాశక్తి, ప్రకృతి, మూలప్రకృతి, అవ్యక్తము ఆదిశక్తి, ఆదిమాయ, ప్రధానము — ఇవన్నియు పర్యాయ పదములు.



# పదమూడవ మంత్రము

**అన్యదేవాహుః సంభవాత్**
**అన్యదాహురసంభవాత్**
**ఇతి శుశ్రుమ ధీరాణాం**
**యే నః తద్విచచక్షిరే**

టీక :—

అన్యత్ = అన్యమైనది ఏవ = నిశ్చయముగ, ఆహుః = చెప్పుచున్నారు, సంభవాత్ = కార్యబ్రహ్మమువలన, అన్యత్ = వేరొకటి, ఆహుః = చెప్పుచున్నారు, అసంభవాత్ = అవ్యక్తప్రకృతివలన, ఇతి = ఈవిధముగ, శుశ్రుమ = వింటిమి, ధీరాణాం = ప్రాజ్ఞులవల్ల, యే = ఎవరు, నః = మనకు; తత్ = దానిని; విచచక్షిరే = వివరించిరి.

**భావము:—**

కార్యబ్రహ్మమును ఉపాసించుటవలన ఒకటియు, అవ్యక్త ప్రకృతిని ఉపాసించుటవలన మరొకటియు లభ్యమగునని చెప్పబడినది. మనకు దీనిని బోధించిన ప్రాజ్ఞుల వలన ఇట్లు వింటిమి.

**వివరణము:—**

అన్యత్ ఏవ ఆహుః సంభవాత్ = కార్యబ్రహ్మమును ఉపాసించుటవలన ఒకటి లభ్యమగునని చెప్పబడినది.

కార్యబ్రహ్మమును ఉపాసించే వారికి దూరదర్శనము, దూరశ్రవణము, మనోజయము, కామరూపము, పరకాయ ప్రవేశము, ఇచ్ఛామృత్యువు మున్నగు సిద్ధులేగాక అణిమ, మహిమ, లఘిమ. గరిమ, ప్రాప్తి. ప్రాకామ్యము, వశిత్వము, ఈశిత్వము మున్నగు అష్టసిద్ధులు కలుగును.

అన్యాత్ ఆహుః అసంభవాత్ = అవ్యక్త ప్రకృతిని ఉపాసించుటవలన మరియొకటి లభ్యమగునని చెప్పబడినది. అవ్యక్త ప్రకృతిని ఉపాసించువారు ప్రకృతి లయమును పొందుతారు. అచేతనమైనట్టి అవ్యక్త ప్రకృతిని ధ్యానించడంవల్ల మోక్షం సిద్ధించదు. సరియైన మార్గాన్ని సూచించేందుకు ఏర్పడినటువంటి శాస్త్రం మోక్షాన్వేషికి (ఆ మార్గం తెలియనట్టి వానికి) ఒక అచేతనమైనట్టి ఆత్మను (మూల ప్రకృతిని) నిజమైన ఆత్మగ చూపించినట్లయితే అతడు గుడ్డిఎద్దు తోక పట్టుకొని తన గ్రామాన్ని చేరలేని రీతిగ, ఎన్నటికీ అంత్యవిమోచనాన్ని, అంటే ఆత్మ సాక్షాత్కారాన్ని పొందలేడు. అవ్యక్త ప్రకృతి ప్రపంచ సృష్టికర్త కాదు. అది అచేతనం. గుడ్డి ప్రకృతిని ఆరాధించడంవల్ల విముక్తి కల్గడం అసంభవం.

ఇతి శుశ్రుమ ధీరాణాం యే నః తద్ విచచక్షిరే= మనకు దీనిని బోధించిన ప్రాజ్ఞులవలన ఇట్లు వింటిమి.

ఈ విధముగ మనకు గురువులు హిరణ్యగర్భ, అవ్యక్తప్రకృతులను వేర్వేరుగ పూజించుటవలన కలుగు ఫలితాలను తెల్పారు.

యత ఏవమతః సముచ్చయః సంభూతి అసంభూతి ఉపాసన యోర్యుక్త ఏవైక పురుషార్థ త్వాచ్చే త్యాహ — అందువల్ల సంభూతి. అసంభూతి ఉపాసనల సముచ్చయము ఉచితమైనది, ఏకపురుషార్థ మూలకమగుటచేతగూడ సముచ్చయము సరియైనదే. ఈ విషయము రాబోవు శ్లోకమున (పదునాల్గవ మంత్రమున) చెప్పబడినది.



# పదునాల్గవ మంత్రము

**సంభూతిం చ వినాశం చ**
**యస్తద్ వేదోభయం సహ**
**వినాశేన మృత్యుం తీర్త్వా**
**సంభూత్యాఽమృతమశ్నుతే.**

**టీక:—**

సంభూతిం= అవ్యక్తప్రకృతిని; చ = మరియు, వినాశం=కార్య బ్రహ్మమును, చ= మరియు, యః=ఎవరు, తత్=దానిని, వేద = తెలిసి కొనునో; ఉభయం=రెండింటిని, సహ=తోగూడ; వినాశేన=కార్య బ్రహ్మముచే, మృత్యుం=మృత్యువును, తీర్త్వా=దాటి, సంభూత్యాం= అవ్యక్త ప్రకృతివలన, అమృతం=అమృతమును, అశ్నుతే=పొందును.

**భావము:—**

ఎవడు అవ్యక్త ప్రకృతిని, కార్యబ్రహ్మమును ఒకటిగ పూజించునో అతడు కార్యబ్రహ్మముయొక్క ఉపాసనవలన మృత్యువును జయించి, అవ్యక్త ప్రకృతి ఉపాసనవలన అమృతత్వమును పడయును.

**వివరణము :—**

సంభూతిం చ వినాశం చ = అసంభూతిని మరియు కార్య బ్రహ్మమును.

సంభూతిం చ వినాశం చ ఇతి అత్ర అవర్ణలోపేన నిర్దేశో ద్రష్టవ్యః ప్రకృతి లయ ఫల శ్రుత్యనురోధాత్. సంభూతిని మరియు

వినాశమును' అను పద సమూహము ప్రకృతి లయఫలము చెప్పిన శ్రుతికి అనురోధముగ నుండుటవలన అవర్ణలోపమును పూరించుకొనవలసినదిగ నిర్దేశింపబడినట్లు తెలిసికొనవలెను. ఈ మంత్రమున సంభూతి అనగా అసంభూతి. వినాశము అనగా హిరణ్యగర్భుడు, మూర్తము (concrete) నకు బదులు అమూర్తము (abstract) ప్రయోగింపబడినది.

యః తత్ వేద ఉభయం సహ - ఎవడు రెండింటిని ఒకటిగ పూజచేయునో, అవ్యక్త ప్రకృతిని, కార్యబ్రహ్మమును ఎవడు ఒకటిగ ఉపాసించునో, అనగా అవ్యక్త ప్రకృతి, కార్యబ్రహ్మముల సముచ్చయ ఉపాసన చేయునో,

వినాశేన మృత్యుం తీర్త్వా= వినాశమువలన మృత్యువునుదాటి. వినాశము అనగా కార్యబ్రహ్మము. ఇచ్చట మృత్యువు అనగా పరిమితములైన శక్తులు, కోరికలు, దుర్గుణములు మొదలగునవి. అతడు కార్యబ్రహ్మోపాసనవలన మృత్యువును దాటును, అనగా కార్యబ్రహ్మమును ఉపాసించుట వలన అతడు ఐశ్వర్యము (సిద్ధుల) ను పొందును.

సంభూత్యాం అమృతం అశ్నుతే = అవ్యక్త ప్రకృతి ఉపాసన వలన అతడు అమృతమును పొందును. ఇచ్చట సంభూతి అనగా అసంభూతి, ఇచ్చట 'అమృతము' అనగా మోక్షముగాదు, అమృతము అనగా ప్రకృతి లయము.

అవ్యక్త ప్రకృతిని, కార్యబ్రహ్మమును ఒకటిగ పూజచేయునతడు కార్యబ్రహ్మమును పూజించుటవలన ఐశ్వర్యము (సిద్ధుల) ను పడసి, అవ్యక్తోపాసనద్వారా ప్రకృతి లయమును పొందును, తరువాత క్రమమార్గమున ముక్తిని పొందును.

12, 13, 14 మంత్రములలోని భావములు 9, 10, 11 మంత్రములలోని భావములను పోలియున్నది.

11 వ మంత్రమున అవిద్య, విద్యల సముచ్చయ ఉపాసన ఎట్లు సూచింపబడినదో అట్లే ఈ మంత్రమున (14 వ మంత్రమున) హిరణ్య గర్భ మూల ప్రకృతుల సముచ్చయ ఉపాసన సిఫారసు చేయబడినది.

ప్రకృతిలయ పర్యంత సమస్త ఫలము (గో, భూమి, సువర్ణాదులు) మానుష సంపత్తియని, దైవీసంపత్తియని శాస్త్రము చెప్పుచున్నది. ఇంత వరకు సంసారగతి, ఏడవ మంత్రమున, 'ఆత్మైవా భూద్విజానతః' యందు ఏషణాత్రయ సంపూర్ణ త్యాగఫలము సర్వాత్మభావమని నుడవబడినది. ఇవ్విధమున ప్రవృత్తి, నివృత్తి ద్విప్రకార ధర్మములు వేదప్రకాశితములే. విధి ప్రతిషేధలక్షణోపేతమైన ప్రవృత్తి ధర్మము. నివృత్తి లక్షణము బృహదారణ్యకమున వర్ణింపబడినది. అందు విద్యను, అవిద్యను ఒకేపరి తెలుసుకొనునతడు అవిద్యవలన మృత్యువును దాటుననియు, విద్యవలన అమృతమును పొందుననియు తెలుపబడినది.

ప్రస్తుతము (15 వ మంత్రమున) ఏ మార్గముద్వారా అమృతత్వము ప్రాప్తించునో చెప్పబడును, ఏది సత్యమో అది ఆదిత్యుడు, ఈ ఆదిత్య మండలమునందలి పురుషుడు, దక్షిణనేత్రమునందలి పురుషుడు ఇరువురు సత్యమే. బ్రహ్మోపాసన సల్పునట్టి, శాస్త్రోక్తకర్మల నాచరించునట్టి సాధకుడు అంతకాల ప్రాప్తియందు, ఆదిత్యమండలస్థుండై ఆత్మకోసమై 'హిరణ్మయేన పాత్రేణ' అను మంత్రముద్వారా ఆత్మప్రాప్తి ద్వారమునకై యాచించుచున్నాడు.

---

# పదునైదవ మంత్రము

**హిరణ్మయేన పాత్రేణ**
**సత్యస్యాపిహితం ముఖం**
**తత్త్వం పూషన్నపావృణు**
**సత్యధర్మాయ దృష్టయే.**

**టీక :—**

హిరణ్మయేన = బంగారుమయమైన దానిచే; పాత్రేణ = పాత్రచే; మూతచే, సత్యస్య = బ్రహ్మముయొక్క; అపిహితం = కప్పబడియున్నది, ముఖం = వదనము, తత్త్వం (తత్ + త్వం) = సత్యము (అదియే నీవు) పూషన్ = ఓ సూర్యభగవానుడా; అపావృణు = తెరవుము, సత్యధర్మాయ = సత్యమును ఆరాధించుచున్న నాకు, దృష్టయే=దర్శించుటకై

**భావము:—**

సత్యము యొక్క వదనము ఒక బంగారు భాండముచే కప్పబడియున్నది. ఓ పూషన్, సత్యమును అనుష్ఠించుచున్న నాకు తత్త్వదర్శనార్థము తెరను తొలగించుము.

**వివరణము :—**

హిరణ్మయేన పాత్రేణ = బంగారు భాండముచే, అనగా సూర్యమండలముచే.

సత్యస్య అపిహితం ముఖం = సత్యముయొక్క వదనము కప్పబడియున్నది. అంటే సూర్యమండలముచే సత్యము యొక్క వదనము కప్పబడియున్నది,

తత్త్వం పూషన్ అపావృణు - ఓ సూర్యభగవాన్, తత్త్వ మును ప్రకాశపరచుము.

సత్య ధర్మాయ = సత్యమును ఆరాధించుచున్నట్టి నాకు.

దృష్టయే = చూడగలందులకై, సత్యము యొక్క వదనమును దర్శించ గలందులకై.

ఈ మంత్రము ప్రాణము పోవుచున్న మానవుని ప్రార్థనగ కనబడు చున్నది.

హేభగవన్, ఓ సూర్యనారాయణ, నీవు పూషణుడవు. నీవు సర్వ లోకమును పోషించువాడవు. నీ ముఖమునుండి తెరను తొలగించుము. నీ దర్శనము పొంది, నేను ఆత్మ సాక్షాత్కారమును పడయుదును గాక। నేను సత్యధర్ముడను. నేను సత్యవ్రతుడను. నిరంతరము నిన్నుధ్యానించుచున్నాను సర్వదా సత్యమును ధ్యానించుచున్నాను. నిన్ను కప్పియున్న తెరను తొల గించి, నాకు సమ్యగ్దర్శన భాగ్యము నొసగుము,

---

# పదునారవ మంత్రము

పూషన్ ఏకర్షే యమ సూర్య
ప్రాజాపత్య వ్యూహరశ్మీన్ సమూహ
తేజో యత్తేరూపం కల్యాణతమం
తత్తే పశ్యామి యోఽసావసౌ
పురుషః సోఽహమస్మి.

**టీక:—**

పూషన్ = ఓ సూర్యదేవా. ఏకర్షే = ఏకైకఋషీ. యమ = ఓ నిగ్రహా, సూర్య= ఓసూర్యా, ప్రాజాపత్య = ఓ ప్రజాపతి తనయా వ్యూహ = వెదజల్లుము, రశ్మీన్ కిరణములను, సమూహ = గుమికూడ చేయుము, తేజః = కాంతిని, యత్ =ఏమిటో తే = నీయొక్క, రూపం= రూపమును; కల్యాణతమం = మిక్కిలి మంగళప్రదమైన. తత్ = అది తే = నీయొక్క; పశ్యామి= నేను చూచుచున్నాను; యః = ఎవరు; అసౌ ఈ; అసౌ = ఈ; పురుషః =పురుషుడు; సః = అతడు; అహం = నేను అస్మి=ఉన్నాను.

**భావము:—**

ఓ పూషన్, అద్వితీయ ఋషీ, సర్వలోకనిగ్రహా, సూర్యభగవన్. ప్రజాపతి తనయా, నీ కిరణములను వికిరణము సేయుము. నీ ప్రజ్వలిత కాంతిని ఉపసంహరింపుము. నేను నీదు దివ్యరూపమును దర్శించుచున్నాను. అతడే నేను. (సోఽహం), నీయందలి పురుషుడనే నేను:

**వివరణము :—**

ఈమంత్రముకూడ చనిపోవుచున్నవాని ప్రార్థనయే,

పూషన్ - హే పూషన్ — ఓ పూషనుడా. పూషనుడనగా పోషకుడు. పూషనుడు సూర్యభగవానుడు. అతడు జగద్సంవర్ధకుడు అతడు జగజ్జ్యోతి. జగతఃపోషణాత్ పూషా; జగత్తును పోషించు కారణమున సూర్యుడు పూషణుడు.

ఏకర్షే — ఏకైకఋషీ, ఓ అద్వితీయఋషీ. ఏకర్షే అనగా ఆకసపథమున ఏకైక ప్రయాణీకుడా. ఓ సూర్యనారాయణా.

యమ = ఓ యమధర్మ ప్రభూ. సర్వులను నిగ్రహించు ప్రభూ ఓ ఈశా. సర్వస్య సంయమనాద్ యమః.

సూర్య = ఓ సూర్యభగవన్. ఓ కశ్యప — అదితీ తనయా; మానవుల సత్కార్మలకు, దుష్కార్మలకు నిరంతర సాక్షి రశ్మీనాం ప్రాణానాం రసానాంచ స్వీకరణాత్ సూర్యః=కిరణములను, ప్రాణమును రసములను స్వీకరించు కారణమున సూర్యుడు.

ప్రాజాపత్య = ఓ ప్రజాపతి కుమారా, ఓ సూర్యనారాయణ, ఓ ప్రపంచమును పోషించు స్వామీ ప్రజాపతేరపత్యం ప్రాజాపత్యః ప్రజాపతి యొక్క పుత్రుడగుటచే ప్రాజాపత్యుడు.

వ్యూహరశ్మీన్ సమూహ = నీ కిరణములను పైకిలాగికొనుము నీ కిరణములను వికిరణ మొనర్పుము. వ్యూహ విగమయ రశ్మీన్ స్వాన్ సమూహ ఏకీకురు ఉపసంహర తే తేజస్తాపకం జ్యోతిః నీ కిరణములను దూరము సేయుము. నీదు తేజోవంతమైన సంతప్తకరమైన జ్యోతిని పుంజీభూత మొనర్పుము. ఏకము సేయుము, శాంతపరచుము

తేజో య త్తే రూపం కల్యాణతమం త త్తే పశ్యామి - తేజోమయమైన నీదు సర్వమంగళకరమైన దివ్యరూపమును చూచుచున్నాను.

యత్తే తవ రూపం కల్యాణతమమ్ అత్యంత శోభనం తత్తే తవాత్మనః ప్రసాదాత్ పశ్యామి. నీదు స్వరూపము అత్యంత కల్యాణమయము, అది పరమ సుందరము. నీదు పరమకృపచే నేను ఆ దివ్యమంగళ రూపమును చూచుచున్నాను.

యోఽసావసౌ పురుషః సోఽహమస్మి =నీ యందలి పురుషుడనే నేను, అతడే నేను. ఓ సూర్యభగవన్, నీయందలి పురుషుడనే నేను. సోఽహమస్మి శివోఽహం.

అతడు సర్వవస్తువులందు వ్యాపించి యుండును గావున పురుషుడన బడును. బ్రహ్మపురిని (దేహమును) ఆక్రమించియుండును, గావునపురుషుడు అనబడుచున్నాడు.

'సోఽహమస్మి' అనుటలో జీవబ్రహ్మైక్యము తెలుపబడుచున్నది. సోఽహం సః + అహం = అతడే నేను = ఆపరబ్రహ్మమే నేను (జీవాత్మను).

---

# పదునేడవ మంత్రము

వాయు రనిల మమృతం
అథేదం భస్మాంతం శరీరం
ఓం క్రతో స్మర కృతం స్మర
క్రతో సర్మ కృతం స్మర.

**టీక :—**

వాయుః = నిత్యగతసూత్రాత్మ; అనిలం = వాయువునకు, అమృతం = అమృతమైన, అథ = పిమ్మట, ఇదం = ఈ, భస్మాంతం = బూదియయ్యెను శరీరం = దేహము, ఓం = ఓంకారము, క్రతో = ఓమానసమా, స్మర = స్మరింపుము, కృతం = నాపనులను, స్మర = స్మరింపుము, క్రతో = ఓ మనసా, స్మర = జ్ఞప్తిచేసికొనుము, కృతం = నేచేసినపనులను, స్మర = జ్ఞప్తిచేసికొనుము.

**భావము :—**

నా ప్రాణము సర్వవ్యాపియైన నిత్యగత సూత్రాత్మయందు లీనమగుగాక! ఈ దేహము అగ్నిచే దగ్ధమై బూదియగుగాక! ఓం! ఓ మనసా! నా పనులను స్మరింపుము, స్మరింపుము. ఓ మనసా, నా పనులను స్మరింపుము. స్మరింపుము.

**వివరణము :**

ఈ మంత్రము పైతము ప్రాణము పోవుచున్నవాని (మరణోన్ముఖు డగు ఉపాసకుని) ప్రార్థనయే.

వాయుః అనిలం అమృతం అథ = నా ప్రాణము సర్వవ్యాపి యైన వాయువునందు, అనగా సూత్రాత్మయందు లీనమగుగాక! తన యావజ్జీవితము పుణ్యకర్మలను చేసిన యతడు తన ప్రాణప్రయాణ సమయమున తానుచేసిన పుణ్యకర్మలను తలచుకొని, పరలోకమున ఆనందపడును. అతడు తన ప్రాణము కార్యబ్రహ్మమున లీనము కావలెనని ప్రార్థించు చున్నాడు.

ఇదం భస్మాంతం శరీరం = ఈ శరీరము భస్మావశేషమగు గాక! సత్కర్మల నాచరించిన యతడు తన యావజ్జీవితము అగ్నిని పూజించియుండెను. కాన అట్టి పవిత్రాగ్నిని సంబోధించుచున్నాడు (క్రతో = ఓ అగ్ని, ఓ మనసా). ఓ అగ్ని నా యీ ప్రాణము ఈ దేహమును వదలి సర్వవ్యాపియైన సూత్రాత్మను జేరుగాకయని అతడు ప్రార్థించుచున్నాడు.

ఓం క్రతో స్మర కృతం = ఓం! ఓ మానసమా! నాపనులను స్మరింపుము. ఓ మనసా. నేను నా బాల్యమునుండి చేసిన పనులను తలచు కొనుము, జ్ఞప్తిచేసుకొనుము, స్మరింపుము.

స్మర క్రతో స్మర కృతం స్మర = ఓ పావనాగ్ని నాపనులను స్మరింపుము, స్మరింపుము, స్మరింపుము. ఓ అగ్ని నేను బాల్యము నుండి యొనరించిన అన్ని సత్కర్మలను స్మరింపుము.

'క్రతో! స్మర, స్మర, క్రతో! స్మర, స్మర' ప్రాణ ప్రయాణ సమయమునందలి వాని మనోవేదనను ఆవేదనను తెలియజేయు చున్నది.



# పదునెనిమిదవ మంత్రము

**అగ్నేనయ సుపథా రాయే**
**అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్**
**యుయోధ్యస్మజ్జుహూరాణమేనో**
**భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ.**

**టీక :—**

అగ్నే=ఓ అగ్ని, నయ=దారిచూపుము, సుపథా=మంచిమార్గము గుండా, రాయే=ముక్తికి; అస్మాన్=మమ్ము, విశ్వాని=సర్వము, దేవ=ఓ భగవన్, వయునాని = మోక్షసాధనలు, విద్వాన్ = తెలిసినవాడవు; యుయోధి=నాశమొనర్పుము, అస్మత్=మానుండి; జుహూరాణం=వక్రతమమైన, ఏనః=పాపమును; భూయిష్టాం=ఉత్తమమగు, తే=నీకు, నమఉక్తిం= ప్రార్థనను; విధేమ=అర్పించుచున్నాము.

**భావము:—**

ఓ అగ్ని, హేభగవన్, నీకన్ని మార్గములు తెలియును కావున మమ్ము మంచి మార్గము ద్వారా ఐశ్వర్యమునకు (ఆనందమునకు, ముక్తికి, పరమపదమునకు) గొంపొమ్ము. మా అంతరంగము నుండి వక్రపాతకమును తొలగింపుము. ప్రభూ! నీకు ఉత్కృష్ట సాష్టాంగ నమస్కృతులు గావించుచున్నాము.

**వివరణము:—**

ఈ యుపనిషత్తునందలి కడపటి మంత్రము ఇది. ఈశావాస్యోపనిషత్తునందలి 15, 16, 17, 18 మంత్రములు ప్రాణము వీడుచున్న

మానవుని (మరణోన్ముఖుడైన ఉపాసకుని) ప్రార్థనలై యున్నవి. ఈనాలుగు శ్లోకములకు తత్పూర్వ శ్లోకములకు బొత్తుగ సంబంధము కనబడదు, చని పోవుచున్న వాని ప్రార్థనలు ఉపనిషదంతమున చేర్చబడినవి, కడపటి పది మంత్రములు (9-18) ఆత్మజ్ఞాన స్వభావమును వర్ణింపవు.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ = ఓ అగ్నీ, మమ్ము మంచి మార్గముగుండా ఐశ్వర్యమునకు తీసికొని పొమ్ము.

పుణ్యకర్మల నాచరించిన యతడు తన ప్రాణము పోవుసమయమున తాను యావజ్జీవితము అర్చించిన అగ్నిహోత్రుని సంబోధించి ఇట్లను చున్నాడు; "ఓఅగ్నీ, మమ్ముమంచిమార్గముగుండ ఐశ్వర్యమునకు, ముక్తికి ఆనందమునకు, పరమపదమునకు గొంపొమ్ము. ఓ జాతవేదా, మమ్ము ఉత్తరాయణమున తీసికొనిపొమ్ము. ఓ దేవా, మమ్ము దేవయానమున గొంపొమ్ము. ఓ ప్రభూ, యద్గత్వాన నివర్తవితే తద్ధామమునకు గైకొని వెడలుము యాచే త్వాం పునః పునర్గమనా గమనవర్జితేన శోభనేన పథానయ. కర్మఫలభోగ నిమిత్తము మరల మరల వచ్చుట పోవుట లేనటువంటి శుభమార్గముగుండ మమ్ము గొనిపొమ్ము ప్రభూ! "

దేవయానము (Path of the Gods) లో మొత్తము పదమూడు స్టేషన్లు గలవు. అవి 1, అగ్ని 2, అహస్సు 3, శుక్లపక్షము 4. ఉత్తరాయణపు ఆరుమాసాలు 5. సంవత్సరము 6, వాయువు 7, సూర్యుడు 8.చంద్రుడు 9. విద్యుత్తు 10.వరుణలోకం 11. ఇంద్రలోకం 12. ప్రజాపతి లోకం 13. బ్రహ్మలోకం. శ్రుతిలో వర్ణించబడిన వీటిని కేవలం ప్రదేశాలుగా భావించరాదు. వాటిలో నివసించే దేవతలు (Super human beings) అని తెలిసికోవాలి. ఈ దేవతల్ని అతివాహక దేవతలు (Escorts of the emancipated pilgrim) అని పిలుస్తారు. బ్రహ్మలోకం చేరేవరకు

విగతజీవికి ఈ దేవతలు వారివారికి సంబంధించిన కేంద్రాల (Juris-dictions) ద్వారా దారిచూపుతారు.

విశ్వాని దేవ వయునాని విద్వాన్ - ఓదేవ, నీకు మోక్షము నొందుటకు గల సకల మార్గములు తెలియును. అందుచేత మమ్ము ఆనంద మునకు మంచి మార్గమున తీసికొనివెళ్ళుము.

యుయోధి అస్మత్ జుహురాణం ఏనః - మా నుండి నీచ మైన పాతకములను నిర్మూలింపుము, యుయోధి వియోజయ వినాశయ అస్మదస్మత్తో జుహురాణం కుటిలం వంచనాత్మకమేనః పాపమ్ తతోవయం విశుద్ధాః సంత ఇష్టం ప్రాప్స్యామ ఇత్యభిప్రాయః మానుండి కుటిలమైన, అనగా వంచనాత్మకమైన పాపమును వియుక్త మొనర్పుము, నాశమొనర్పుము. అప్పుడు మేము పరిశుద్ధులమై మా యిష్ట ప్రాప్తిని పొందగలుగుదుము అనిఅర్థము,

ఓ ప్రభూ. నీవు పవిత్రుడవు, పావనుడవు, హేభగవన్, మాలోని దుష్టపాతకములను నాశమొనర్పుము. మేము నిర్మలులమై ఆత్మానంద భాగ్యమును గ్రోలెదముగాక!

భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ = ప్రభూ, నీకుఉత్కృష్ట ప్రణిపాతముల గావించుచున్నాము. కింతు వయమిదానీం తే న శక్నుమః పరిచర్యాం కర్తుమ్ భూయిష్ఠాం బహుతరాం తే తుభ్యం నమ ఉక్తిం నమస్కారవచనం విధేమ నమస్కారేణ పరిచరేమ ఇత్యర్థః.

మరియు ఈ సమయమున మేము నీకు పరిచర్యలు చేయ నసమర్థులము. అందుచేత మేము నీ కోసము అనేక నమస్కార వచనములు చేయుచున్నాము. అనగా, నమస్కారముతో నీకు పరిచర్యనొనర్చు చున్నాము, అని అర్థము.

ప్రభో, నీకివే మా సాష్టాంగనమస్కారములు. ఓ దేవా, నీకు తెలియనిది లేదు. మమ్ము దయగొనుము, దారిజూపుము, త్రాహి, ప్రచోదయాత్.

'ఓం అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్ మా అమృతం గమయ,'

మమ్ము చెడునుండి మంచికి, చీకటి నుండి వెలుగునకు, మృత్యువు నుండి అమృతత్వమునకు గొంపొమ్ము. ఇదే మా మనఃపూర్వక ప్రార్థన.

ఈ సందర్భములో భగవద్గీతయందలి ఈ శ్లోకము స్మరణకు వచ్చుచున్నది,

యం యం వాపి స్మరన్ భావం
త్యజత్యంతే కళేబరం
తం తమేవైతి కౌంతేయ
సదా తద్భావభావితః

ఓ కౌంతేయ, ఎవడు తనఅంత్యకాలమున దేనిని తలచుచు దేహమును వదలునో తన భావమునకు అనుగుణముగ అందు నిమగ్నుడై సతతము తలచుచున్నందున, అతడు ఆయా స్వరూపమునే పొందును.

అందువల్ల చివరి భావన మరొక దేహమును (ఆ భావనకు అనుగుణమైన దానిని) పొందుటకు హేతువై యున్నది.

శ్రీ కులశేఖరులు ఇట్లు ప్రార్థింతురు.

కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంతం
అద్యైవ మే విశతు మానసరాజహంసః

ప్రాణ ప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే.

— ముకుందమాల.

Let the white swan of my holy mind
(Now itself) Enter the cage of Thy Lotus feet.
Hey Krishna, at the time of death
or the egress of the vital breath,
When the forces of phlegm, wind and bile
Block up the throat and torment the while,
Thy remembrance is a tale futile;
Protect me with Thy gracious smile.

— MUKUNDA MALA.

ప్రభూ, కృష్ణ, నా మనస్సు అనెడి రాజహంస ఇప్పుడే నీదు పాద సరోరుహము లనెడి పంజరమున ప్రవేశించుగాక। ప్రాణము పోవు సమయమున, కఫ వాత పిత్తములు కంఠమునకు అడ్డుపడి నప్పుడు నీ స్మరణ ఎక్కడిది?

# గ్రంథార్థ వివేచనము

ఈశావాస్యోపనిషత్తులోని *ఈ రెండు శ్లోకపాదాలు విన్న తరువాత కొందరకు సంశయం కలుగవచ్చు.

> * 'అవిద్యయా మృత్యుం తీర్త్వా
> విద్యయామృతమశ్నుతే,' (ఈ. ఉ. 11)
> 'వినాశేన మృత్యుం తీర్త్వా
> సంభూత్యా మృతమశ్నుతే.' (ఈ ఉ 14)

ఈ సంశయ నివృత్తినిమిత్తం మనం సంక్షేపంగా విచారిద్దాం. సరే, ఈ సంశయం. అసలు ఎందుకు వచ్చింది? దాన్ని గురించి మాటాడుతూన్నారు.

పూర్వపక్షి: 'విద్యా' శబ్దానికి పరమార్థవిద్యయని, 'అమృత' శబ్దానికి అమృతత్వమని అర్థం ఎందుకు చెప్పకూడదు?

సిద్ధాంతి: 'పరమార్థ విద్య,' 'కర్మ' — ఇవి రెండు పరస్పర విరుద్ధములైన కారణమున వాటి సముచ్చయము ఏర్పడేందుకు వీలులేదు.

పూర్వపక్షి: మీరు చెప్పింది సత్యమే. అయితే, ఈ విరోధంకాని, అవిరోధం కాని శాస్త్ర ప్రమాణం ప్రకారమే చెప్పాలి. అందువల్ల ఈ సందర్భంలో విరోధమేమీ కనబడడం లేదు. ఏవిధంగా అవిద్య యొక్క అనుష్ఠానం, విద్యయొక్క ఉపాసన — ఇవి రెండూ శాస్త్రప్రమాణానుసారంగా ఉన్నాయో అలాగే వాటి విరోధం, అవిరోధం కూడ ఉన్నాయి. శాస్త్రంలో 'ఏ ప్రాణికి హింస చేయరాదు' (న హింస్యాత్ సర్వ భూతాని) అని ఉంది. మరల అదే శాస్త్రంలో 'యజ్ఞంలో పశువును హింసించు' (బాధ్యతేఽధ్వరే పశుం) అని ఉంది. ఈ విధంగానే విద్య, అవిద్యల సంబంధం ఉంది అనుకోవచ్చు. అందువల్ల విద్యయొక్క కర్మ

యొక్క సముచ్చయము(విద్యాకర్మణోశ్చ సముచ్చయః) కలదనవచ్చును.

సిద్ధాంతి : అలా అనేందుకు లేదు. శ్రుతి ఇలాచెబుతూంది.

"దూరమేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యా."

— కఠోపనిషత్తు

విద్యయొక్క గతి, కర్మయొక్కగతి భిన్నభిన్నములుగ ఉన్నాయి. అందువల్ల విద్య, కర్మ — ఇవి రెండు సర్వథా విపరీతము లే.

పూర్వపక్షి ; 'విద్యాం చావిద్యాం చ — ఈ వాక్యానుసారము ఈ రెండింటికి అవిరోధముకాదా ?

సిద్ధాంతి : అలాకాదు. హేతు స్వరూప ఫల విరోధాత్, వాటి యొక్క హేతువు, స్వరూపము, ఫలము — వీటిలో విరోధం ఉంది.

పూర్వపక్షి: విద్య, అవిద్యల యొక్క విరోధ అవిరోధములు వస్తుతః వున్నవే. ఈ విషయం పురుషుని అధీనం. అందువల్ల వాటి సముచ్చయము సంభవమే, అవి అవిరోధాలే.

సిద్ధాంతి ; ఇవి రెండు ఒకదానితో ఒకటి ఉండడం సంభవంకాదు.

పూర్వపక్షి ; అట్లాగైతే. విద్య, అవిద్య క్రమంగా ఒకే ఆశ్రయంలో ఉండేవి అని అనుకోవచ్చుగదా.

సిద్ధాంతి ; అలాకాదు, విద్యోత్పత్తి అయిన మీదట అవిద్య నాశమౌతుంది. మరల దాని ఆశ్రయంలో అవిద్యోత్పత్తి జరిగేందుకు లేదు. 'అగ్నికి ఉష్ణం. ప్రకాశం ఉంది.' ఈ జ్ఞానం కలిగిన మీదట, ఆ చిత్స్వరూప ఆశ్రయంలోనే 'అగ్ని శీతలంగా ఉంది. చీకటిమయంగా ఉంది' అనే అజ్ఞానం ఉండజాలదు. ఈ విషయంలో అతనికి ఎటువంటి సందేహంగాని. భ్రమగాని లేదనుట స్పష్టం.

'యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః కః శోక
ఏకత్వమనుపశ్యతః' (ఈ. ఉ, 7)

జ్ఞానికి శోక మోహాలు అసంభవమని చెప్పబడింది. ఇతి శ్రుతి ప్రసిద్ధం. ఈ విధంగా అవిద్య అసంభవమని తెలిసికొన్న తరువాత కర్మ కూడ అసంభవమనే తెలియాలి, ఈ విషయాన్ని ముందే అనుకొన్నాము. 'అమృతం' అంటె తెలిసికోవాలి. 'విద్యా' శబ్దానికి 'పరమార్థవిద్యా' అని అర్థంచెప్పితే, 'హిరణ్మయేన పాత్రేణ' మొదలగు మంత్రాలలోని మార్గాది యాచనకు వీలుండదు. ఆ కారణంచేత విద్య (**దేవతాజ్ఞానము**) అవిద్య (కర్మ) ల సముచ్చయము సంభవమేకాని పరమార్థ జ్ఞానముతో కర్మ సముచ్చయము అసంభవమని తెలిసికొనవలెను.

శ్రీ శంకరులవారు జ్ఞాన కర్మ సముచ్చయ వాదనను ఖండింతురు, వారు చెప్పునదేమన:-

నిష్కామ్య సేవవలన చిత్తశుద్ధి చేకూరుతుంది. చిత్తశుద్ధి చేకూరిన పిదప ధ్యానయోగఅర్హత కలుగుతుంది. ధ్యానం ద్వారా జ్ఞానం కలుగుతుంది. జ్ఞానంవల్ల మోక్షం ప్రాప్తిస్తుంది.

ఈ సందేశాన్నే శ్రీ శివానందయతీంద్రుల వారు ఇలా బోధిస్తారు.

Serve, Love Meditate. Realise

సేవింపుము. ప్రేమింపుము, ధ్యానింపుము, సాక్షాత్కారమునొందుము



# శాంతి మంత్రము

ఓం. పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే.
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం అది పూర్ణము ఇది పూర్ణము.
పూర్ణమునుండి పూర్ణము ప్రభవించును.
పూర్ణమునుండి పూర్ణమును ప్రత్యాహారము
చేయగ ఇంకను పూర్ణమే మిగులును.

అనగా

ఆ అగోచరమైన సకలము పరబ్రహ్మమే. ఈ సగోచర సర్వస్వము పరబ్రహ్మమే. కార్యబ్రహ్మము (హిరణ్యగర్భుడు) పరబ్రహ్మము నుండియే ఉత్పన్నమయ్యెను. పరబ్రహ్మము నందు కార్యబ్రహ్మము లీనమైనపుడు పరబ్రహ్మమే మిగులును.

ఓం శాంతిః! శాంతిః!! శాంతిః!!! ఈ మంత్రము సర్వోపనిషత్తుల సారము.

హరిః ఓం తత్ సత్

ఓం

# ఈశోపనిషత్తు సారసంగ్రహము

ఈ విశ్వమునందంతట పరమేశ్వరుడు అంతర్ వాసియైయున్నాడు. నామ రూపములను వదలి బ్రహ్మానందమును అనుభవింపుము. పరుల ధనమునకై లోభపడకుము. అహంకారమును వీడి, పరమశాంతిని అనుభవింపుము. నిస్వార్థముగ కర్మలొనరింపుము. నూరు సంవత్సరములు మనుటకు యత్నింపుము, నిష్కామ్య కర్మలు నిన్ను నిర్లిప్తుని జేయును. బ్రహ్మము పరము, అనంతము, అఖండము, అచలము. ఆత్మ అన్నిటికి అంతరమున, బాహ్యమున గలదు. ఆత్మ అకాయము, అవ్రణము, అస్నావిరము. ఆత్మ పరిశుద్ధము. అనఘము, నిర్లిప్తము. ఆత్మ సర్వగతము, తేజోమయము ఈ సర్వప్రాణులలో ఎవడు బ్రహ్మమును తెలిసికొనునో అతడు శోకమును తరించును. ఆత్మను సర్వత్ర ఆలోకించువానికి శోకమోహములు ఉండవు.

శుద్ధబ్రహ్మమును ఆరాధింపుము, ధ్యానింపుము. అవిద్యోపాసకులు అంధకారమున పడెదరు. సంభూతి ఉపాసకులు అంధకారమున పడెదరు, విద్యోపాసకులు అంధకారమునపడెదరు, అసంభూతి ఉపాసకులు అంధకారమున పడెదరు. నీ జీవిత గమ్యము ఆత్మసాక్షాత్కారము,

అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్ మా అమృతం గమయ.

ప్రభూ. మమ్ము చెడునుంచి మంచికి,
చీకటినుంచి వెలుగుకు,
మృత్యువునుంచి అమృతత్వమునకు గొంపొమ్ము.

ఓం తత్ సత్

ఓం

# శ్లోక వర్ణానుక్రమణికా





# ఈశావాస్య ఉపనిషత్తు

శాంతిపాఠం

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం - ఓం, అదః - అది, పూర్ణం - అనంతం, ఇదమ్ - ఇది, పూర్ణం - అనంతమైనది, పూర్ణాత్ - అనంతంనుంచి (కంటికి కనిపించని ఈ అనంతం నుంచి), పూర్ణం - అనంతం (గోచర ప్రపంచమంతా), ఉదచ్యతే - ఉద్భవిస్తోంది, పూర్ణస్యపూర్ణమాదాయ - అనంతం నుంచి అనంతం తీసివేస్తే, పూర్ణం ఏవ- అనంతమే, అవశిష్యతే - మిగిలివుంటుంది, ఓం - ఓం, శాంతిః - శాంతి.

అది (ఆ కనిపించని అనంతం) పూర్ణం. ఇది కూడా (కనిపించే అనంతవిశ్వం) పూర్ణం.ఆ పూర్ణం నుంచి ఈ పూర్ణం బహిర్గతమౌతోంది. పూర్ణం నుంచి పూర్ణంతీసివేసినా పూర్ణమే మిగిలివుంది.

ఓం ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేనత్యక్తేన భుంజీథాః మాగృథః కస్యస్విద్ధనమ్. 1

జగత్యాం - జగత్తులో, యత్ కించ - ఏదేదైతే, జగత్ - మార్పుచెందేది,

ఇదం సర్వం - ఇది అంతా, ఈశా - భగవంతునిచేత, వాస్యం - ఆవరింప బడి వుంది, తేన త్యక్తేన - ఆ త్యాగం చేత, భుంజీథాః - పోషణచేసుకో, కస్య స్విద్ ధనమ్ - ఎవని ధనాన్ని మాత్రము, మాగృధః - ఆశించకు

ఈ జగత్‌లో మార్పుచెందేది ఏదేది ఉన్నదో అదంతా భగవంతునిచేత ఆవ రింపబడివుంది. ఈ త్యాగం చేత నిన్ను నీవు పోషించుకో. ఎవరి ధనాన్ని మాత్రము ఆశించకు.

కుర్వన్నేహ కర్మాణి జిజీవిషేత్ శతగ్ం సమాః ।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తిన కర్మ లిప్యతే నరే ॥ 2

ఇహ - ఈ జగత్తులో, కర్మాణి - శాస్త్రవిహితములైన కర్మలను, కుర్వన్ - చేస్తూ, ఏవం - ఇదేరీతిగా, త్వయి - నీకు, నరే - మానవునకు, ఇతః - ఇం తకంటే, అన్యథా - వేరోక మార్గం, న అస్తి - లేదు, కర్మ - కర్మ, న లిప్యతే - అంటదో

శాస్త్రవిహితమైన నైమిత్తిక కర్మలు ఆచరిస్తూ మాత్రమే మానవుడు నూరు సంవత్సరాలు జీవించాలని కోరుకోవాలి. మానవ జీవితం పైన ఆసక్తి ఉన్నంత వరకు దుష్కర్మకాలుష్యాన్ని దూరం చేసుకోడానికి ఇది తప్ప మరోదారి లేదు.

అసుర్యానామతే లోకా అంధేన తమసావృతా ।
తాగ్ంస్తే ప్రేతాభిగచ్ఛన్తి యేకే చాత్మహనో జనాః ॥ 3

అసుర్యః - రాక్షసులకు చెందిన, అంధేన తమసా - కటిక చీకటి చేత, ఆవృ తాః- ఆవరింపబడినవి, నామ - నిజంగా, తే - ఆ, లోకాః - జన్మలు, యేకే - ఎవరెవరైతే, చ - కూడా, జనాః - జనులు, ఆత్మహనః - ఆత్మహంతకులో, తే - వారు, ప్రేత్య -మరణానంతరము, తాన్-ఆయా జన్మలను,అభిగచ్ఛన్తి - పొం దుతారు.

నిజంగా ఆ జన్మలు కటికచీకటిచేత ఆవరించబడిన రాక్షసజన్మలు. ఆత్మహం త కులైనవారు మరణానంతరం వాటిని పొందుతారు.

అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా
ఆప్నువన్ పూర్వమర్షత్।
తద్ధావతో౽న్యానత్యేతి తిష్ఠ
త్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥ 4

తత్ - ఆ ఆత్మ, ఏకం - ఒకటే, అనేజత్ - చలనములేనిది, మనసః - మనస్సు కంటే, జవీయః - వేగవంతమైనది,దేవాః - ఇంద్రియములు, ఏనత్ - దీనిని, నఆప్నువన్ - గ్రహించలేవు, పూర్వం అర్షత్ - మనస్సుకంటే ముందు వెళ్ళింది,

తత్ - అది, తిష్ఠత్ - స్థిరంగా ఉంటూ, ధావతః - పరుగెత్తుతూవున్న, అన్యాన్ - ఇతర విషయాలను, అత్యేతి - దాటిపోతుంది, తస్మిన్ - అది వుండడంచేత, మాతరిశ్వా - విశ్వాశక్తి అంటే ప్రాణశక్తి, ఆపః - ప్రాణులయొక్క కార్యకలాప మంతా, దధాతి - భరిస్తోంది.

ఆత్మ ఒక్కటే చలించనిదైనా మనస్సుకంటే వేగవంతమైనది. మనస్సుకన్నా ముందే వెళ్ళగలదు కనుక అది ఇంద్రియాలకు అందదు. నిత్యమూ స్థిరమైన దైనా పరుగెత్తే అన్నిటికన్నా వేగవంతమైనది. ఆత్మ సకలప్రాణికోటుల కార్యకలాపాలను భరించటానికి ప్రాణశక్తిని సమకూరుస్తోంది.

త దేజతి తన్నైజతి త ద్దూరే తద్వంతికే ।
త దన్తరస్య సర్వస్య త దు సర్వ స్యాస్య బాహ్యతః ॥ 5

తత్ - అది, ఏజతి - చలించుచున్నది, తత్ - అది, న ఏ జతి - చలించదు, తత్ - అది, దూరే - దూరంలో వుంది, తత్ - అది, ఉ అంతికే - దగ్గరకూడ వుంది, తత్ - అది, ఉ - ఇంకా, అంతరస్య - లోపల, సర్వస్య అస్య - సర్వత్ర వుంది, బాహ్యతః - బయట కూడా వుంది.

ఆత్మ చలిస్తోంది, చలించదు. అది దూరంలోవుంది, దగ్గరకూడా వుంది. అది లోపలా బయటా అంతావుంది.

యస్తు సర్వాణి భూతాన్యాత్మ న్యేవాను పశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥ 6

